# శ్రీ మ ద్రా మా య ణ

# కల్పవృక్షంలో శబరి-శ్రీరాముడు

[ విశ్వనాథ దర్శనం - విగ్రహ విమర్శ ]



గ్రంథకర్త :

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ

తెలకోవెల

బలుసుమూడి - భీమవరం

ప॥ గో॥ జిల్లా - 534 202



## :- అంకితము -:

ఉ. ధీయుత విశ్వనాథకుల-దీధితివై నెలకొన్న సత్యనా
రాయణ! కొమ్మదే శబరి-అవ్వఁగలంగ వచించినట్టి నీ
స్వీయవిశిష్ట సృష్టిపరి-శీలన, నీకవితాత్మవిగ్రహా
న్వాయ విమర్శఁదీర్చి, సరి-నాటితి,నీముడు పంటిఁబ్రేముడిన్.

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ

# విషయ సూచిక

# లో చూపు

"ఖ్యాతింగ మయతి సుజనః సుకవిర్విదధాతి కేవలం కావ్యమ్!
పుష్ణాతి కమల మంభోలక్ష్మ్యాతు రవిర్నియోజయతి॥"

సుకవి కేవలం కావ్యాన్ని నిర్మిస్తాడు. దానికి సహృదయుడు ఖ్యాతిని కలిగిస్తాడు. నీరు కమలాన్ని పోషిస్తుంది. దానికి కాంతిని మాత్రం సూర్యుడిస్తాడు. అన్నట్లుగ ఒక మహాకవి కావ్యం అతనికి తగిన రీతిలో ప్రశస్తికి రావాలంటే సద్విమర్శకుడు కావాలి. అపుడు కానీ ఆ మహాకవి ప్రతిభ వెలుగుచూడదు, అట్టి మహాకవి విశ్వనాథ - వారి ప్రతిభను పట్టి చూపిన సద్విమర్శకుడు శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణశర్మ.

విశ్వనాథవారి శ్రీ మద్రామాయణ కల్పవృక్షంలోని శబరి వృత్తాంతాన్ని గైకొని సంతరించిన "కల్పవృక్షంలో శబరి - శ్రీరాముడు" (విశ్వనాథ దర్శనం-విగ్రహ విమర్శ) అను విమర్శన గ్రంథమిది. ఇందులో ముఖ్యంగా శబరి - లక్ష్మణుడు - మతంగముని. శ్రీరాముడు పాత్రల ఆధ్యాత్మిక తత్త్వాలు క్షేత్రజ్ఞుడు - సాక్షి - కూటస్థుడు - అంతరాత్మలుగా శ్రీరామకృష్ణశర్మ నిరూపించిన తీరు మిక్కిలి ప్రశంసనీయంగా ఉంది. వీరి నిరూపణ చూచిన తర్వాత ఆధ్యాత్మిక స్పర్శలేని భారతీయకళ లేదను నా అభిప్రాయము మరింత దృఢపడినది. ఇదియే మన భారతీయ సంస్కృతిలోని వైలక్షణ్యం.

శ్రీ విశ్వనాథవారి రచనలో "శబరీ శ్రీరామమ్" ఏకాంకికను దర్శించి సవ్యాఖ్యానంగా ప్రదర్శించి ఆధ్యాత్మిక తత్త్వంలోని సూత్రం పట్టుకొని అసలు సిసలైన సూత్రధారుడైన వారు శ్రీ శర్మగారు. నీరు (జలం) శబరి విషయకంగా ప్రస్తావింపబడకపోవటంలోని అంతర్యాన్ని సాహిత్యపరంగానే కాక ఖగోళ (శాస్త్ర) దృశ్య పరంగా కూడా అన్వయించి ఆశ్చర్యంతోపాటు ఆనందాన్ని కలిగించారు.

ఇక ముఖ్యంగా పేర్కొనవలసింది "చత్వారిశృంగా ..." అన్న ఋక్కునకు వీరిచ్చిన సామాజిక పరమైన అన్వయం శాస్త్రీయంగానూ అత్యద్భుతంగానూ ఉంది. ఈ ఋక్కు ఇదివరకు శబ్ద బ్రహ్మ పరంగా, యజ్ఞ పురుషపరంగా కావ్యపురుషపరంగా అనేక వ్యాఖ్యానాలు ప్రాచీనసాహిత్యంలో చేయబడ్డాయి. అయితే అవన్నీ వారివారి శాస్త్రాల కనుగుణంగా భావాత్మక సాదృశ్యాన్ని బట్టి చేసిన అన్వయాలే. కాని ఇప్పుడు శర్మగారు సామాజిక పరముగా అన్వయించిన దాంట్లో అర్థాన్నిబట్టి అన్వయం కుదరటం ఆశ్చర్యాన్ని కలిగించక మానదు. (పురుష సూక్తంలోని చాతుర్వర్ణ్య ప్రస్తావనకు సామాజిక పరముగా ఇట్టి అన్వయాన్ని సాయణాచార్యులవారు చేసి ఉన్నట్లుగా పెద్దల వల్ల వినియున్నాను.)

ఏతావతా వీరి విమర్శను గూర్చి - వారి మాటలలోనే చెప్పాలంటే- "నిర్మాణాత్మక దృష్టి - నిర్మాణాత్మకమైన భావనలన్నీ అంతర్నిహిత సూత్రాలే ఔతుంటాయి" అని - అలా నిర్మాణాత్మక దృష్టి, భావనా కలది శ్రీ శర్మగారి విమర్శ. ఈ రెండూ అట్టి సూత్ర బద్ధములే అనుట నిస్సంశయము. కాకపోతే ఈ శబరీఘట్టమువ మన్మథ ప్రవేశమునకు సుమనస్సుం భావన గలదని ఊహించుటెట్లు! వేదాంతం నేడు చెప్పేవారికి, వినేవారికీ కూడా అలవోకగా (స్థిరాభిప్రాయ రహితంగా) అబ్బి ఇష్టం వచ్చినట్లు జీవ పరమాత్మలను ముడి పెట్టడం అనవాయితీ అయింది. అలా కాలక్షేపవేదాంతం కాక – సూత్రబద్ధమైన ఆలోచనాధారతో, శాస్త్రీయ ప్రామాణికతను (ఔపనిషదమైనదిగా) సంతరించుకొనిన శ్రీ శర్మగారి ఈ వ్యాసములో శ్రీ విశ్వనాథవారి శ్రీమద్రామాయణ కల్పవృక్షములోని శబరీ - శ్రీరామ ఘట్టానికి క్రొత్త వెలుగు వాసనల గుబాళింపు వచ్చినదని నా విశ్వాసము.

ఈ విమర్శ గ్రంథంలో శ్రీ శర్మ గారిరితకీ శ్రీ విశ్వనాథవారి ధీషణాహంకారాన్ని పొగడినట్లా? తెగిడినట్లా! అంటే - ధిషణకు పట్టం కట్టారు. అహాన్ని కట్టడి చేసారు. రాగద్వేషాల కతీతంగా ముఖ్యంగా కథలోని లక్ష్మణసాక్షిలాగె యథార్థవస్తుస్థితిని ఆవిష్కరించారు. అందుకే సద్విమర్శకులు.

చివరిగా శర్మగారే పాఠకుల్ని కూడా చదివి సరిగ్గా గ్రహించండి. ఆ ని 51వ పుటలో ఇచ్చిన 334వ సీస పద్యంలో "మెల్లగా వచ్చె శబరి తుట్ట తుదదాక నెండిన చెట్టుకొమ్మ, శేఖరంబునయందు బుష్పించినట్లు" అనేది అచలం అయిన చెట్టు చలద్వనితగా చెప్పడంలో ఉపమ సమంజసం కాద నటం నిజమే. కాని ఉత్ప్రేక్షలో సామ్యధర్మప్రసక్తి వదిలేస్తే "నడపీనుగు వచ్చు ననుచు నగుదురు సుమతీ" అనే దానిని "నడిపీనుగు" ఎండిన చె ట్టు (యొక్క) కొమ్మ ఒకటి ఊహింపబడినట్లు స్వీకరిస్తే శ్రీ విశ్వనాథలో ఎంచిన తడబాటు నివారించవచ్చుననుకొంటాను. అది ఉత్ప్రేక్షాలం కారమే. విజ్ఞులు పరిశీలింగలరు.

"వేదవేద్యేపరేపుంసి జాతేదశరథాత్మజే!
వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షాద్రామాయణాత్మనా॥

అనునది ముమ్మాటికీ సత్యమని ఈ వ్యాసమూలముగా కూడా మరోసారి నిరూపిత మైనదని మనస్ఫూర్తిగా భావిస్తూ –

బుధజన విధేయుడు
ఆర్వీఆర్ కృష్ణశాస్త్రి

డా॥ రేమిల్ల వెంకట రామకృష్ణశాస్త్రి ఎం. ఏ., పిహెచ్. డి.
లెక్చెరర్, పి. జి. తెలుగు శాఖ
డి. ఎన్. ఆర్. కళాశాల
భీమవరం – 534 202

# -: ప్రణతి :-

నా రచనగా ప్రకటించుకొనే ఈ గ్రంథవిషయం ఆ పరమాత్మ శక్తి సంపాతమే కాని, నేనేదో తెలిసి తెలివిలో ఉండి చెప్పిందికాదు. (లోటుపాట్లన్నీ నావే.) శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మన సాహిత్యంలో ఓ సమర్థవంతమైన గట్టి పీటముడి అయితే శ్రీమద్రామాయణం బింకంగల స్పష్టతాసూత్రం గనుక, ఎలాగైనా ఆ ముడివిప్పి అందులోని తత్త్వ విగ్రహాన్ని బయటపెట్టవచ్చనే ఆశపుట్టి-పట్టి మూఢనమ్మకంతోనే ఈ సాహసం చేసాను. నా సాహసంలో తొందరపాటూ, తడబాటూ, తెలివాల్లున్నా అంతర్యంలో జాతీయమైనఆప్యాయత గుర్తించివినావాటినిపట్టించుకొక నన్ను మన్నిస్తారని ఆశిస్తున్నాను. ఆదరంతో ఆ పట్టులెత్తి చూపిస్తే మరో అవకాశం చిక్కినప్పుడు సర్దుబాటు చేసుకుంటానని మనవి చేస్తున్నాను. ఏమైనా ఆ పరమాత్మ కరుణా కటాక్షసరిర్ఝురి నా చేతి కలం గుండా జాలువారి, యీ గ్రంథ సరస్సంపాతం గావటం నాకు దక్కిన మహాభాగ్యం. త్రైలోక్యోన్నత భావప్రేరణకై ధ్యానిస్తూ చేసే నా గాయత్రీ మంత్ర జపః ఫలం! యాదృచ్ఛిక హేతుభూతుడైన కీ॥ శే॥ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికి ముందుగా నా కృతజ్ఞతా నమస్కారం చేస్తున్నాను.

ఈ గ్రంథానికి నిష్పక్షపాతమైన 'లోచూపు' కోరిన వెంటనేవ్రాసి యిచ్చిన డా॥ శ్రీరేమిల్ల వెంకట రామకృష్ణశాస్త్రి గారికి నా కృతజ్ఞతాశీస్సులందిస్తున్నాను.

గ్రంథాకృతికి అందాలు దిద్దినవారు-ముచ్చటైన క్రొత్త అచ్చులతో "ఇమ్రాన్ ఆర్ట్ ప్రింటర్స్ - భీమవరం వారు, దాని అధినేత జనాబ్ అబ్దుల్ మోహమ్మూద్ ఖాన్ గారు, ఫోటోలు తీసియిచ్చిన శ్రీబల్లా రామలింగేశ్వరరావు గారు, బ్లాకులు చేసియిచ్చిన సాయి బ్లాక్ మేకర్స్ - భీమవరం వారు, ఈ సంస్థాత్రయానికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభినందనలు.

ముఖ్యంగా శ్రీ తోలేటి ఆంజనేయులు (వారికీ నాకృతజ్ఞత)నుండి 'శబరీ శ్రీరామ' చిత్రపటం సంపాదించటం దగ్గర్నుంచీ ప్రూఫ్‌లుసరి చూడటమూ, టైటిల్ స్ట్రక్చర్ రూపొందించటం వరకూ అన్ని పనుల్లోనూ ఆత్మీయతనిండినసహృదయంతో ఫలాపేక్షారహితంగా ఎంతో శ్రమించిన చి. దర్భా సర్వేశ్వరరావు-జ్ఞానేశ్వరీ పవర్ ప్రెస్ భీమవరం అధినేత. కు నా కృతజ్ఞతాపూర్వక శుభాశీస్సులందిస్తున్నాను.

కాగా ఎవరెంత శ్రద్ధ చూపించినా ఏవో లోటుపాట్లు దొర్లక మానవు. అందులోనూ ముద్రా-రాక్షసాలు-క్రొత్తగా మొదలు పెట్టిన చిన్న ప్రెస్-అనుభవం లేనందున తప్పులు అధికంగానే ఉన్నాయి. వాటిని చదువరులు జాగ్రత్తగా సవరించుకొంటూ గ్రంథానికి సహకరించవలసి ఉంటుంది. కనుక ముందే కృతజ్ఞతలందించుకొంటున్నాను.

"ప్రగతికి ప్రాచీనం పటిష్ఠమైన పునాది"

మీ

జొన్నవిత్తుల రామకృష్ణ శర్మ

ప్రజోత్పత్తి కార్తిక శుద్ధ, చతుర్థీ
10-11-1991 ఆదివారం

తెలకోవెల
బలుసుమూడి
భీమవరం ప॥గో॥జిల్లా
535 202

# కల్పవృక్షంలో శబరి-శ్రీరామ...డు

తాను వ్రాసిన గ్రంథసంచయమే లెక్కకు మిక్కిలి అంటుంటే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు చదివిన గ్రంథాలమాట వేరే చెప్పాలా? సంస్కృత ఆంధ్ర ఆంగ్లాల్లో అసమానాధికారంతో ఆయన చదివినవాటి వైవిధ్యాన్నెన్నాలా! ఎన్నిశాస్త్రాలూ, ఎంత సాహిత్యం! ఆయా నిధులన్నింటినీ కొల్లగొట్టి తెచ్చి ఒకచోట నిక్షిప్తం చెయ్యటానికి ఆయన ఎంచుకొని నిర్మించి దాచిపెట్టిన కోశాగారమే శ్రీమద్రామాయణ కల్పవృక్షం అనిపిస్తుంది. మరి ఆ కల్పకం ఏంప్రసాదిస్తుందీ అంటే (ఎవరేదికోరుకుంటే దాన్నే ఇస్తుంది లెమ్మని అనటం అయితే తేలికే గాని) తానుగ్రహించి ఇతరుల కందించటం మాత్రం ఏమంత సులువు కాదు. ముచ్చటకి ముందాయన అన్న ఈ నాలుగు మాటల విషయం ప్రయత్నించండి.

"ఒక ప్రౌఢుడైన కవి శబ్దములు భాషలోనే యుండును అక్కర్లేదు గాని యాకవి తనయొక్క ఆత్మద్రవ్యమున కనుకూలమైన శబ్దములను తెచ్చికొని పోవుపెట్టును వాని యందొక వైలక్షణ్యముండును. అందరికిని తెలియదు. (స్వీయ విశ్వాసం) శబ్దముల కూర్పు చేత నొక యేదోధ్వని యుదయించును. ఈ ధ్వని కావ్యధ్వనికాదు. (కావ్యధ్వని లేని కావ్యమా అనిపిస్తుంది,) మహాకవి యక్కడ నున్నాడు. (అంటే కవిరచనా వ్యక్తిత్వమే ఆయన అన్న ధ్వని అనీ ఆ ధ్వనిలో ఆకవివ్యక్తి ఉండటం అయిఉంటుంది ) దానిని గ్రహించుటకు శబ్దబ్రహ్మ సాక్షాత్కరింప వలయును " (కల్పవృక్ష రహస్యములు.)

ఇది చదివాక నా సూక్ష్మబుద్ధికి సాక్షాత్కరించినవి ముఖ్యంగా రెండున్నాయి. 1. ఈ వాక్యాలు అస్పష్ట మధురంగా ఉన్నాయి. 2. ఉద్దండవాదం. (నామాట కాదన్న గాడి... ఎవడన్నాఉంటే నా ముందుకు రమ్మనండి....అంటే ఎవరు వస్తారూ అన్నది మొదటి ధీమా. ఒకవేళ తెగించి ఎవరన్నా వస్తే ఇలాగే ఏదో చెప్పి చివరికి 'నీకు శబ్దబ్రహ్మ సాక్షాత్కారంలేదు పో' అనటం విజయంగా చెప్పుకునే మొండి ధీమా రెండవదీ కదపటిదీకూడ )

భావకవిత్వం (ఆయుగంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గూడా భాగస్వామియే.) లో అయితే ఈ అస్పష్ట మాధుర్యం ఓ కవితా గుణం. భావావేశనందనవనంలో మాటల అతుకు చితుకు లేరకూడ దనేది అతిరహస్యం. ఎక్కడముక్కలక్కడ పడిఉంటేనే ప్రకృతి సహజ సౌందర్యం అంటారు. ఇంక మహా మహిమోపేతమైన (కల్ప వృక్ష) కావ్యశిల్పంలో కూడానా! (మహిమోపేతం గనుక అసలు చితుకులే ఉండవని నవ్వులాటగా అనవచ్చుగాని) అనుమానించ నక్కర్లేదు. ఆయన కావ్యశిల్పంలోనే కాదు కైలాసం (లోకం) లో ప్రవేశించినా అంతే. ఆవేశం. అసలా ఆవేశమే జీవికి సుకరం జీవితం లో. అంటా డాయన సాక్షాత్కల్పవృక్ష అరణ్యకాండ పంచవటీ ఖండంలో. (ఆ దేవ తరువునే ఆవేశం ఖండాలు చేసిందయ్యే. కవి విధి కదా!) పర్ణశాల నిర్మించాక లక్ష్మణస్వామి తామయోధ్యలో విడిచి వచ్చిన కౌసల్యాదేవి యందు సానుభూతి ప్రకటిస్తూ

గీ. భక్తియో, సేవయో, ధర్మ-పథము చనుటొ
యొక మహావేశమున్నజీ-వికి సుకరము
జీవితము, భరతుఁడు; నేను-నీవు గాఁగ
లేని పెదతల్లి బ్రతుకుబ-ర్వౌను లెట్లు (82 పద్యం)

సామాన్యులుమాట్లాడు కుంటుంటె భక్తిలాంటి కాలక్షేపాలని వ్యాపకాలంటారు. ఈ ఉద్దండుడుచూడండి మహావేశం అంటాడు. పైగా నిర్వికారాత్మక పరిశుద్ధ చిత్తంలో సేవాభావాన్ని భజిస్తూన్నాడే ఆ లక్ష్మణస్వామి. ఆయన చేతే అనిపిసావే అనబోతే “నేనేమిటోయ్ తిక్క న్నే అన్నాడు. అసలు సాక్షాత్ వేదవ్యాస మహర్షి యే (తిక్కన్న అన్నా డు గనుక) భవ్య కవితావేశుడు అని దబాయించే వాడు ఇంతెందుకు తాను వేదవ్యాసుడి నైనా మించినవాడి ననుకోగల ఆంధ్ర కవీశ్వరుడు (సంస్కృత కవికూడా) శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు. తాను శిష్యుడైనా డన్నది గురువుకే ‘వ్యోమపేశల చాంద్రీమృదుకీర్తి’ (వ్యాసు డలాగురువుకిధ్వజమెత్తాడా!) నన్నట్టి ‘ధిషణాహంకారి’. (ఈయన గురు

వు శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారిని తన శిష్యుడిగా ప్రకటించుకోవడానికి శ్రీ శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి గారు ప్రయత్నించినట్లు ఆన్నవర సభావిశేషాలు తెలియజేస్తున్నాయి. ఈయన దాఒరవడికెదురు. అలా గురువు చేత ఇలా శిష్యుడి చేతనూ కూడా సంభావింపబడ్డ శ్రీ చెళ్లపిళ్ల వారెంత ధన్యులో, మళ్లీ బ్రాహ్మనుయమూర్తి నంటూ గాయత్రీ జపపరాయణుడు గా ఫొటోలు వేయించు కున్నా ఆ బ్రాహ్మమయమూర్తి వసుచరిత్ర కారుడు శ్రీ రామరాజ భూషణుడు శారదామూర్తి అనిచెప్పుకొన్నట్లు సరస్వతీ స్వరూపుడని భావం అయి ఉంటుందనిపిస్తోంది. ఈయన దంతా చూస్తే "విద్యయొసగును వినయంబు...." పద్యసూక్తిని దిద్ది వెయ్యటం మంచిదనిపిస్తుంది.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారిని గూర్చి ఇంతగా ఎందుకు చెప్పుకోవటం అంటే ఆయన (చెప్పుకొన్నదే) వ్యక్తిత్వమూ కవిత్వమూ కూడా అస్పష్టత కాలవాలాలు. కథావస్తువు గాయత్రిలా ప్రసన్న మధురమైందే అయినా శ్రీ విశ్వనాథవారి రచనలో వారి ధిషణాహంకారపు టావేశం సహజం. అయన సాధించిన అనంత విజ్ఞానాకాశంలో అక్షరాల నక్షత్రాలూ భావార్థాల చంద్ర చంద్రికలూ ఆయన ధిషణా మిత్ర ప్రతాపం ముందు నిలువలేక అస్పష్టతా పశ్చిమాద్రి మాటున కుంగకనా కల్పవృక్షఖండాలవి ఆ సూర్యాతపానికి ఎండు కట్టెలు కాకుండా విమర్శక సాహిత్యవనపాలకులు స్వీకరించి విశాల సహృదయ ప్రదేశాల్లో ముక్కముక్కనీ మొక్కమొక్కగా అవగాహనా పల్లవితంగా నాటి కల్ప వృక్ష వనపాళి ఏర్పరచి సర్వజనామోదానందవిహారాలకి అనువుగా సిద్ధం చెయ్య మని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కవిసమ్రాట్ గుండె లోతుల్లోని ధిషణాహంకారపుటానతి కబురై ఉంటుంది.

"జమ్మిచెట్టు జమ్మిచెట్టె మనము దానికి ప్రదక్షిణించుచు, దాని దళమును తీసి చెవిలో ధరించుచు, విజయదశమినాడు దాని నారాధించుచు : అజమ్మి చెట్టొకవేళ లోను జమ్మిచెట్టని తక్కన సర్వ

వృక్షముల కంటె గొప్పదాని నని చెప్పినచో లోకము దానిని వెక్కిరించుట ఎందులకు?" (విశ్వనాథ సాహితి. పుట 12) అని నిలదీస్తాడాయన. ఆయన జమ్మిచెట్టు నెందుకు స్మరించాడోగానీ నేను వ్రాసేది వెక్కిరింపుకి కాదని నేను పైన వారి ఉద్దేశాన్ని అంచనా వేయటంలోనే సుస్పష్టం.

కల్పవృక్షంలో శబరీ శ్రీరాముల అవగాహనకి ప్రయత్నించే ముంధు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి దృష్టి ఎలాంటిదో మనం గుర్తు ఉంచుకొనక తప్పదు. ఆ పాత్రల అనుబంధం బయటపెట్టే ముందు ఆయన కలక చూడండి. "ఆ వాల్మీకి ఏది చెప్పినను నూటికి కోటి కొకచోట చెప్పును. నేనాయనతో చావనా! నేనాగుణములను బయటకు తీసి వ్యాఖ్యానము చేయుదును. ఈ రహస్యము శ్రీ రామచంద్రుడు శబరి దగ్గఱ నెంతయో చూపించును." (కల్పవృక్ష రహస్యములు పుట 68) ఎంతమాట అన్నాడో చూసారా!, వాల్మీకి క్రమంలో చెప్పక పోతే తాను నానాతిప్పలూ పడి విసిగిపోయి అన్నమాటలు లేదూ! అప్పుడు తన ధిషణాహంకారం ఏమైపోయిందీ! ఎక్కడికీపోలా. ఆయన కృతిలో వివరించిన వ్యాఖ్యానాల్లో స్పష్టంగా ఉంది, అది గుర్తుంచుకోకుండా మనకు శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని శబరీ రాముల అవగాహన ఎలాసాధ్యం? శ్రీవిశ్వనాథ మన మధ్యలో లేకపోయినా హృదయావిష్కృతుడై శిష్యవర్గరూపంలో ఆమోదించ గలడు. మన కృషిని.

విషయానికి వచ్చేస్తే అరణ్యకాండం అంతటా లక్ష్మణస్వామి స్థితప్రజ్ఞుడైన సాక్షిగా కల్పవృక్షంలో రూపొందింప బడ్డాడు. కాబట్టి ముందు ఆయనను స్థితప్రజ్ఞుడిగా పరిశీలించాలి స్థితప్రజ్ఞుడని ఎవరి నంటారో శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు ప్రకటించాడు. చదవండి:

శ్లో॥ ప్రజహాతి యదా కామా న్సర్వా న్పార్థ మనోగతాన్!
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితః ప్రజ్ఞ స్తథోచ్యతే.॥

(అధ్యా. 2. శ్లో. 55)

మనసులో చొరబడే సుఖభోగాది భౌతిక శరీరాశ లన్నింటినీ ఎప్పటి కప్పుడే బయటకు నెట్టేస్తాడోయిపార్థా! ఆ అనుభూతి ఏదో తన లోని ఆత్మ (సామర్థ్యసాధనం వల్లనే) పొంది సంతోషిస్తాడు. అతడినీ స్థితప్రజ్ఞుడనేది. అని వివరించాడు. అసలు శ్రీ రామాయణ కథా వస్తువులోనే లక్ష్మణస్వామి అన్నీవదలి వచ్చేసాడు. సరే, శ్రీ సత్య నారాయణగారి కల్పవృక్షంలో మరీను. పై గీతా చార్యుడు నిర్వచించిన స్థితప్రజ్ఞుడికి ఉదాహరణగా రూపొందింపబడ్డాడు. చూడండి. లక్ష్మణ స్వామికి పుట్టక పుట్టక ఓ కోరిక పుట్టింది. అది కోరికేనా! ఏమో చదవండి,

ఆ. వె. అన్న కార్ముకంబు-నన్నుదాఁకగనీఁడు
చిలుకు మిగులఁజేయు-శిక్షలందు
నదియు దుబ్బుకట్టి-ముదిరి తేలి మహోక్ష
నిశితదంతములకు-వశముగాదు. (మారీచ ఖండం 321)

రాక్షస శిక్ష చెయ్యాలని లక్ష్మణస్వామి కోరిక అయిఉండాలి. అన్న అయిన రాముడు (కోరికనదుపుచేసే ఆత్మలా) అది నెరవే రనీయక చిలుకేదో (బీజంలా) మిగిలిస్తే అది మొలక అయి, మొక్క అయి ఎదిగి దుబ్బుకట్టి, నానాటికి ముదిరి చివరకి ఆఁబోతువంటి ముదు రెద్దు వచ్చి మేయబోయి నప్పటికి ఆయెద్దు పంటికి కూడా లొంగనంతగా అది పెరిగిపోతుంది. అని లక్ష్మణ స్వామి అభిప్రాయం పద్యంలో తొంగి చూస్తున్నట్లు గా ఎంచకపోతే ఈ పద్యం అసందర్భంగా ఉంటుంది తనకో అభీష్టం అంటూ ఉందా లేదా అనిపిస్తూ అది శ్రీరామ ఆత్మయొక్క కార్య వ్యగ్రతని మాత్రమే పేర్కొంటున్నట్లుంటుందీపద్యం. ఇలాంటి వాటి వివరణ సందర్భంలో శ్రీ విశ్వనాథవారి చెణుకు ఒకటుంది. అదొక చమత్కారం, అని, ఆ చమత్కారం ఏదో శ్రీ రామ ఆత్మకు సూటిగానే తాకింది. దాని కాభద్రుని స్పందన

చదవండి. మళ్లీ ఆటవెలది పద్యమే.

ఆ. వె. అనిన రామమూర్తి-యల్లంతగానవ్వి
వశము గాదయేని-వహ్ని చూపు
మనిన పలుకు నందు-నంబుజా ప్తాన్వయుం
డుగ్ర గ్రీష్మమూర్తి-యొకఁడు తోచె. 322.

అంతగా నములుడు పడకపోతే వేడిచేసి పచనం చెయ్యవోయి. అని ఆయనా చమత్కారంగానే అన్నాడు. అలాగే దేనికైనా కాలం పండాలయ్యా అని లక్ష్మణస్వామిలో తొంగిచూస్తున్నట్లున్న అభీష్టభావానికి శ్రీ రామ ఆత్మసమాధానం. ఇక్కడ కవిగా శ్రీ విశ్వనాథవారి చమత్కారం గూడా ఉంది. పరికించండి. శ్రీరామఆత్మ అల్లంతగా నవ్వి చమత్కార సంభావన చేసినట్లంటూనే ఆ మూర్తిపలుకులో ఉగ్ర గ్రీష్మ మూర్తి తోచాడంటాడు. అది ఎలా సాధ్యం! హాస్యరౌద్రాలకేకస్థానమా! కవి తెలివిలో ఉంటే ఇలా వ్రాసాడా అనిపిస్తుంది. అయినా యోచిస్తే లక్ష్మణస్వామి చమత్కారపు టభ్యర్ధనకి శ్రీరామ ఆత్మ చమత్కార సంభావనంతో సరిపెట్టక ఆ లక్ష్మణస్వామివంటి స్థిత ప్రజ్ఞునిలో మొలకొత్త కూడని అభిలాషాబీజాన్ని వేపించి వేయడానికి శ్రీరామ ఆత్మ పలుకులో ఉగ్ర గ్రీష్మ మూర్తిత్వ దర్శనం. (వహ్ని చూపటం) కవి మాటలో 'ఒకఁడు తోచె' అన్నది లక్ష్మణస్వామి (సంభాషణలో ఉన్న) ఒక్కడికే అని తాత్పర్యం. సీత కలా తోచిన దాఖలా ఏమాత్రమూలేదు. ఈ అవగాహన కుదరకపోతే ఈ పద్యానికీ తాత్పర్యం అయోమయమై పోతుంది. నిజానికి రెండుపద్యాలూ ఏదో వాక్చమత్కారాలని సరిపుచ్చుకోవలసిన వెంతమాత్రమూ కావు. సారాంశం ఏమిటంటే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు లక్ష్మణస్వామి యందు గీతాచార్యుని నిర్వచనం ప్రకారం స్థితప్రజ్ఞుడుని సంపూర్ణ సౌష్ఠవ శిల్పం నెలకొలిపాడన్న మాట పరమసత్యం, ఈ పద్యాలు రెండూ అభావశాణపు కడమెఱుగు తాకిడులనే నా మనవి.

కాగా ఇంకా సాక్షిగా కూడా లక్ష్మమూర్తి ఉన్నాడనుకున్నాం గదా! చూస్తే యాజుషీయ సర్వసారోపనిషత్తులో రెండు సార్లు ప్రసక్త మైన ఒక నిర్వచనం ఇలా ఉంది. మన కన్నివిధాలా ప్రాముఖ్యం గలది ఈ నిర్వచనం.

"జ్ఞాతృజ్ఞానజ్ఞేయానాం అవిర్భావ తిరోభావజ్ఞాతా!
స్వయమావిర్భావ తిరో భావరహితః స్వయంజ్యోతిస్సాక్షీత్యుచ్యతే॥"

ఇది ఎన్ని విశేషాలతో ఉంది. క్రమంగా అవగాహన చేసు కోవాలి. ఇందులో జ్ఞాతృ శబ్దం-తెలిసికోవలసిన అవసరం ఉన్నవాడుగా (మనసు) జీవుడని భావం. ఆ జీవుడి నిర్వచనం అదే ఉపనిషత్తులో ఇలా ఉంది

"పుణ్య పాప కర్మానుసారీభూత్వాప్రాప్త శరీరమ్
అప్రాప్త శరీర సంయోగ మివ కుర్వాణో యదా
దృశ్యతే తదోపహిత జీవ ఇత్యుచ్యతే."

పూర్వజన్మలో చేసికొన్న పుణ్యపాపాల ననుసరించి పొందిన శరీరంతో కలసి ఉండికూడా ఆ శరీర సంబంధం లేని వాడిలా (మళ్లీ ఆ పుణ్యపాపాల) కర్మలెప్పుడెలా తోస్తే అప్పుడలా చేయడానికి నియ మించబడి ఉన్నవాడు జీవుడనబడతాడు. సర్వ సామాన్యం అయిన ఈ తాత్పర్యం అంత సమంజసం అనిపించదు.

పుణ్యమేదో తెలుసుకొని ఆచరిస్తూ, పాపమేదో తెలుసుకొని దాన్ని పరిత్యజిస్తూ విహిత (నైపుణ్య) కర్మల ననుసరించే (ధర్మ నిర్వ హణ చేసే) వాడై (అందుకు యోగ్యమైన) పొందిన శరీరంలో నెలకొని (ఆ విహిత ధర్మ నిర్వహణ బాధ్యత మరువక) శరీర (సుఖదుఃఖాది అనుభవ) సంబంధం లేనట్లు ఎప్పుడెంత మాత్రం అవసరమో అంతమా త్రం కర్మ (నిపుణంగా) నిర్వహించటానికి (ఆత్మ-లేక పరబ్రహ్మ చేత

నియుక్తుడై) ఉంచబడిన వాడు జీవుడు అనబడతాడు.

ఇందులో అన్వయబాధ కొంత ఉన్నా ఇదే నిర్మాణాత్మకంగా సమంజసమైన తాత్పర్యం. భారతీయ సనాతన కుటుంబవ్యవస్థ లోని స్త్రీపాత్రను తలుచుకుంటే అన్వయ బాధ మాయం అయిపోతుంది. ఏరామాయణంలో అయినా సీతా దేవిపాత్ర ఈ జీవ తత్త్వ ప్రతీకయే మూలరామాయణంలో దదేగా మరి!

ప్రస్తుతానికి వస్తే ధర్మ కర్మా చరణార్థం శరీరాన్నాశ్రయించిన వాడు జీవుడైతే చేయవలసిన యోగ్య ధర్మ కర్మ ఏదో గ్రహించటానికి జ్ఞానం అని నిర్వచనం ఉపనిషత్తులో ఇలా ఉంది.

"జ్ఞానం నామోతవత్తి వినాశ రహితం నైరంతర్యం చైతన్యం జ్ఞాన మిత్యచ్చతే." ఉదయాస్తంగతాలు లేకుండా ఎల్లప్పుడూ (సాధనా-సాధనా ప్రయోగం వినియోగం-సారాంశంగా ఉపాయం) కొనసాగుతుండే చైతన్యమే జ్ఞాన మంటారు. ఏరామాయణంలో అయినా మహర్షులందర్లోనూ ప్రతిబింబిస్తుందీ జ్ఞానం. ముఖ్యంగా శబరికు శూశ్రషలంది పోయిన మతంగ మహర్షి (శిష్యుల్లో) మిగిల్చి పోయిన మహత్వంగా ప్రకాశిస్తూంది. ముందు ముందు గమనిస్తాం.

ఇంక మొదటి జ్ఞాతృజీవుడు జ్ఞానోపాయంచేత గ్రహింపవలసింది జ్ఞేయం. అది ధర్మ కర్మఫలా వాప్తిగా అనుభవానికి వచ్చే ఆనందం. అత్మైక్యం. ఏకాత్మ తత్త్వం. ఏ రా మా య ణంలోనే అయినా శ్రీ రాముడా ఏకాత్మే. ఈ ప్రాముఖ్యంగానే ఆ పాత్రను మనం శ్రీరామ ఆత్మ అన ప్రస్తావించు కొంటూవస్తున్నాం. కల్పవృక్షంలో తద్వ్యాఖ్యాపరచిత్రణం మరిన్ని జిలుగులు సంతరించుకొందనటం పరమ సత్యం.

ఒక్క సాక్షికోసమే కాకుండా ఇలా జీవ-ఆత్మల అవగాహన కూడా ఈ వివరాలు మనకి అవసరం. ప్రస్తుత సాక్షి ఈ త్రిపుటి జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయ మరోలా జీవ-ఉపాయ-క్రియల ఆవిర్భావ తిరోభావ

క్రమం(రాకపోకలు) తెలిసినవాడూ స్వయంగా తానా ఆవిర్భావ-తిరోభావాలు లేక అంటే వాటి కతీతుడై స్వయం ప్రకాశంగల జ్యోతిస్వరూపుడని ఉపనిషద్వాక్య తాత్పర్యం. రామాయణకల్పవృక్షంలో లక్ష్మణస్వామి సరిగ్గా ఈమూసలో దింపిన పాత్ర.

గుర్తిస్తే శ్రీరామ ఆత్మతోపాటు అన్నివిద్యలూ లక్ష్మణస్వామి నాశ్రయించాయి. విద్యలు ఉపాయాలుగా జ్ఞానమే. అజ్ఞాన వినియోగ క్రియలవల్ల పొందవలసిన జ్ఞేయానందఫలం శ్రీరామఆత్మ సాన్నిధ్యం మొదటినుంచీ లభించే ఉన్న అదృష్టజన్ముడే. కనుక లక్ష్మణస్వామికి ఆత్రిపుటి యొక్క ఆవిర్భావ తిరోభావాల ఎఱుక ఉంది. అయినా తాను వాటికి అతీతుడుగా వినియోగానుభూతిబంధం లేని సలహాదారుగాజ్ఞానజ్యోతియై ప్రకాశిస్తూంటాడు (ఈసలహా వ్యవహారం బోధకజ్యోతిగాభావించి లక్ష్మణసాక్షిని ఆచార్య స్థానీయునిగా కొందరు పెద్దలు వ్యాఖ్యానించటం ఉంది.) శ్రీ మద్రామాయణ కల్పవృక్షంలో మన స్థితప్రజ్ఞుడన్న వివరణకై ఉదాహరించిన రెండుపద్యాలే లక్ష్మణస్వామి సాక్షిభావాన్నికూడా తెలియజేస్తాయి. అయినా మారీచఖండంలో మారీచుని మాయ లేడిగా ఉన్నా లక్ష్మణసాక్షి గుర్తించి సీతారాములిద్దరికి ఆ లెడిని పట్టాలన్న ఉద్దేశం మంచిది కాదని సలహాఇవ్వటం (ఒక్కసారి గ్రంథంలో చదివి చూడండి (అది శ్రీసత్యనారాయణగారి అపూర్వసృష్టి. మూలాతీతం.) ఆ పరిణామాల వైపరీత్యాలకు వికలుడు కాక నిర్వికారుడుగా నడుమ కోవటంలో సంపూర్ణసాక్షిభావంతో నిలబడ్డట్లు శ్రీసత్యనారాయణగారు స్ఫుటంగా తేల్చిచూపారు. అందులోనే స్థితప్రజ్ఞుతినీ జోడించి విజయం సాధించారు.

అంతటి నిలకడ ఉన్నవాడు గనుక లక్ష్మణసాక్షి ఎవరినిగూర్చి ఏమి అన్నా సాధికార ప్రమాణంగా స్వీకరించవచ్చు. ఆయన వాక్యం ఒక సహృదయాభరణం ఆసాక్షి మతంగముని ఆశ్రమ భూమినీ శబరినీ పరిశీలించి కడపటగా చేసిన ప్రకటన-శ్రీవిశ్వనాథవ్రాసిన పద్యం

ఉ. ఈమునిరాజు నాశ్రమమ-హీస్థలి యింత విచిత్రమై చనెన్
శ్రీమతియైన యీశబరి –సేవ మరిన్మరి చిత్రమైచనెన్
కోమల మల్లికా కుసుమ – కుట్మలచారు సువాసనానిల
గ్రామముల న్మతంగ ముని-రాజమహామహిమల్ స్ఫురించెడున్ 387

ఆత్మ విమోహంనుంచి శ్రీరామఆత్మను ప్రస్తుతానికి మరలించటానికి లక్ష్మణసాక్షి సంభావనగా ఉన్న ఈపద్యంలోని విషయాలను విశ్లేషించుకొంటేచాలు మనవ్యాసం ప్రమాణపూత సంపన్నం ఔతుంది. ఇందులో ప్రస్తావనకు వచ్చినవి మూడు విషయాలు.

1. మతంగమహర్షి ఆశ్రమస్థల మాహాత్మ్యం.
2. శ్రీరామ ఆత్మకు శబరి సమర్పించిన ఫలసేవ.
   అంటే ఆసందర్భంలో
   అ. శ్రీరామచంద్రుని కేవలాత్మానుభూతీ
   ఆ. శబరి నిరీక్షణాసాఫల్యతా.
3. మతంగమహర్షి తపోమహిమ. వ్యక్తి లేకపోయినా తద్వాసనాగ్రామ ప్రసారం. అప్పుడిది మొదటి దాన్లోనే లీనమవ్వాలి కాని వేరే ప్రస్తావింపదగిందీ ఉంది.

ఇందులో మొదటిది 'ఇంత చిత్రము' కాగా రెండోది 'మరిన్మరిచిత్రము' మూడవది పైరెండింటినీ స్థాపించి అందులో లీనమై ప్రసరించిన మహత్వవాసన. క్రమంగా అవగాహన చేసుకుందాం లక్ష్మణసాక్షి సహాయం ఉండనే ఉంటుంది.

అప్పట్లు పై పద్యంలో మొదటి రెండు పాదాంతాల 'ఐచనెన్' శబ్దావృత్తి వల్ల ఏదో గంధర్వ నగర దర్శనం జరిగిపోయిందనే సూచన ఉంది. దాన్నిబట్టి సహోదరుల మతంగాశ్రమప్రవేశాది శబరీ ద్యులోకయాత్రాంతమూ సాగిందంతా ఒక ఏకాంకికా దృశ్యంగా చూడవచ్చు అందు

లో ఒక అపరిచితస్త్రీ (పేరు మాత్రం శబరి అని కబంధునివల్ల విన్న) పాత్ర శబరి మైత్రికి స్పందించిన శ్రీరామ ఆత్మ – అక్కడే ప్రేక్షకుడుగా ఉండిపోయిన లక్ష్మణసాక్షికి అంతవరకూ పరిచయమయి ఉన్నవాడుగా కాక ఆసన్నివేశాన్ని సఫలంచేసిన వేరేపాత్రగా నటిస్తాడు. వెనుకటి పరిచితం నుండి ఈ అపరిచితం ఒకవేళ శ్రీరామ ఆత్మనుండి విడివడి ఏర్పడిన ఆత్మ మాత్రమేమో అనుకొనే విశ్లేషణ కవకాశం ఈయక శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మనలని ఇరుకున పడేసాడు. అయినా వ్యత్యాసం తోపింపజేసాడు కల్పవృక్షంలో. ఇక్కడ శ్రీరామ ఆత్మ పాత్రాంతర్గల ప్రత్యేకతలను గుర్తించటం చాలాకష్టం. అది గంగా యమునా సంగమం. ఆనీళ్లానీళ్లే ఈనీళ్లీ నీళ్ళే గుర్తించ లేక పోతే నీకు శబ్దబ్రహ్మ సాక్షాత్కారంలేదుపో అనే ధిషణాహంకారం ఇక్కడిలా వెల్లడౌతుంది. అయితే మనం అది జవనిక మరుగున ప్రదర్శనకు దాగి ఉన్నట్లు లక్ష్మణసాక్షి మాటల్లో కనుక్కున్నాంకదా! ఆ ప్రత్యేకత విషయం ప్రదర్శన మొదలవ్వటానికి ఆ తెరతప్పుకొన్న తర్వాత మాటగదా! అప్పుడు చూద్దాం.

లక్ష్మణసాక్షి సూచించిన విషయత్రయపరామర్శకు ముందు మనం ఎంచుకొన్న అభిప్రాయాల స్థిరబుద్ధి కోసం పరామర్శించవలసినవి ఇంకా కొన్నిఉన్నాయి. అందులో ప్రధానమయింది దశవర్ష ఖండంలో అగస్త్యమహాముని మాటలు కొన్ని : చదవండి.

ఉ. తోరముగా మనస్సునత-థోదిశ దేహము నూర్ధ్వదిక్కునన్
దూరపుభూమి నాత్మయును-దోవయు ధర్మసమూహగమ్యమా
తీరని దేహవాంఛలను-ద్రిమ్మరి క్రిందికి లాగు నీమన
స్సారక నిత్నయత్నమున-నూర్ధ్వపథంబునఁజేర్పగావలెన్. 347.

ఇందులో'నీ' అని శ్రీ రామ ఆత్మను నిర్దేశించే శబ్దం ఒకటి ఉన్నా అది సర్వసామాన్య విహితోపదేశమే, తాత్పర్యం ఏమిటంటే–

మనసుకి క్రిందివైపు (విషయ వాంఛాలోలుప) దేహం (దగ్గర్లో) ఉం టుంది. పైవేపు (ఊర్ధ్వదిశలో) దూరంగా ఆత్మ-ధర్మ కర్మల మార్గాన చేరదగింది ఉంది. (భోగానుభవంచేత కూడా) తీరని కోరికల్లో తిరు గుతూ ఉరకే క్రిందికి లాగబడుతూ ఉండే నీ (సర్వసామాన్య వ్యక్తి నిర్దే శం) మనసును ఎడతెగని సాధనల వలన ఊర్ధ్వమార్గంలో (ఆత్మదగ్గరకి) చేర్చాలి. అని.

చం. ఎలమి మనస్సుద్రిప్పి యెవఁ-డేనియు ధర్మవుద్రోవఁబోవఁగాఁ
బలుకుదు రాతనిం జనులు-వాఁడొక సజ్జనుఁడంచుఁ ద్రిప్పకే
నిలుచును ధర్మవీథినొక-నిర్గత కల్మషు మానసంబు లో
కులు మరి వాని నేమియను-కొందురు; దేవతలన్నఁజాలదే! 348

దీని తాత్పర్యం తెలుస్తూనే ఉంది సామాన్యు డెవరైనా పైన జెప్పినట్లు నిరంతరసాధనవలన మనసును ఉర్ధ్వ మార్గంలోకి మళ్లిం చుకొని ధర్మమార్గంలో సాగుతుంటే అమనిషిని ప్రజలు సజ్జను డంటారు సరేమరి ఏసాధనా అక్కర్లేకుండానే మనసు సహజంగా ధర్మమార్గం లోనే ఉంటే ఆ మనిషిని ప్రజలే మనాలి! దేముడంటే సరిపోదా! అని.

బహుశః ధర్మస్వరూపుడైన శ్రీ రామఆత్మ వలన (అరణ్యమార్గా నికి మరలి) అధర్మ మూర్తితో కూడాఉన్న లక్ష్మణసాక్షీ-అలాగే సహ జంగానే ధర్మమూర్తియై ఇలా మరిలి వచ్చిన శ్రీరామ ఆత్మ నీ మనసులో ఉంచుకొని ఆ అన్నదమ్ము లిద్దరూ అవతారపురుషులని అగస్త్య మహర్షి పరోక్షంగా ప్రశంసిస్తున్నట్లు లేదా!దేవతలు పరోక్షప్రియు లంటారు. కాబట్టి అముని అనుసరించిన విధానమూ సమర్థ నీయంగానే ఉంది.

చం అనవరతంబు ధర్మమున-యందుఁజిలించని మానసంబు క
ల్గినయది సీత, పోల్కి కద-లించి యరుంధతిఁ దేజఁ బ్రోవుఁ జె
ప్పనువతెఁగానకీపధిది-వచ్చుట గొప్పయెగాద! నిన్నుబొం
దిన జనకాత్మజా మనను-నీపతిభావ త్రికాల నిష్ఠమై. 341.

ఇది సీతాదేవిని గురించి అన్నట్లు సూటిగానే ఉంది మొదటి పాదంలో ధర్మాన్నుంచి ఏమాత్రమూ చెదరిపోని 'మానసంబు' కలదీ, అనీ చివరిపాదంలో నిన్నుఁ బొందిన జనకాత్మజా 'మనసు' అనీ (నిన్ను అంటూ సహజధర్మస్థితుడన్నది పై 340 పద్యంలోది కలుపుకుంటే ప్రస్తుత పద్యాంత్యపాదంలోని 'పొందిన' అనేది మొదటి పాదంలో 'చలించని' అనేదీ ధర్మానుసరణ పరంగా ఒకటే ఉద్దేశం. దాన్ని ఇలా) రెట్టించి చెప్పటం ('ఉపక్రమోపసంహారావభ్యాసో....' అనే తాత్పర్య నిర్ణయ విభాగాల్లో మూడోదైన అభ్యాసం అన్నమాట.) చూస్తే సీతాదేవి 'మనస్సు' కి ప్రతీక అనేవిషయం స్పష్టంఔతుంది (అదికూడా) మనం మొదటిలో గ్రహించిన జీవుడుని గూర్చిన నిర్వచన వివరమే (జనకు నింట సశరీరావతారం పొందినా శ్రీ రామ ఆత్మ ధర్మాన్నాశ్రయించి స్వంత శరీరమే లేనట్లు అధర్మ యోగం నించి' పతిభావ త్రికాల నిష్ఠ' అయి చెదిరిపోకుండా ఉండటం) ఈ మనస్సీతాదేవికి చక్కగా అమరే ప్రయోగాలు చేయటం చూస్తే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఆయమ్మకు మరో పేరే జీవు డని జిజ్ఞాసాపర (రాక్షస వధకు వాగ్దానం ఋషుల ముందు చేసిన శ్రీరామ ఆత్మనుండి అందలి పరమార్థం అడిగి తెలుసుకొనే, జ్ఞాతృ స్థానీయగా నెలకొల్పా రన్న సత్యం తేలిపోయింది.

దీన్నిబట్టి శ్రీరామ ఆత్మ-పొంద (వలసిన) దగిన ఆనంద (సహజ ధర్మ స్థితి) జ్ఞేయుడనీ; మన లక్ష్మణసాక్షి (ఏవిధమైన అవసర, ఆజ్ఞా నిర్బంధ, ప్రార్థనలూ లేక పోయినా స్వయం నిర్ణయ సాధకుడై తరలి (మరలి) శ్రీరామ ఆత్మ-సహజ ధర్మస్థితిని, అనుగమించటంలో ధర్మమార్గానుసారియై సేవాఉపాయ శీలంచేత జ్ఞానం అనికూడా తేలిపోయింది. అంటే జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయ త్రిపుటియే జీవ-ఉపాయ-ఫలానంద రూపంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు సీతాలక్ష్మణ సమేతుడైనీ శ్రీరామ చంద్ర దర్శనం చేయించారన్నమాట కల్పవృక్షం అరణ్య కాండలో. ఆ యిద్దరితో సాగిన ఆ రాముని యానం అదే రామాయణం. జీవధర్మ

ఊర్ధ్వ మార్గం. ఇదీ మనం ముందుగా పొందవలసి ఉన్న ఒక ఉపా యాభిప్రాయ సుస్థిరబుద్ధి. నమ్మకం.

సరే అగస్త్య మహర్షి తననో అవతార పురుషుడంటే శ్రీరామఆత్మ చిద్విలాసంగా నవ్వుకోవటమేనా అసలలాంటి ప్రత్యేకత ఏమైనాప్రదర్శించా డాఅంటే శ్రీకృష్ణావతారంలోలా ఎప్పటి కప్పుడేవో లీలలు చూపిస్తూండటం లేదు సరికదా తనబాణం తగిలి దివ్యరూపం ధరించిన వాళ్లను చూసి తానే విస్తుపోతుంటా డీ ఆత్మస్పృహ తోచని దేవుడు. కబంధునితో ఏమి అంటున్నాడో చదవండి.

శా. నాకాశ్చర్యముగాఁదోచెడుఁగబం-ధా! మిత్రమా!నీవలెన్
నాకారు ల్పదిమంది చచ్చిరిసుమీ-నాచేత వారందఱున్
నాకు న్మేలు వచించిరట్టులనె య-న్నా! వింతగా మంచివాం
డ్రై కానంబడి యేల రాక్షసులుగా-నిట్లె్లరోచిత్రంబగున్. 283.

దీన్నిబట్టి నేను దేవుడనహో అని చాటుకోవటం కంటె యోగ్యు లైన వారిచే గుర్తింపబడటం ఉత్తమంగా స్వీకరించటం అన్నమాట అయన చిరునవ్వు, దాన్ని భజనపరులచే ప్రశంసింపచేసి కోవటంగా (ఇప్ప టి ఒకరకం కవిగాయకాదులకు మల్లే) అనుకోనక్కరలేదు ముఖ్యంగా పరమపదప్రాప్తి కనుమతించే దైవత్వం (ముక్తిప్రదాన) శ్రీరామ ఆత్మలో ఉంది. జటాయువుకి పితృక్రియలు జరిపి నప్పటి ఆదేవుని ఆదేశం చదవండి.

మధ్యాక్కర:

యజ్ఞ శీలునిదైన గతికి, నవిహ-తాగ్న్యాహితుగతికి
విజ్ఞపరావర్తి గతికి, పృధు పృధ్వీదాత గతికి
ప్రాజ్ఞలోకోత్తర!పక్షిరాజ!పో-వయ్యానేనై యు
మజ్ఞ యిచ్చితి దీప్తముల కనుత్తమ-నుతలోకములకు. 185

ఇందులో నేనైయనటంలో ఆదైవ ఆత్మస్మృతి గుర్తింపవచ్చు కాబట్టి యగస్త్యముని మాటల్నీ లక్ష్మణసాక్షి మాటల్లాగే ప్రమాణంగా అంగీకరింపవచ్చు. కాగా ఇక్కడ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ధిష ణాహంకారం శ్రీరామ ఆత్మ నావేశించినట్లుంది. వాల్మీకంలో ఆదేవుడు

శ్లో. మయాత్వం సమనుజ్ఞాతో గచ్ఛలోకా ననుత్తమాన్!
గృధ్రరాజు మహాసత్వ సంస్కృతశ్చ మయావ్రజ॥ 68సర్గ 30శ్లో

'సంస్కృతశ్చమయా" (నాచేత పితృసంస్కారం పొందిన వాడవు కూడా) అనే సాధువాక్యం వదలివేసి 'మయాత్వం సమనుజ్ఞాతో గచ్ఛ' అన్నదాన్లో అనుజ్ఞ మాట అలాగే ఉంచినా అది ఒక అజ్ఞాగాధ్వనిం చేటట్లు 'పోయ్య నేనై యనుజ్ఞ యిచ్చితి" గా అధిషణాహంకారం వెలి కురికింది. అయినా 'నేనై' యన్నది ఆత్మ స్మృతిగా దైవత్వ అధికారం ధ్వనించటం రాజసం చాలా బాగా కుదిరింది. అగస్త్యముని వాక్యానికి బలం చేకూర్చింది.

పద్యంలో అధిషణాహంకారంతో సమంగానే శ్రీ సత్యనారాయణ గారి చమత్కారమూ ఉంది మనం సంస్కృత సాధు శబ్ద ప్రయోగం లేదనుకొన్నామా! మరి దీప్తములకు అని వ్రాసిన నామాట కర్థం ఏమి టనుకుంటున్నారూ అని మనల నాయన నిలదీసి "జ్యోతిషాసంవిశస్యే త్యాది మంత్రేణా-నుజ్ఞాతో మయాత్వం యజ్ఞాధికారిణాం లోకాన్ గచ్ఛ బ్రహ్మమేధ సంస్కారబలేన ప్రాప్నుహీత్యర్థః (జ్యోతిషాసం విశస్యే వంటి నా పలికిన మంత్రాలతో అనుజ్ఞ పొంది యజ్ఞ కర్తల కర్హమైన లోకా నికి నువువెళ్లు అమంత్రవాక్య సంస్కార బలంచేత చేకూరుతుందని అర్థం) అనే శ్రీ గోవిందరాజీయ వ్యాఖ్య చూపించి నేనామంత్ర సంస్కా ర వాక్యాలనే "దీప్తము"లన్నాను. అదీ రహస్యం అంటా డాయన. నిజమే అయినా పద్యంలో ధిషణాహంకార రాజసం తాండవిస్తూనే ఉంది. కాబట్టి మన వివరణా తప్పుకాదు. సారాంశంగా శ్రీ రా మ ఆత్మ ము క్రిపదాత

అయిన భగవంతుడనటం తిరుగులేనిసత్యం, అదే విషయాన్ని మనలక్ష్మణ సాక్షి ఎంత సూటిగా చెప్తున్నాడో చదవండి.

మ. అకటా తాను సమస్త మండధిపుండై-యాధ్యాత్మికంబాదిభౌ
తిక మీరెంట నియంతయై నిలచుసం-దీప్తంబు జ్యోతిర్జగ
న్నికరంబందున నాధిదైవికమునన్-నిల్వాండు లోకప్రవా
హకృతిం దైవము సాగ నిచ్చెడిని మ-ర్యాదావధీభూతుండై. 390

ఆ. వె. తలకు మీరి వచ్చె-దైత్యమాయయటన్న
నతండు సాగనిచ్చి-నంతవఱకు
నఖిలలోకచయము-లాడగానూడగా
నతనియమ్మ చివర-నంటియుండు, 391

మారీచుడు (మాయలేడి) చనిపోతూ రామగళానుకరణం చేసి ఆపదలో పడ్డట్లు కేకపెడితే విని జానకి కలత చెందగా ఆమె కా శ్రీరామ ఆత్మ నిజతత్వాన్ని విశదీకరిస్తూన్న ఈ రెండు పద్యాలూ బాగానే తెలుస్తున్నాయి. సృష్టి సమస్తానికీ అధిపుడని శ్రీరామ ఆత్మను గూర్చి (ఆయన ఆజ్ఞమేరకే ఈ లోకాలు పెరిగినా తరిగినా అని దైవత్వం ప్రకటించాడు)' ఆ తెలియ జెప్పింది జానకికి. ఆమె తర్వాత ఎన్ని కబుర్లు (నేనాత్మేశ్వరి' యోగమూర్తిని.... తానైరాముండొకండె పూరుషుండు, సీతారాము లానంద వల్లీ నిర్మక్తలతాంతములన్ రసవనీ లీలా లతాంతంబులున్. 403. ఒకటి పతివ్రతన్ మరియు-నొక్కటి రామునిభార్యనింకవే! ఔకటియు 'గృత్స్నధర్మ విమ-లోజ్జలబుద్ధి. నొకండు యోగినిన్... 407) అని చెప్పినా భర్త నర్థం జేసుకోలేదు సరే మరదిని అపార్థం చేసి కొనిన అమాయక జీవి అన్నమాట. తులతూచినట్లు పొల్లుపోకుండా శ్రీరామ ఆత్మవదైత్వ- అందించిన మన లక్ష్మణ సాక్షి నిస్సందేహంగా జ్ఞానమే.

కాబట్టి మన ముందటి అభిప్రాయం సీత-జ్ఞాతృస్థానీయజీవుడు-లక్ష్మణుడు-జ్ఞాన స్థానీయ సాక్షి. శ్రీరాముడు-జ్ఞేయస్థానీయ ఆత్మ (దైవము). అన్నది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి శ్రీమద్రామాయణ కల్ప

వృక్షం అరణ్యకాండలో నెలకొల్పారన్నది రూఢి అయింది అయితే దీన్ని బట్టి మనం శ్రీరామ ఆత్మ ప్రస్తావన వచ్చినప్పుడు దైవభావనగా వ్యాఖ్యానించుకోవచ్చునా అంటే అదేమీ కుదరదు. మన లక్ష్మణసాక్షి "అధి దైవిక మున-న్నిల్వ్యండు లోక ప్రవాహ/కృతిం దైవము సాగనిచ్చెడినిమ-ర్యాదావధీ భూతుండై" అన్న పరిధి విషయంలో జాగ్రత వహించాలి. ధర్మనియమానికట్టుబడి లోక ప్రవాహంగా జగన్నాటకం సాగిపోనిస్తుంటాడా దైవం. అంటే ఆ నియమాతీత సందర్భంలో మాత్రం ఆయన అధిదైవికంబున నిల్వటం ఉంటుందన్నమాట. ఏమి లక్ష్మణసాక్షి! అక్కడేదో గంధర్వ నగరదర్శనంగా ఏకాంకిక మాట తలపించి ఆరంగ స్థలానికి లోక ప్రవాహకృతి నడచు మర్యాదావధి (సరిహద్దు) జవనిక (తెర) అని ఎంత చక్కగా సూచించాడు! జోహారు!

నిజానికి మన జోహారు దక్కవలసింది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికే. ఈ పాఠకర్తదిగా ఆయనదే ఈ జ్ఞానం. జ్ఞాన విషయం మూల రామాయణంలోదే అయినా ఈయన స్ఫుటీకరించాడు మరి. అందుకాయన చేసిన కల్పన స్వకపోల సంచితం. ఈ శిల్పం సృష్టించిన ఆయన నిర్వివాదంగా గొప్పశిల్పే. కాని ఆ శిల్పాన్ని ఎంత అంగ ప్రత్యంగకచారు సొషవంగా తీర్చి దిద్దినా, ఏ అవయవాని కా అవయవం ఇల్లా చిందరవందరగా పడవేస్తే-ఈ జరాసంధ సంయోజన కర్మకు సిద్ధపడి అవగాహన చేసుకోగల వాళ్ళు ఎందరుంటారు! ఆయన విద్వత్తుమీద ఉండే గౌరవంతో ఇంక "శబరీ శ్రీరామమ్" ఏకాంకిక ప్రదర్శనకు బయలు దేరదాం.

అలా పోతూనే ఒక్కమాట శ్రీరామ ఆత్మయందు అభిమానం గల లక్ష్మణ అగస్త్యులు ఆయన్ను దైవంగా భావించారు-బాగానే ఉంది. అలాగే శ్రీ రామబాణఘాతానికి రాక్షస రూపాలు విడిచి దివ్యులైన వారూ కృతజ్ఞతతో పొగిడారు-సరే. మరి ఆబాణం దెబ్బతిని దివ్యత్వం పొందకుండానూ ఇంకా చావకా ఉన్న మారీచ రాక్షసుడు సైతం ఏమంటున్నాడో చదవండి-

ఉ. తానుగ నాకృతింగనిన - ధర్మము రాఘవుఁడన్నచో నభూ
తోనభ విష్యతీదృశుఁడు-తోకొని ధర్మపథంబుదప్పఁడిం
తైనను లోకమందితరు - లైనను దప్పిన నోర్వఁబోఁడు శి
క్షానిరతుండు వానిదెసఁ-గల్గ దధర్మి యటన్నమాటయున్ 193

దీని తాత్పర్యం బాగానే తెలుస్తూంది గదా! కాస్తపరిశీలిస్తే దైవశబ్దం లేకపోయినా 390వ పద్యంలో లక్ష్మణ సాక్షీమాట "తాను సమస్తమంధధి పుఁడై" అన్నదే ఇక్కడ "తప్పిన నోర్వబోఁడు శిక్షానిరతుండు" లో సూచిత మైందే కదా! అక్కడ కాస్త శిష్టరక్షణ అనిపిస్తే, ఇక్కడ దుష్టశిక్షణ అనిపిస్తోంది. పరస్పరంగా దైవభావభూషితమే.

తమోగుణ విశిష్టుడైన రాక్షసుడు దెబ్బతిని పగ పెంచుకోవలసింది పోయి, తన ప్రభువైన రాక్షసరాజు రావణుని ముందరే ఇలా సత్యాన్ని చెప్పగలగటమా! అందుకు 1 రా మ బా ణ స్పర్శ వలన వచ్చిన పరిణతి 2. శ్రీరామ తత్త్వమందాకర్షణ రెండవదానికీ మొదటిదే కారణం అనుకోండి. దీన్నిబట్టికూడా శ్రీరామ దైవభావం ప్రమాణ బలయుక్తం అయింది. కాగా అసలా రావణుడేమంటున్నాడో చదవండి.

ఉ. దానవమైన మాయయును - దారత నన్నుగప్పనాతిరో
ధానమునందు భద్రతవె - తారము గల్గదు చూచినట్లుగా
నే నను గూర్చి పల్కెదర - యీ దృశసర్వగబుద్ధి యేమి! యే
మైనను వీరితోడఁబగ - యైనను బూనక యెట్టు లొప్పెడిన్. 385

"సర్వగబుద్ధి" రావణుడి వంటి మాయావిద్యాపారంగతుడే విస్తుపోయేంతగ ఉన్నవాళ్లు దేవతలే. అనుమానించ నక్కర్లేదు. అదిగో ప్రదర్శన స్థలం వచ్చేసింది.

# 2

మారీచుడి వంచనకు గురి అయి సీతను గానక శ్రీరామ ఆత్మ మరీ సామాన్య మానవుడికి మల్లె వనటిల్లిపోతుంటే లక్ష్మణసాక్షి అన్నను ఓదారుస్తూ వెంటబెట్టుకొని వనంలో నాలుగుచెరగులా తిరిగి వెదకికూడా జానకి జాడ తెలియక ఒకచోట కొన ఊపిరితో పడి ఉన్న జటాయువును ఇద్దరూ చూచి దగ్గరకు వెళ్ళి పలకరించారు. ఆ పక్షిరాజు సీతను రావణుడపహరించుకు పోతుంటే ఆమె ఆర్తినాలకించి ఆ రావణునెదిరించి పోరి కడకిలా గాయపడి కొన ఊపిరితో మీకోసం ఎదురుచూస్తున్నానన్నాడు. ఒక మాదిరిగా అయినా జానకి జాడ తెలిసిన తృప్తితో శ్రీరామ ఆత్మ తన తండ్రి దశరథుడి కాప్తమిత్రుడైన జటాయువునందునూ పితృబాంధవం తలంచి ఆయన కుత్తర క్రియలు నెరవేర్చి ఒక్కసారిగా దైవభావావేశం పొంది నాయీ పైతృక నిర్వహణ ప్రభావం వల్ల నీకు పై పుణ్యలోకాలప్రాప్తి అనుజ్ఞ ఇస్తున్నాను వెళ్ళమనిపంపి అతర్వాత వెనుకటికంటెకూడా డీలా పడిపోయాడు

క్రమంగా జానకిజాడ వెదుక్కుంటూ ఆఅన్నదమ్ములు బయలుదేరి "క్రౌంచారణ్యముదాటి యచ్చట మతం-గప్రష్ఠ కర్మంది పుణ్యాంచద్వృక్షచయాశ్రమస్థలి సమీ-పారణ్యదేశంబులన్/" 195 సంచరిస్తూంటే పులిమీద పుట్రలా శూర్పణఖలాంటి రాకసి-పేరు అయోముఖివచ్చి లక్ష్మణసాక్షిని

గీ, నీవు నాకు నచ్చితివి వ-నీచరాథ
ములు కుదైత్యులనిశ్చిత - మోహులల్చ
సత్వులు వికారరూపుల - సహ్యమయ్యె
మనము క్రీడింతమే తెలి-మబ్బు తునక 200

అంటూ పట్టుకుంది. అతడు విదలించి కత్తిదూసేటప్పటికి వెనుకటి అలవాటోఏమో అది దాని చెవులూ ముక్కు కుచములూ కత్తిరించేసింది. దాంతో అదిపోయింది. అమ్మయ్య! గండంగడిచింది. అనుకొనేలోపునే ఇద్దరూ కబంధుడి చేతుల్లో చిక్కారు. శ్రీరామ ఆత్మ అమాయకుడిలా విలవిల్లాడిపోతుంటే లక్ష్మణసాక్షి ప్రోత్సాహంవల్ల ఎలాగో కత్తిదూసాడు. ఇద్దరూ క

బంధుడి చెరోచెయ్యీ నరికివేసారు. అప్పుడు వాడు మీకు మేలు చేస్తాను. నా శరీరం దహించమంటే అన్నదమ్ములలా చేసారు వాడి తగలబడే శరీరం లోంచి ఓ దివ్యపురుషుడిని శ్రీరామ ఆత్మ ఎలా ప్రార్థేయపడ్డాడోచదవండి-

ఉ. ఈ గతి దిక్కులేక చరి-యింతును నాయెదలోని దీపమో
హా గురు భారమయ్యె హృద-యంబున జానకి లేకపోయినా
చేగ సమస్త మయ్యెతివ-చేసిన ప్రేమబలంబు సీతతా
నేగతినేగెనో తెలుప-వే యిది నీకును నెంతపున్నెమో? 284

అంటే ఆదనువు (కబంధుడి అసలు పేరు) శ్రీరామ ఆత్మకు సుగ్రీవుని మైత్రి సర్వమూ నెరవేర్పగలదని-

వ. అని కబంధుండు పంపాతీర కానన వర్ణనా పురస్సరముగ శబరీనివసన మతంగాశ్రమ యుక్తంబు సుగ్రీవగుహాపర్యంతంబు మార్గంబుపదేశించి .... " తన దారిని పోగా అన్నదమ్ములలా -

గీ. అట్లొక నగంబునుండి న-గాంతరంబు
నట్లొక వనంబు నుండి వ-నాంతరంబు
చంక్రమణ శీలులైన రా-జద్వయంబు
బడలువడి చేరినారు పం-పాసరస్సు. 309

గుట్టవదలి గుట్టకీ, అడవి విడచి అడవికీ, తిరుగుతూంటే ఆ రాకుమారులైన అన్నదమ్ములిద్దరూ నీరసంగా ఎలాగో పంపా సరస్సు చేరుకున్నారు మనం కరుణ నుంచి తేరుకొని శాంతానికీ-అందులో అద్భుతమూ ఒకింత హాస్యమూకి మరలటానికి ఈ తాత్పర్యం చాలు.

మరి ఇందులో శ్రీ సత్యనారాయణగారు దాచిపెట్టిన కవితామర్మమో అంటే మొదటి అట్లు కబంధుడు సూచించునట్లు బయలుదేరి, అయితేరెండో అట్లు ఉపమావాచకం ఔతుంది. బడలు వడటం సామాన్యధర్మం ఔతుంది. అప్పుడొక కొండమీంచి ఇంకో కొండమీదకి వెళ్ళాలంటే ఎంత శ్రమ పడాలో అంత శ్రమపడి ఆసోదరులు ఒక అడవినుంచి మరో అడవికి పోయి అక్కడ పంపాసరస్సు చూసారని తాత్పర్యం.

ఇక్కడతోఅలా వదలివేస్తే శ్రీవిశ్వనాథవారి ధిషణాహంకారంఎలా బయట పడుతుంది ? వనాన్నుంచి వనానికి వెళ్లటాని చెట్లూచేమలు దాటు కుంటూ క్రూరమృగ రాక్షసబాధ నధిగమిస్తూ శ్రమపడ్డారంటే చాలదా! (స్వభావోక్తిగా ఉంటుంది గదా!) దానికి కొండమీదనుంచి కొండమీదికి పోవటం ఉపమానంగా వాడాలా! (ఆయన వాడాడుగా. వాడాలనే మొండి వాదం ప్రక్కన పెడితే) కవి తారూప తపస్సు చేసెదను' అన్న ప్రౌఢకవి అయాసం కోసం కొండలవెంట పడటాన్ని ఉపమిస్తాడా అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారలా చేసాడంటే ఏదో దాచిపెట్టింది ఉందన్న మాటే. అప్పుడైతే రాజద్వయాన్ని పట్టుకోవలసిందే.

అయితే కొండలు పట్టుకు తిరగటంలో ప్రసిద్ధులైన రాజు లెవ్వరూ? అస్త-ఉదయాద్రులు-పట్టుకు తిరిగే సూర్యచంద్రుల్లో చంద్రుడొక రాజు. మరొకడో రెక్కలు నరకటానికి కొండలవెంట పడ్డ ఇంద్రుడొక రాజు. ("రాజా ప్రభౌ నృపే చంద్రే యక్షే క్షత్రియోః" అని విశ్వకోశం) వాళ్లే ఆ రాజద్వయం.

పద్యంలో చేరుకోవటం (పంపను) లో విశ్రామ సూచన ఉంది. కనుక చంద్రుడు ఉదయాద్రిని పొడవటంగానూ, ఇంద్రుడు వజ్రాయు ధాన్ని కడుక్కోవటానికి ఆకాశ గంగను చేరటంగానూ దృష్టిని పడతారు. ఆవిధంగా రామలక్ష్మణులైన ప్రస్తుత మన రాజద్వయం వనాంతరంలో ఉన్న పంపాసరోవరం చెరుకొన్నారన్నమాట. ఏమి అన్వయం!

అక్కడితో ఏమయింది! ఇందులో విశ్రామం అనిపించటం కరుణ ఉపశమించి శాంతానికి మరలటం అనుకున్నాంగా మొదటి తాత్ప ర్యంలో. మరి మరలటం అనేటప్పటికి 390 వ పద్యం లక్ష్మణసాక్షి అందించిన లోకప్రవాహక్రితి మర్యాదావధినుంచి దాటి శ్రీరామ అత్మ(అం తవరకు వట్టి శ్రీరాముడే) అధిదైవికమున (ఈ మీదట పూర్తి ఆత్మగ- చ్ఛిత్తంగా సాగనీయడనుకోండి) నిలవటానికి మరలుతూన్న సూచన

అందుతోంది. ఇకమీదట ఆయన దైవపాత్ర నటిస్తాడన్నమాట, అదే చం
ద్రోదయం. ఆనందమయం.

సరే బాగుంది. అలా ఒకటినుండి ఇంకోదానికి మరలేటప్పుడు
నడిమి అభ్యంతర పటం (తెర) తొలగించాలి కదా! ఆ తెర (లక్ష్మణసాక్షి
అదే 390 వ పద్యంలో ప్రస్తావించిన పరిధి) లోకయాత్రామర్యాదావధి అనే
పొర. దాన్ని తొలగించటమే రెక్కలు తరగటంగా ఇంద్రపరమై ప్రయో
గం అయిన ఇంకోరాజు లక్ష్మణసాక్షి. కరుణనుండి లేదా జానకీవ్యథ నుం
డి ఆమెను మరపించే (ఆవిడ పూర్వం చేస్తూండే) సపర్యలతో శ్రీరామ ఆ
త్మకు ఉపశాంతి కలిగించి ఆయనలో దాగిఉన్న (తనఎఱుకలోదే) అధిదై
వికాన్ని వెలువరింప జేయటానికి స్వయంగా పూను కున్నాడు

అంటే ఇక "శబరీ శ్రీరామమ్" అనే ఏకాంకికను ప్రదర్శనకు
పెడుతున్నాడన్న మాట శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు. చూసారా
ఈ (సం) గీత (కనాంది) పద్యంలో అనంతర కథాంశ సూచన (శ్రీరామ
ఆత్మ అధిదైవిక పాత్ర నిర్వహణం అంటే) జటాయువుకు ప్రసాదించిన
ముక్తిప్రదానోత్సవం మరి ఇంకెవరికో జరుగబోతోందన్న మాట పద్యంలో
రాజశబ్దం వల్ల చంద్రనామాంకితం అయింది అంతా సశాస్త్రీయంగా నా
టక నాంది లక్షణాన్నెలా దాచిపెట్టారో! ఈ కవి సమ్రాట్ ఆ వాల్మీకి
ఏది చెప్పినను నూటికి కోటికొకచోట (మాటఏమో) చెప్పును. నేనాయనతో
చావనా!" అన్నాడే ఈయన తక్కువేముంది? ఎక్కడైనా అసలు చెప్తేగా!
(మన్మథ విషయంగా ముందుముందు వస్తుంది లెండి.)

నన్ను మీరు ఇదేమిటి ఇదంతా ఏదో శ్రీ విశ్వనాథవారే మూలం
లో లేనిదే కల్పించి వ్రాసినట్లు చెపుతున్నారు? అంటారేమో! మూలంలో
కబంధుడు శ్రీ రాముని సుగ్రీవుడికోసం వెళమంటూ మార్గ నిర్దేశం చెయ్య
టంలో ప్రసక్తమై ఉందండి. చదవండి.

ఫలభారన తాస్త్రత మహావిటపధారిణః॥ 8.
శోభన్తే సర్వతస్తత్ర మేఘపర్వత సన్నిభాః।
తానారుహ్యాథవా భూమౌ పాతయిత్వాయథాసుఖమ్॥ 9
ఫలాన్యమృత కల్పాని లక్ష్మణస్తే ప్రదాస్యతి।
చంక్రమన్తౌ పరాన్ దేశాన్ శైలాచ్ఛైలం వనాద్వనమ్॥ 10
తతః పుష్కరిణీం వీరౌ పంపాం నామ గమిష్యథః।
అశర్కరామ విభ్రంశాం సమ తీర్థామశైవలామ్॥

ఆ వనంలో పెద్ద పెద్దచెట్లు పళ్ళబరువుతో కొమ్మలువంగి మేఘాల్లా పర్వతాల్లా విస్తరించి ఎత్తుగా ఉన్నాయి. మీ తమ్ముడు లక్ష్మణుడా చెట్లు ఎక్కటమో లేవా (పళ్ళను బాణాలతో) పడగొట్టటమో ఏది సుఖమైతే ఆపని చేసి అమృత కల్పాలైన పళ్లు తెచ్చి ఇస్తాడు. (భుజించు అని భావం) వీరు లైన మీరిద్దరూ (ఇల్లు విడచి) కానిదేశాల్లో కొండలూ కోనలూ వెంటతిరుగుతున్నారు అక్కడ పంపా సరోవరాన్ని చేరండి. అది (బొమ్మ) గులక రాళ్లు లేని (పాచిపట్టి) జారుడుగాలేని నాచులేని సమయి తీర్థమయి ఉంది.

ఇందులో 'శైలాచ్ఛైలం వనాద్వనమ్ చంక్రమన్తౌ' అన్నదే శ్రీ విశ్వనాథ పై గీతంలో అనువదించటం జరిగింది. అయితే అది కబంధ వాక్యంగా లేదే. శ్రీ సత్యనారాయణ గారి వాక్యంగా ఉంది. ఆ సందర్భంలో ఈ వాక్యభావం వేరు. ఈ సందర్భానికలా అమరదు. అటే ప్రకరణం మార్చటంలో మనం చెప్పు కొన్న అన్ని విలువలని సంతరించుకొంది. ఆ మార్పు మరి శ్రీ విశ్వనాథవారిదే. ప్రకరణార్థంగానే నేను వివరించాను. ఏమంటారు.

ఇప్పుడు రంగస్థల పరిచయానికి వస్తే ఇదివరలో(పుట10) మనం ప్రస్తావించ వలసి ఉంటుందనుకొన్న మూడు అంశాల్లో ఇది మొదటిది. అది మతంగ మహర్షి ఆశ్రమప్రాంత మాహాత్మ్య విషయం. మన రాజద్వ

యం పంపా సరోవరం చేరుకొనే టప్పటికే తన ప్రభావం చూపటం మొద లు పెట్టింది.

ఉ. స్వామి ఎడంద దేవి యెడ-బాటునవ్రేఁగొకయింత తగ్గిన
ట్లై మదిలోన నా చెఱువు-నందము మెచ్చెడు నట్లు కన్నులం
గోమలభావరేఖ కను-గొంచును లక్ష్మణుఁ డల్ల లసత్సప
ర్యమ్మదు యత్నగోపముగ-నన్నఁ బ్రసన్నునిగాఁ బొనర్చుచున్.316

ఆ ప్రభావం శ్రీరామఆత్మయందు సీతాజ్ఞాపకాలను (విరహం వల్లనైన కరుణరసాన్ని) వెనక్కు నెట్టి ఆశ్రమ ప్రశాంతత నెలకొనటం మొదలైంది. అందుకు లక్ష్మణసాక్షి గోప్యంగా అన్నగారు ప్రసన్నం అయ్యేటట్లు తన వదినగారిదివరకు చేస్తుండే దైనందిన సపర్యలకు లోపం కలిగిందనిపించకుండా అన్నిటికీ తానే పూను కొన్నాడు.317

సీసం నిండా ఆ వివరాలున్నాయి, అది అలా ఉంచితే ఆ అన్న దమ్ములు పంపానదిని దర్శించిన ఈ పద్యం చదవండి.

చం; అనధికమౌ తరంగములు-నాలఘు వారియు నొడ్డు నందునే
చిన తరురాజియున్ ఖగవి-శేషములుంగని పంపయంచుఁచే
ర్విని యిది చెర్వు పంపయను-పేరిటిదంచుఁద లంపన
య్యెన మఱి కాక వార్ధియిది-యే యని రాఘవు లెంచకుందురే.313

రాఘవులు పూర్వం పేరువిని చెరువని పేరువిని ఉన్నారు గనుక గానీ అసలు దాన్నిచూసి సముద్రమే అనుకోకపోయారా అని మన నడుగు తాడు శ్రీ సత్యనారాయణ గారు. చెరువు పెద్దదని చెప్పటానికి రాఘవుల పరిజ్ఞానానికీ ముడిపెట్టాలా! అది వారి పరిహాస ప్రియత్వానికి నిదర్శనం. ఆ తరువాత చెట్లూ చెట్లమీద పిట్టలూ ఉన్నట్లు చెప్పి అవనంలో హరిణులూ(ఆడలేళ్లూ) పంపా రేవుల దవ్వుగ కాననవరాహములు (అడవిపందులూ చూసి" శ్రీరామచంద్రుండు విషాదోత్సాహ భరితుండై" 320.
(విషాదంతోడిన ఉత్సాహవంతుడయ్యాడని భావం)

మ. అవి దారంబున గుంఫితములునుగా–వాలాకి పూదండయై
పువులో ముత్తెము లోయనందొడివం–పుగ్గానరాకుండ ను
న్నవి సౌమిత్రియుఁ జూచి రాముఁడు కబం–ధప్రోక్తమౌ శ్రీమతం
గవిశేషోజ్జ్వలమౌ మహామహిమకుం–గైమోడ్పు సంధించుచున్ 321

చం. అడవిఁ జరించు శిష్యజను–లంగములం జెమరించి స్వేదముల్
పొడమిన మిక్కిలిన్ బడలి–పోదురటంచు దయాతరంగముల్
పొడిచిన యట్టి మౌని యవు–బోయమృతోదధి యింత మిన్నులో
నడవిని వ్యాప్తమౌ మహిమ–యయ్యది బ్రహ్మపదార్థ కల్పమౌ 322

రెండు పద్యాల్లోనూ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కవి యొక్క "అత్మ ద్రవ్యమున కను కూలమైన శబ్దముల" ప్రోవు ఉంది. ఇంకా భావాల ప్రోవుజోడైంది పద్యాల్లో అస్పష్ట మాధుర్యం నెలకొంది. అయితే 321 పద్యం లో పూదండకీ 322 పద్యంలో శిష్యుల చెమటకీ మతంగ విశేషోజ్జ్వల మహిమకీ ఏమిటి సంబంధం అని తెలుసుకో దలుచుకుంటే సంస్కృతమూలం చదువుకోవాలి. అక్కడ కబంధుడు చెప్తున్నాడు.

తేషాంభారాభి తప్తానాం వన్యమాహరతాంగురోః ॥ 23
యే ప్రపేతుర్మహీం తూర్ణం శరీరాత్స్వేదబిందవః ।
తాని జాతాని మాల్యాని మునీనాం తపసాతదా॥ 24
స్వేదబిందు సముత్థాని నవినశ్యంతిరాఘవ।

"ఆమునులు గురువునకుగా వన్యపదార్థములం గొనిపోవుచు బరువుచే డింపబడగా వారి దేహంబుననుండి నేలం బడిన చెమట బిందువులన్నియు వారి తపో బలాతిశయంబునం జేసి పుష్పంబులైనవి. రాముడా ఆమునుల చెమట బిందువుల వలనం బుట్టిన యా పుష్పంబులు వారి తపోమహిమంబునం జేసి నాశంబు నొందకున్నవి." అనేది వావిళ్ల వారు వ్రాయించిన తాత్పర్యం.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మతంగ మహర్షిని ఒక్కని ప్రాధాన్యంగా ఆ శిష్యుల చెమటలనుండి పూదండలు రావడం (అస్పష్ట మధురంచేసి) వాత్సల్యపరిపూర్ణుడైన అమునిదే మహిమ అన్నట్లు మార్చాడు. ప్రస్తుతానికి ఆశ్రమంలో ఉన్నది శబరి ఒక్కతే గనుక ఆమార్పు వల్ల నష్టంలేదు పైగా మునిని ఉత్తమమహిమోపేతుని జేసి సందర్భాన్ని సాంద్ర పరుస్తుంది ఆయన గౌరవాన్ని. ప్రస్తుతానికి వస్తే శ్రీరామఆత్మ

కం. ప్రాకట ముని మహిమము తను
దాకిన య ట్లొచుఁబులకి–తాప ఘనుండై
యీ కాశ్యపి సర్వశ్రీ
చేకో మునిమహిమ ముద్ర–చెందినయట్లై. 323

ఒడలు పులకించి యీనేల సకల వైభవోపేతముగా మునిమహిమముద్రకలదిగా నచట అడుగు పెట్టగానే అముద్ర తనకంటిన అనుభూతి పొందాడు. దీనితో ఆయన దైవపాత్ర మొదలైందనుకుందా మంటే కుదరదు. సంపూర్ణ దైవస్ఫూర్తి శ్రీ సత్యనారాయణగారా పాత్రలో నింపదలచుకో లేదు. ఏమంటే ముని మహిమ తనకు ముట్టి ఒడలు పులకించటం తో సరిపెట్టేసాడుగా మరి! అలాంటప్పుడు మతంగమునిలా ఆ పాత్రను మరో ముని అనుకుందామన్నా కాదు. ఆయన జానకి సమేతుడై ఉన్నపుడు శ్రీ రామఆత్మ. జానకిని దూరంజేసుకొని శ్రీ రాముడు మాత్రం మిగిలాడు. ఇపుడు మునిమహిమకు పులకించి మళ్లీ శ్రీరామ ఆత్మ ముద్రవహిస్తున్నాడు. అదేమిటి జానకిని పొందకుండానేనా! ఔను అదే భేదం. న్యాయంగా ఇక్కడ ఆత్మమాత్రుడై ఉండాలి. కాని శ్రీ సత్యనారాయణ గారు శ్రీరాముని వదలటానికి ఏమాత్రమూ ఒప్పుకోరు. (శరీరధారణ మూలంగా అది సమంజసంకూడాను) శ్రీరాముని పరిహాసశీలం ఆయనకు ఆత్మీయం. అదీ సంగతి.

ఆ కారణంగా జానకి సమేతశ్రీరామ ఆత్మకీ జానకీవిదూర శ్రీరామ ఆత్మకీ భేదం నిరూపించుకో వలసిన బాధ్యత నెత్తిన పడింది. అలాంటి ఎన్నిబాధ్యతల భారాన్నైనా అవలీలగా తలకెత్తుకు భరించగల

వ్యక్తి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు. ఆ సందర్భంగానే మతంగ మహర్షి మహిమ శ్రీరామ ఆత్మకు ప్రాకించాడు, అసాధ్యుడు. చూడండి.

చం. తన విరహానికిన్ మునిశ- తారి మహత్తుకు సుంతభేదమై
నను గనిపించరాక రఘు-నాథుఁడు చిత్రముగాఁజరించుచున్" 324.

ఇందులో చిత్ర శబ్ద ప్రయోగం గంధర్వనగర దర్శనం లాంటిది కాబట్టి శ్రీ రామ ఆత్మ ఇక్కడినుంచే దైవపాత్ర నటించటం మొదలౌతుందని సూచన.

అంతకు ముందె ఒకసారి జానకి సహిత శ్రీరామ ఆత్మ పరిహాస శీలం కొద్దిగా పరికిద్దాం. దశవర్ష ఖండంలో సుతీక్ష్ణాశ్రమం నుంచి అగస్త్య భ్రాత ఆశ్రమానికి వెడుతూ దారిలో సీత ఒక కథ తాను విన్నది చెప్పనా! అంది.

గీ. మన సుతీక్ష్ణుల కులమున-మావిగున్న
మొన్న పూచినదే, యట-నున్నపర్ణ
శాల వృద్ధగార్గేయి దీ-క్షాకపర్ది
నామె చెప్పెను చెప్పదు-నాయటన్న. 255

ఉ. చెప్పదునా యటన్న మఱి-చెప్పెడు నద్దియెదో యెఱుంగఁగా
నొప్పదటన్న స్వామి; సతి-ఊఁ అటులౌనె ప్రసంగసాధువై
యొప్పు నగస్త్యమౌని కథ-యొక్కఁడటంచును నామెయెట్లుగాఁ
జెప్పెనొ యట్లె చెప్పెదను-చిక్కని యాకథయంచునాడగన్. 256

గీ. స్వామియది యిప్డనేవినఁ-జాలనన్న
జానకి కథాభిమానకృ-ష్టాత్మయగుచు
మీరు వినకున్న వినును సౌ-మిత్రియంచు
కథన మారంభముంజేసెఁ-గాతరాక్షి. 257

(వాతాపి ఇల్వాలుల కథ చెప్పింది.)

వ. "అని జానకి ఇది గార్గేయి చెప్పినకథ. బాగు లేదా యనస్వామి నాకా బాగేమో తెలియదు గాని తెలిసినవి రెండుసంగతులు మొదటిది నీవు రామునిభార్యవని, రెండవది జనకుఁగన్న కుమారివని" యన సీత కాదు కాదు" రఘూత్తముని భార్యారత్నమ నని (గార్గేయి కథనములో" ఓ రఘూత్తముని భార్యా రత్నమా! 265 పద్యంలోనూ "అట్లు మునుల కిచ్చె జనకుఁగన్న కుమారీ" 282 అనిన సంబోధనలలో, అని (సరిగా వినలేదని సవరించిన నెపముగా విన ననిన వారెట్లు తెలుసు కొన్నారనీ, ఎందుకు విన్నారనీ వెక్కిరించినట్లు) "అనఁగా రాముఁడు (ప్రసంగము తప్పించి) సౌమిత్రితో నిట్లనియె," అంతలో అగస్త్య సోదరుని ఆశ్రమం సమీపించిన సద్దు వినిపించటం తో అక్కడకు చేరుకొన్నారు,

ఇందులో సీత కథనం మిషతో తాను రఘూత్తముని భార్యారత్నముగా గార్గేయిచే సంభావింపబడితినని ప్రకటించు కోవాలనే ముచ్చట, అది ముందే గ్రహించి కథవిన ననీ తీరా కథనం అయ్యాక సీతలోని ఆంతర్యం బయటపెట్టి పరిహసించటమూ ఆమె సరిచేయటం నెపంగా మరోసారి ఆమాట చెప్పి ముచ్చట తీర్చుకుంటూ ధారణ లేని వాడుగా తానామెచే పరిహసింపబడటమూ రెండింటా శ్రీరామ ఆత్మ సమపరిహాస శీలం తెలియవచ్చు, ఆమె కథ చెప్పనా అని బులిపిస్తే అంత దాచుకోవలసింది చెప్పవద్దులే అనటమూ ఈ కోవలోదే, ఇలాంటి సందర్భాల్లో 257 పద్యం 2వ పాదం" జానకి కథాభిమాన కృ–ష్టాత్మ, యగుచు" లో చివరి మాట 'వోలె' అని ఉంటే ఆ మనసులో మమతను మనం పట్టు కోవటం తేలిక. శ్రీ సత్యనారాయణ గారు అసలు విషయం అలా దొరకనీయడు. అది ఆయన పరిహాసశీలం.

మళ్లీ మనం రంగస్థలానికి వచ్చేస్తే శ్రీరామ ఆత్మ విరహానికీ ముని మహాత్మునికీ సాపత్యం ఏమిటి? "మునియునుతాను నిర్ధఋషు–మోహితులై మునిరాజు శిష్యులందునఁబరి రక్షణా మతియు–నూల్కొని తానుగ సీతయందునన్." 324 మునికి శిష్యుల యందు పరిరక్షణా బాధ్యత

ఉంది, శ్రీరామ ఆత్మకు సీతయందు పరిరక్షణా బాధ్యత ఉంది. ఎలా గంటే ముని శిష్యులయందూ తాను సీతయందూ సామాన్య లక్షణంగా మోహితులు గనుక. మునిది వాత్సల్యం: శ్రీరామ ఆత్మది ప్రియభావం. ఏదైనా ప్రేమే. అంటే మోహించటం, ప్రేమించటం, వలచటం, వాత్స ల్యం చూపటం వంటివి- శ్రీరామఆత్మ ఇక్కడ నుంచి దైవత్వ ప్రకటన గనుక నిష్కల్మష అమలినములుగా మారి సమానార్థకాల ప్రయోగించ టం ఉంటుందన్న మాట. మన్మథ ప్రస్తావన కూడా ఇందులోనే సర్దు కుంటుంది. అసలు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ఇతరత్రాకూడా కోరిక స్థానంలో 'పుష్పబాణ' శబ్దం వాడటం ఉంది. రామలక్ష్మణులను పట్టుకొన్నపు డంటాడు కబంధుడు.

చం. పని యది యేమి యిచ్చటకి-వచ్చితి రధ్వము తప్పి కానలా
డని దయినట్టి కాఅడవి-డాగురు మ్రుచ్చులు సాగవింకరా
జును మణిమంత్రి నిద్దఱను-జుంగపు ముద్దలు గాఁగ నింతతీ
రని రుచిపుష్పబాణజుహూ-రాణములన్ మిముమ్రింగి తీర్చెదన్239

ఇందులో చివరి పాదంలో "పుష్పబాణజుహురాణములు" అం టే పట్టి కోరికల గుట్టాలనే గాని మన్మథుని వాహనాలైన చిలుక లేంగావు అసలది శృంగారానికి సంబంధించి ఏమీకాదు. అలాగే జరగబోయే సన్ని వేశంలో వచ్చే వలపు కామాదులూ శృంగారానికి సంబంధించవు. ఇక్కడే ఒక స్థిరాభిప్రాయం ఏర్పరుచు కోవటం చాలా అవసరం. అక్కడ ఇదొక పరీక్షగా దాపురించేట్లు చేసాడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు.

జాగ్రత్త. ఆయన పరిహాస శీలం మనకు ప్రాణ సంకటం. ప్రస్తుతానికి వస్తే "వ. మఱల శ్రీరామ భద్రుండు ముని శిష్యులవలెఁ దన జానకి యు సుభద్రగానెంచి" 325 ముని శిష్యుల చెంతఉండి పరిరక్షణా భారం వహిస్తున్నాడు గనుక వాళ్లకు భద్రత ఉండవచ్చు. తనను బాసి దూరంలో ఉండి తన పరిరక్షణకు అందకుండా ఉన్న సీత సుభద్రగా

ఎలా ఉంటుంది.? ఏదో తికమక ఉంది. మునికీ తనకీ పోలిక చెప్తున్నాడు గనుక హితులకు దూరం అవటంలోనూ ఆ పోలిక ఉందా! ఉండితీరాలి. అంతే 359వ సీసపద్యం మూడవ పాదం చదవండి.

"చిత్రకూటము మీరు-చేరిన యప్పుడు
గురుమూర్తి దివమున-కరిగినారు,"

అన్నది మునిశిష్యురాలు శబరి. కాబట్టి శ్రీరామ ఆత్మ అక్కడికి వచ్చే టప్పటికి పదమూడేండ్ల నాడే మతంగముని దివికేగె నన్నమాట. ఆయన ప్రేమమహత్వమే శిష్యులకు భద్రమైంది. అలాగే తన ప్రేమ మహిమ (అచంచల మనో ధర్మంచేత) దూరమందున్న తన ఇల్లాలికి కూడా భద్రం ఔతుంది. ప్రేమ ఇద్దరిలోనూ సమానమే. దాని మహిమా అంతే. ఈ తలంపుతో తనయందు భగవన్మహిమ నాపాత్ర గుర్తించటం జరిగిన సూచన.

సరే ఇంతకీ శ్రీరామ ఆత్మకు (323) తాకిందపించిన ఆమునిచె గానీ ముని ఆశ్రమానిది గానీ ఆమహిమ ఏమిటి? శబరీ శ్రీరామమ్ నాటికలో ఆయనే శబరి నడిగి తెలుసుకుంటాడు.

గీ. అని శబరి దిక్కులం జూపి-యంబుజాక్ష
తన్మహాముని మహామావ-దాతము లివి
యనిన శ్రీరామ చంద్రుడే-శాంశువులను
నిండు జాబిల్లి పండువె-న్నెలలు తోచె. 366

గీ. మఱి శబరి వృక్షములు చూపి-మనుకులేశ
ముని తపఃశ్లిష్ట మహిమసం-భూతమాధు
రీని గూఢ గర్భములన-శ్రీప్రభుండు
భుక్తఫలరుచి జిహ్వలో-బులకరించె, 367

మొదటి పద్యంలో చూపించినవి ఏమిటి? దిక్కులా! అక్కడే

మయినా ఉన్నాయా లేవా! ముని మహిమచే పరిశుద్ధ మైనవిట- ఏమి టవి? ఏమోగాని ఆదర్శనానికి శ్రీరామ ఆత్మ కంటివెలుగు రేకల్లో మా త్రం నిండు జాబిల్లి పండువెన్నెలలు తోచాయట. నాలాంటి వాడెవరన్నా వ్రాస్తే ఈ పద్యాన్ని ...స్తారు. మరివ్రాసింది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారయ్యె!

శ్లో. పశ్యమేఘ ఘన ప్రఖ్యం మృగపక్షి సమాకులమ్!
మతంగవనమిత్యేవ విశ్రుతం రఘునందన॥ సర్గ 74 శ్లో 21

వాల్మీకి దట్టమయిన మొయిళ్లచే (ఎండతగలకుండా) కప్పబ డింది. పెంపుడు జంతువులూ పిట్టలతో కలకలలాడుతోంది. దీన్నే మ తంగ వనమంటారు రామా! అని శబరి చూడవయ్యా అంటూ చూపిందని వ్రాసాడు. ఇప్పుడు శ్రీ సత్యనారాయణ గారి శబరి ఇవిగో అని చూపిస్తూ ఒక్కసారి అలా హస్త చాలనం చేసేటప్పటికి అవన్నీ హెూష్ కాకి అయి పోయాయి. ఏమైనా అది ప్రౌఢకవి వాక్కు కనుక "అదియిది యననేల నచటి యన్నియు నగు/తన్మహాముని మహిమావదా తములిక" అనుకుం టేసరి. లేదా శబరీ శ్రీరామమ్ నాటిక యొక్క దర్శకుడు నేపథ్యంగా వాటిని వాల్మీకినించి సంగ్రహించి సమకూర్చాలి గానీ శబరిపాత్ర నోట పలుక నక్కరలేదనుకున్నా సరిపోతుంది. ఆదర్శకుడి బాధ్యత అసలు శబరి పాత్రను ఏరుకోవటంలోనే ఉంది. చదవండి.

వ. అంతసుంతవంగి నడచుచుండియు రాఘవులకంటె నాయామదేహయు నిత్యవిభూతి లేపనమును వలీబహుళతయుఁజేతధూసరవర్ణయు నిష్పత్ర శుష్కవల్లి కారజ్జు నిర్మిత బాహుదండ భూషయు....శబరి యిట్లనియె. 368

దర్శకుడు ఈ వచనంలో మొదటి విషయాన్ని గురించి తప్పని సరిగా జాగ్రత తీసుకోవాలి ముందు. ఏమిటిది। ఆమె 'ఆయామదేహ, యట.' ఆయామము అంటే దైర్ఘ్యము, నిడుపు అని శబ్దరత్నాకరం. "దైర్ఘ్యమాయామ ఆరోహః" అని అమరం 2కాం 373 శ్లో. వ్యుత్పత్తిచూ

సినా ఆయమ్యతే హస్తాదినా అయామః, యమ-ఉపరమే. హస్తాదులచే (ఇన్నిహస్తములున్నదని) నియమింపబడునది. అందిగురు బాలప్రబోధిక. దీన్నిబట్టి ఆయామ అంటే పొడుగైనఅని చెప్పక తప్పదు. అక్కడితో సరా! ఆ పొడుగు రాఘవుల కంటె-సరే అనుకుంటుంటే ఆమెనుంత వంగి నప్పటికీ కూడానట. మరి దర్శకుడు అంత పొడుగైన స్త్రీపాత్రధారిణిని తెస్తాడో-లేక ఒకామెను ఏరి తెచ్చుకొని ఆమెకంటె పొట్టి రాఘవుల పాత్రధారులను తెస్తాడో-ఆ తిప్పలాదర్శకుడివి. శ్రీ సత్యనారాయణ గారు తెలియఁజేసిన శబరి పాత్ర మాత్రం కొంచెం వంగినాకూడా శ్రీరామలక్ష్మణులకన్నా పొడవైన శరీరం గలది అనటంమాత్రం నిజం. వాల్మీకి శబరి "జటిలావృద్ధా చీరవృజినాంబరా" అని మాత్రమే వ్రాసాడు. మనం జరగబోయే ఏకాంకికలో చూడవలసింది శ్రీ సత్యనారాయణ గారి శబరినే పొడుగ్గానే ఉంటుంది తర్వాతవన్నీ మునిమహిమను తెలిపే నిదర్శనాలున్నాయి చివర చెప్పకోవచ్చు.

మతంగాశ్రమప్రాంతం (నాటిక రంగస్థలం) అలా మహిమోపేతమైనట్టిది అనినంతవరకూ మనసుల్లో బాగానే నాటుకుంది గానీ సరిగ్గా శ్రీరామఆత్మ వనయాన ఆరంభంగా చిత్రకూటం చేరినప్పుడే మతంగ మహర్షి అలాదివి కేగటం ఏమిటి! తన మాహాత్మ్యంతో (ఆపదమూడేళ్లనాడు ఆయన ఉంచిన పూలు వాడక, బట్టల తడి ఆరక ఉన్నట్లు శబరి చూపించిందే!)కాలాన్నలా శాంసించి తన తనువునూ నిలుపుకొని శ్రీరామఆత్మ ఆగమానానికి వేచి ఉండి స్వయంగా ఆతిథ్యం ఇచి తరిస్తే బాగుండే దనిపింస్తుంది. కానీ

ఆతిథ్యం ఇచ్చేదెవరికి! శ్రీరాఆత్మమకా-శ్రీరాముడికా-సుస్నిగ్ధమైనఆత్మకా! అంటే మహర్షిగా ఆయన ఆధ్యాత్మికవ్యక్తి గనుక ఆత్మప్రాధాన్యాన్ని ఎంచుకోవటం మనం కాదనలేం. ఆత్మసర్వవ్యాపి కదా! ఆవిషయం మతంగమహర్షి తనువుతో ఉండగానే ఆవనప్రాం స్థావరజంగమా లన్నింటా నిలిపి వేదం లోనీ మాటగా అవలంబింపజేసి పలుకుతూండేటట్లు చేసిన ఆయన తపోమహిమలక్ష్మణసాక్షి గుర్తింపబోతాడు కూడా! అలాంటప్పుడు శరీరం కారాగారమే కదా!

కాబట్టి ఆశరీర(అప్పటికే చాలావృద్ధుడు) కారాగారం తప్పించు నిక్షా (తన మహిమకు సాటి రాగల శ్రీరామ ఆత్మసంచారం మొదలైందిగదా అని అప్పుడే) ఆత్మగా పరమాత్మను గురించి పయనించాడు. తనద్యు లోక పయనం శ్రీరామ ఆత్మ వనసంచారం త్రికూటాన్నించి మొదలుగా ప్రకటించాడా మహర్షి. తన హృదయం (భౌతిక మర్యాదకై) శిష్యురాలు శబరిలో నిక్షేపించి శ్రీరామ ఆత్మకు స్వాగతసత్కారాలు నెరవేర్చే టట్లు నియమించాడు గదా! కనుకనే మునులందరిలోకి మతంగ మహర్షి ధ న్యుడు. తనద్యులోక యానంనుంచి తన హృదయం అయిన శబరి ద్యు లోకయానం దాకా జరిగే చరిత్రే స్వేచ్ఛావర్తమైన రామాయణం (పాద్మే భూమిఖండే 36 అధ్యాయే అథత్రయోదశ వర్షే పంచవట్యాం మహామనాః రామో విరూప యామాస శూర్పణఖాం నిశాచరీమ్॥ గాగోవింద రాజీయ వ్యాఖ్య పుట 51.) పదుమూడెళ్లు. ఆ తర్వాతిదంతా (అంతకు పూర్వపు దీను అవసర నైవేద్యమే సుమా అని తల్చిన శాశ్వత కీర్తిమంతుడు గావటం కంటె ధన్యత ఏముంటుంది! రామాయణం అంటె ఏమిటో గోవిందరాజీయ వ్యాఖ్య బాలకాండ ప్రథమస్సర్గ 99వ శ్లోక వ్యాఖ్యాన సందర్భంలో ఇచ్చింది.

1. రామ స్యాయనం రామాయణమ్. అయగతౌ ఇతి ధాతోః భావేల్యుట్ రామచరిత మిత్యర్థః. 2, రామః అయ్యతే ప్రాప్య తేఽనేనేతివా రామాయణమ్ 3, రామః అయనం ప్రతిపాద్యోయస్య ఇతి వా రామాయణమ్, (1 రాముని పయనమే రామాయణం, 2 రాముడు దేనివలన ప్రాప్యుడౌనో అది రామాయణం. 3 రాముడెందు మార్గం ప్రతి పాదిస్తాడో ఆ గ్రంథం రామాయణం).

మనం చివర్నుంచి పట్టుకుంటే ఇందులో శ్రీరామ ఆత్మ ప్రతిపా దించేది ముక్తి మార్గం కనుక మతంగమహర్షి ముక్తినుంచి శబరి ముక్తి వరకూ నడిచిందే అసలు రామాయణం ఆరామాయణం కలుపుకొన్నది

కతుకనే షట్కాండ పూర్ణమైన రామచరితాని కంతకీ అపేరంకింది. ము
క్తిమార్గం అందించే రామాయణం ఉన్నదే అసలురామాయణం. ఇలా
అన్ని నిర్వచనాల్లోకీ చౌరబద్ధ వృత్తాంతానికి ఆద్యంతాల తానూ (మతం
గమహర్షి) తన హృదయమూ (శబరి) సరిహద్దులుగా నిలిచిపోవటం కంటె
భాగ్యమేముంటుంది! ఆయన ప్రాధాన్యాన్ని ఎవరూ గుర్తించ లేదంటే
(గుర్తించని వాళ్లలాఘవం) అటువంటి గుర్తింపు ఆయన కక్కర్లేదు.
అదీ మతంగమహర్షి ఔన్నత్యం. అరణ్యకాండంలో ఆదినించి అత్యం
దాకా చాలాసుందికి శ్రీరామఆత్మ మోక్షంప్రసాదించటం పరిగణించినవాళ్లీ
కాండను మోక్షకాండగా ప్రస్తావించటం ఉంది.

ఇప్పుడు ప్రధానాంశం "శబరీ శ్రీరామమ్" నాంది ఎప్పుడో రంగా
భ్యంతరంలో అయిపోయింది. తెరతప్పించే సమయం వచ్చేసింది. సమీ
పాభిముఖస్థానం ఆక్రమించి సావధానంగా ప్రదర్శన చూద్దాం రండి.

గీ. పంప పడమటి యొడ్డునఁ-బట్టిచనుచు
నన్నదమ్ములు శేఖరా-యాతశిశిరి
తోరు పంపాసమీర సం-భారమునకు
నుత్తరీయముల్కప్పికొం-చూగి నడచి 326

పద్యం కడబంతి ఉత్తరీయములు కప్పుకోవటంలో (పెడమర
ఊహ) తెర తప్పించటం చూపించబడింది. (పూర్వం ప్రదర్శన లోని
పాత్ర కడ్డుగా ఉత్తరీయంఅటూయిటూ ఇద్దరు పట్టుకోగా సూత్రధార-
ప్రస్తావన-జరిపి అనంతరం పాత్రను ప్రవేశపెడుతూ సూత్రధారు డా
అడ్డు తప్పించిన ఉత్తరీయం బుజానవేసు కొనేవాడు. భామా కలాపాల్లో
ముఖ్యంగా ఇలా జరిగేది.) పద్యంలో ప్రవేశించిన పాత్ర లన్నదమ్ములనీ
వాతావరణం చల్లగా ఉందనీ, ప్రాంతం పంప పడమటి గట్టు అనీ
శ్రీ విశ్వనాథ స్వయం సూత్రధారుడై ప్రస్తావన నిర్వహించాడు. ప్రదర్శ
నం మధ్య మధ్యలో కూడా ప్రత్యక్ష ప్రదర్శనకు వీలుకానివన్నీ ఈ సూ

తృధారుడందిస్తూండటం ఉంటుంది.

ప్రవేశించిన అన్నదమ్ములు కబంధుడు చెప్పిన మార్గవిశేషక్రమంబట్టి అనుసరిస్తూ సరిగా చెట్టు తర్వాత చెట్టుగా గుర్తించుకొంటూ (అ రాఘవులు) దారి తప్పలేదనుకుంటూ సాగుతుంటే "ఎవరో వెన్కను రామ! యంచుఁబిలువన్ ... శ్రీరాముఁ డీక్షించి యెవరింగానక నిల్చియుండ ననుజుండే రాళమౌ నామ్రపుంజివురున్ గుత్తుల వెన్కఁజూపి....(328 పద్యం) ఇదివేదంబులలోని మాట యనె నిక్ష్వాకురత్నంబు హృత్పద్మమందుం బ్రియతాత్ముఁడై మఱి సుమిత్రాసూతి....త్రోవతప్పము ప్రభూ.... ముందఁరిది, శబర్యాశ్రమమే కావలెన్." (ప. 329)

ఎవరో వెనుకనుంచి 'రామా!' అని పేరుపెట్టి పిల్చినట్లైంది. కొందరది శబరి పిలుపే అని తొందరపడి చెప్పి వెయ్యటం ఉంది. ఇంకా శబరి ఆశ్రమం రాలేదు పైగా అది తమకు ముందర ఉన్నట్లు లక్ష్మణసాక్షి ఇప్పుడే గుర్తించి చెప్తున్నాడు. పిలుపేమో వెనుకనుంచి వచ్చె ఏరాళమౌనా మ్రపుంజివురునన్గుత్తుల నుండి వచ్చినట్లు చూపించాడు పైగా అది వేదాలలోని మాటసుమా అని చెప్పాడు.

లక్ష్మణసాక్షి గుర్తుపట్టిన ఆవేదాలలోని మాటఏదో తనపేరన్నంత సన్నిహితంగా ఉండి శ్రీరామ ఆత్మకు తననెవరో పిలుస్తున్నారనే భ్రాంతి కలిగించిన ఆమాట ఏదో రెండుసార్లు ప్రస్తావనకు వచ్చినా శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు బయటపెట్టడు. అయితే శ్రీరామ ఆత్మ భ్రాంతిలో మునగటం లక్ష్మణసాక్షి యందుండి బయట పడవెయ్యటం అనేకార్యాన్ని బట్టి ఆ వినపడిన శబ్దం 'తారకం' అయినట్టి దని గుర్తించవచ్చు.

ఒకప్పుడు భారద్వాజుడు యాజ్ఞవల్క్యుని అడిగాడు-తారకం అంటే ఏమిటి? అది దేన్ని తరింపజేస్తుందీ అని ఆయన ఇలా చెప్పాడు 'అకారః ప్రథమాక్షరోభవతి. ఉకారోద్వితీయాక్షరో భవతి. మకారస్తృతీయాక్షరోభవతి. అర్ధమాత్రశ్చతుర్థాక్షరోభవతి. బిందుః పంచమాక్షరోభవతి. నాదష్షష్ఠాక్షరోభవతి. తారక

త్వాత్తారకో భవతి, తదేవ తారకం బ్రహ్మత్వం విద్ధి. తదేవోపాసితవ్యమ్ ఇతిజ్ఞేయమ్. గర్భజన్మజరామరణసంసారమహద్భయాత్ సంతారయతీతి. తస్మాదుచ్యతే షడక్షరక మితి." అథర్వణీయ రామ ఉత్తర తాపిన్యు పనిషత్.)

పై ఆరింటిలో 4, 5, 6 పలకటం లోని ప్రత్యేకతలు కాగా మొదటివే భాషా వర్ణక్రమాక్షరాలు. అవి అ+ఉ+మ్, కలిపితే 'ఓమ్' అదే తారకం. పలుకుతెలివిలో షడక్షరకమైందంటారు. ఆమొత్తం బ్రహ్మత్వంగా తెలుసుకోమంటాడాఋషి. ఆదే ఉపాసించాలి. అదే జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయాలని మనం ముందే అవగాహన గొన్న త్రిపుటి చివర్లోని జేయం ఆత్మ. తర్వాత ఈ తారకం సంసారభయాన్నుంచి తరింపజేస్తుందన్నాడు. శ్రీరామ ఆత్మ దశరథసంతానంగా కాక వాసుదేవ విష్ణుమూర్తి అవతారంగా ఆత్మజ్ఞేయం మాత్రంగా గ్రహిస్తే వేదాల్లోనూ ఉంటాడు. అప్పుడాయనకు ఓంకారమూ నామమే ఔతుంది.

ఇక్కడ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి చమత్కారం ఏమిటంటే శ్రీరామ ఆత్మ ప్రకృతి నినదించే ఒకారానికే (కేవల ఆత్మగా) స్పందించి తాను వేదపురుషుడైన జ్ఞేయ-ఆత్మగాప్రవర్తింపవలసిన స్మృతి నందుకోవటాన్ని-ఆ ఓంకారాన్ని రామ (తనభౌతికావతార) నామంగా అపాత్రభ్రాంతిపడినట్లు అతడి సోదర లక్ష్మణసాక్షి పాత్ర ఆ భ్రాంతిని నివారించి నట్లూ నటింప జేసే ధ్వనిని 'ఇది వేదంబులలోని మాట' అనిపించటంలో నిక్షేపించాడు. సర్వ అలాగే స్వర శాస్త్ర నిష్ణాతుడాయన. (జీవుల స్వరపేటికలోని జంటపొరల నడిమిగా సాగివచ్చే నాదం అనునాసిక్యంచే 'ఒం' కాగా నాలుకచివర ముందుతాలువును చేరి స్పందిస్తూ **(Trill)** నడిమిగా సాగివచ్చేనాదం అనునాసిక్యంగా పెదవులమూతచే రాం పలకటం ఔతుంది. ఈ రెండింటి నడుమా తేడా దూరం తప్ప శబ్దం పుట్టడంలో అంతగా ఉండదు. సన్నాయి వాద్యము పీకనుంచి వెలువడే నాదంలో రకారధ్వని చెవులకి అనుభవమే. సరిగా ఉండే సర్వపేటిక పీక

నుంచి (బొంగురుగొంతు అయితే గుర్తించటం తేలిక) వెలువడేది కూడా ప్రకృతి సిద్ధంగా రకారధ్వని మాత్రమే అని దాన్నిబట్టి 'రామ్' అనేదే సహజం అయిన ప్రణవ శబ్దం అని, కొందరు పెద్దలు ఉపన్యసించటం ఉంది.)

శ్రీ సత్యనారాయణ గారి చమత్కారం అయితే బాగానే ఉంది గాని మనం ఇలా ఓంకారమే తారకమంటే ప్రస్తుత రామభక్తులు చాలా మంది మన మీద దండెత్తే ప్రమాదం ఉంది. వాళ్లనుకొనే తారకమంత్రం వేరేఉంది మరి అయితే వాళ్లుకూడా తెలుసుకోవలసిన విషయం ఒకటి ఉంది చిత్తగించండి.

"సర్వేషు రామమంత్రేషు మంత్రరాజష్షడక్షరః" (రామ రహస్యో పనిషత్ 5అధ్యా) సనకాది మునులు అడిగితే హనుమంతుడు ఈ మాట అన్నాడు అయితే ఆషడక్షర మంత్రం ఏది? అంటే మళ్లీ భరద్వాజుడికి యాజ్ఞవల్క్యుడే ఇలాచెప్పాడు.

స్వప్రకాశః పరంజ్యోతిః స్వానుభూత్యైక చిన్మయః తదేవరామ చంద్రస్య మనః ఆద్యక్షరస్మృతః అఖండైక రసానంద స్తారక బ్రహ్మవాచ కః. (స్వప్రకాశమైనదీ ఆదిగా ఉండేదీ శ్రీరామచంద్రునికి మనస్సే అ యిందీ అవిరళ రసానందమయమై తారకబ్రహ్మ వాచకమైంది అ మంత్రా నికి మొదటి అక్షరం. అది ఓంకారమే.

'రామాయ' ఇతిసువిజ్ఞేయః సత్యానంద చిదాత్మకః (రామాయ అనే మూడక్షరాల సంపుటి సత్యమూ ఆనందమూ చిద్వివేకజ్ఞాపకమైందిగా గుర్తిస్తే)

"నమః పదంతు విజ్ఞేయం పూర్ణానందైక కారణమ్" (నమః అనేరెండక్షరాలమాట సంపూర్ణానందానికి కారణరూపమయింది.)

'ఏతం మంత్రరాజం శ్రీరామచంద్రస్య షడక్షరం నిత్యమధీత'

(అలా ఏర్పడిన మంత్రరాజమే శ్రీరామ చంద్రుని షడక్షరమంత్రం. నిత్యం ఉపాసిస్తే అగ్నిపూతాది పవిత్రతలు సిద్ధిస్తాయి.)

అంటే అసలు శ్రీరామ తారకమంత్రం 'ఓంరామాయనమః' అనేదిగా అథర్వణీయ శ్రీరామ ఉత్తర తాపిన్యుపనిషత్ వివరించింది. ఆ మంత్ర రహస్యార్థం మళ్లీ రామరహస్యోతపనిషత్‌లో ఇలా ఉంది.

నమస్త్వపుర్థో విజ్ఞేయో, రామస్తత్పదముచ్యతే, అసిత్యర్థే చతుర్థీ స్యాత్ ఏవంమంత్రేషు యోజయేత్. తత్త్వమస్యాదివాక్యంతు కేవలంముక్తిదం యతః, భుక్తి ముక్తిప్రదం చైతత్తస్మాదపి అతిరిచ్యతే. మనుష్యే-తేషు సర్వేషామధికారోస్తి దేహినామ్. ముముక్షూణాం విరక్తానాం తథాశ్రమవాసినాం ప్రణవత్వాత్స దార్ఢ్యేయో యతీనాంచవిశేషతః (నమః అనే శబ్దానికి 'త్వం' ప్రతిరూపకం. రామ అనే శబ్దానికి 'తత్' ప్రతిరూపకం. చతుర్థీ విభక్తి 'ఆయ' ప్రత్యయ శబ్దానికి 'అసి' ప్రతిరూపకం. అలా 'తత్త్వమసి' అనేమహావాక్యాన్ని షడక్షరమంత్రానికి జోడించిచూడాలి. అప్పుడు 'తత్త్వమసి' మహావాక్యంకేవలం ముక్తిని మాత్రం ప్రసాదిస్తుంది. మరి దేహధారులైనమనుష్యులు ముముక్షువులైనావిరక్తులైనా ఆశ్రమవాసులైనా యతులు మరీ ప్రత్యేకంగా ప్రణవసహితంగాజపించే షడక్షరమంత్రం వల్ల ముక్తి ఎలాగూ దక్కుతుంది. అదనంగా జీవనంలో భుక్తిని కూడా పొందవచ్చు) ఇందులో ప్రణవం అయిన ఓంకారానికి ప్రతిరూపకం ప్రత్యేకంగా చూపలేదు. అక్కర్లేదు కూడాను. ఏమంటే తత్త్వమసికీ రామాయనమః కీ కూడా మొదట ఆ అక్షరం ఒక్కటే ఉంటుంది. అయినా మొత్తం మీద ఓంకారం లేకుండానే భుక్తీ ముక్తీ లభిస్తున్నాయంటే దాని ప్రాధాన్యం ఏమీలేదనీ అదే తారకం కాదని అనిపించవచ్చు.

అయ్యయ్యో! అలా అనకూడదు. అదే రామరహస్యోపనిషత్తు ప్రథమాధ్యాయంలో "శ్రీరామ పీవో వాచ ఇతి ఏషామేష షడక్షరాధికారో

వర్తతే త్రేషాం ప్రణవాధి కారఃస్యాత్. న అన్యేషామ్. (శ్రీరాముడే చెప్పాడు ప్రణవాధి కారం ఉన్నవాళ్లకుఈ షడక్షర మంత్రాధికారం. ఇతరులకు కాదు) అని దాని ప్రాధాన్యం ప్రత్యేకంగా ఉంది.

ఇంతకు ముందు తత్త్వమసితో జోడించేటప్పుడీ ఓంకారం ప్రత్యేకంగా లేదను కొన్నాం. కాని ప్రణవత్వాత్సదాధ్యేయోయతీనాం చవిశేషతః" అని యతిపక్షంగా ప్రణవం ప్రత్యేకత ఉండనే ఉంది. దానికి ప్రతీక. తారకబ్రహ్మ అనేది జగమెరిగినసత్యం కనుక వేరేచెప్పనక్కరలేదు. అయితే ఇప్పుడు ప్రణవాధి కారులకే షడక్షరమంత్రాధికారం. ఇతరులక్కాదన్నాడు సాక్షాన్మంత్రాధిష్ఠానదైవం శ్రీరాముడు. ఆ తక్కినవాళ్లకి తరణోపాయం ఏమిటి?

"ప్రణవఘుంత్రాత్ ద్విగుణం జప్త్వా పశ్చాత్ రామమంత్రం యోజపేత్ సరామోభవతీతి." (ప్రణవస్థానంలో రెండుసార్లూ (రామ రామ అని) మళ్ళీ ఆ వెనక వెంటనే రామమంత్రం ఎవడైతే జపిస్తాడో వాడు రాముడే అగును. అంటే మొత్తం మూడుసార్లు రామరామరామ అని జపించాలన్నమాట ) బ్రహ్మవిద్యకు శ్రీప్రతిరూపం. కనుక ఆ శ్రీ మొదట కలుపుకొంటే శ్రీరామరామరామ ఔతుంది.

ఈ విషయమే ఉపనిషత్తు మొదట్లో హనుమంతుడు మునులకు చెప్పినట్లు "భోయోగీంద్రాంశ్చ, ఋషయో విష్ణుభక్తాస్త థైవచ! శృణుధ్వం మామకిం వాచం భవబంధవినాశినీం ఏతేషుచైవ సర్వేషు తత్త్వంచ బ్రహ్మతారకమ్, రామ ఏవపరం బ్రహ్మ, రామ ఏవ పరం తపః రామ ఏవపరం తత్త్వగ్ం శ్రీరామో బ్రహ్మతారకమ్." (అందరూ భవబంధాన్ని నశింపజేసే నామాట వినరండి. అన్ని తత్త్వాల్లోనూ బ్రహ్మమైంది. తారక తత్త్వం. 1.రాముడే పరముడైన బ్రహ్మ పదార్థం 2. రాముడే పరమమైన తపస్సు 3. రాముడే పరమమైన తత్త్వం. ఇలాంటి రామరామరామ కలిపి పలికితే అదే శ్రీ రామబ్రహ్మ తారక మంత్రం) అదే పార్వతీ-

దోవికి పరమ శివుడు ఉపదేశించిందిగా

శ్రీరామ రామ రామేతి రమే రామ మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామనామవరాననే॥

ఓ పార్వతీ! నేను శ్రీ రామరామరామ అని జపించుచు శ్రీ రాముని యందే మనస్సులో నానందముపొందుచుందును. ఆ రామ నామ మంత్రము శివవిష్ణు సహస్రనామాదులన్ని పఠించి నంత ఫలము గలది.) అని చెప్తారు. ఇప్పటి రామభక్తులు చాలామంది ఈశ్లోకం మొత్తంగా రామ తారకమంత్రం అనుకుంటారు. భద్రాచలరామదాసుకి కబీరు వచ్చి ఉపదేశించాడీ తారకం అంటూ రామదాసానందంతో పాడిన కీర్తన 'తారకమంత్రము కోరిన దొరికెను....' దానికంటే ముందీశ్లోకాన్ని తీగమెలికలు తిప్పుతూ పాడటం నాటకాలూ హరికథల్లో వింటుంటాం. అసలు తారక రామమంత్రం షడక్షరయుతం అయింది. ప్రణవాధికారంఉన్నవారికి 'ఓం రామాయనమః' కాగా తక్కిన వారికది శ్రీ–రా'మరామరామ' అని మాత్రమే. అదీ అసలు సంగతి.

ఇక ప్రదర్శనం వంకతిరిగిస్తే అక్కడ శ్రీ సత్యనారాయణ సూత్రధారుడింకా వాతావరణ చిత్రణం లోనే ఉన్నాడు. చదవండి.

కం. అవు నంతలో నవానిల
నివహము పంపాతరంగి–ణీతటహంసీ
నవగరు దాహతి పృష్టము
వివృత తరంగమ్ము వీచె–విస్ఫారముగాన్. 330

ఇంతకుముందు లక్ష్మణసాక్షి "ముందరి(ది) శబర్యారామమే కావలెన్" అన్నాడు. వెంటనే వాతావరణంలో మార్పువచ్చింది పంపపేరిటిది చెరువుఅని విని ఉండవపోతె రాఘవులు వార్ధి అనుకోకపోయారా అన్న సూత్రధారుడు 'పంపాతరంగిణీ' అంటున్నాడు. (అథనదీ తరంగిణీ నిమ్నగా పగా–నద్యాది శబములు 12 నదులపేర్లు ... తరంగాః అస్యాం

సంతతి తరంగిణీ-అలలు కలిగినది. అని అమరమూ దాని వ్యాఖ్యాగురు బాల ప్రబోధికా.) అక్కడ హంసీ (ఆడహంస-పక్షి) నీళ్లలో కాక గట్టున ఉందిట. ఉండి రెక్కలు విప్పి విదిల్చింది. తాంతో సామాన్య వాతావర ణం లోని క్రొత్తగాలి పొరల్లో బలపడి విడివడిన కెరటం విష్ణుకు సాగిందిట

హంసి జలపక్షే అయినా గట్టునా తిరగ్గలదు. కానీ సహజ స్థలం శ్రీ సత్యన్నారాయణ గారెందుకు వదిలిపెట్టించారు. (వీలుదొరికిన చోట ప ట్టుకుందాం) అది నీళ్లలో ఉన్నా రెక్కజాడించగలదు. గాలిని కదిలించ గలదు. అనుకుంటే ఏమైనా ప్రతీకగా దిద్దాడేమో। సందేహం ఎందుకు అప్పుడే లక్ష్మణసాక్షి ప్రస్తావించిన శబరికి ప్రతీక. వైరాగ్యపరిణతినందిన పురుషుని పరమహంస అనటం ఉంది. స్త్రీగా హంసిఅన్నమాట. ఈప్రతీ కని స్పష్టంజేస్తూ శ్రీ యస్‌టివి రాజగోపాలాచార్యులు గారు "ఆహంసి యొక్క జ్ఞానకర్మ లనబడు రెక్కల తాకిడితో పుష్టమై బయలుదేరిన ఒకా నొక ప్రాణవాయు విశేషము. రామచంద్రుని స్పృశించి...." అని విజ్ఞాన వ్యాఖ్యవ్రాసారు. తరువాత మరొక విషయము. భూతాత్మలందొకటైన హంసవాయువు ఒకటి శరీరగతమై యున్నది. మరణానంతరమిది భూమిపై నె మూషవాయువు నందు వాయవ్యశరీరియై సంచరించునట. (అయన కది నిశ్చితాభిప్రాయముకాదు.) దీనినే గాలి యని భూతమని మనవారు చెప్పుచుందురు. భగవత్సాక్షాత్కారమునొందిన (ఇంకా శ్రీరామ ఆత్మ దర్శ నం కాలేదు.) శబరివంటి ఆత్మజ్ఞానులయందిది శక్తిహీనమైనదగును. (నిలకడే) గనుక నింతకన్న దీని వివరమ ప్రస్తుతము." అనివ్రాసారు.

ఇంతవరకూ చేసిన వివరణం మాత్రం ఏ ప్రకరణాన్ని ఉద్ధరి స్తోంది? శ్రీ విశ్వనాథవారి సమస్యలతో పాటు 'మనవారు చెప్పుచుందురు' అన్నమాటకాక వేరేప్రమాణం లేని ఈ వివరణ మరోసమస్య తెచ్చిపెట్టిం ది. మనకు ముందు సమస్య-హంసీ (శబరి) జ్ఞాన కర్మల రెక్కల తాకిడి తో పుష్టమై బయలుదేరి రామచంద్రుని స్పృశించిన ప్రాణవాయువా-

మరణానంతరము (శబరి బ్రతికే ఉంది.) భూమిపై మూషవాయువులో వాయవ్య శరీరియై సంచరించే భూతాత్మలందొకటియైన హంసవాయువూ ఒకటేనా? లేక ఒకదానికొకటి ప్రతీకలా! అనేది.

"లోకే పరమహగ్స పరివ్రాజకోదుర్లభతరో యద్యేకోఽస్తి స ఏవ నిత్యపూతః సఏవ వేదపురుషా మహాపురుషః." అనిఆదినారాయణునికి బ్రహ్మవివరించినట్లు అథర్వణీయ పరమ హంసపరివ్రాజ కోపనిషత్తులో ఉంది. (లోకంలో పరమహంస అనదగ్గ పరివ్రాజకుడుండేటం దుర్లభం ఎవరైనా ఒకరుంటే ఆయన నిత్యపరిశుద్ధుడూ మహాపురుషుడే) శబరి కది నప్పదు. కానీ మతంగమహర్షికది చెల్లవచ్చు. అలా చెల్లినా ఆముని మరణానంతరం గాలీ, భూతమూ అని మనవారనే హంసవాయువుగా వాతావరణంలోని మూషవాయువులో ఆయన సంచరించటం కూడా అంగీకార్యం కాదు. అలా జరిగితే ఆయన వేదపురుషత్వం కాక బ్రహ్మరాక్షసత్వం పొందినవాడౌతాడు. అలా కాక ఆయన ఇంద్రరథం మీద ద్యులోకానికి వెళ్లిపోయాడు. గాలిగా భూమ్మీద తిరగటంలేదు. తన తపోమహిమవల్ల తన తపోవన వాతావరణం నిత్యోత్సాహం-నవచైతన్యం నెలకొని ఉండేటట్టు సృష్టించాడు అంతా శ్రీరామ ఆత్మకోసం. శిష్యురాలు శబరిని ఆ శ్రీరామ ఆత్మను సత్కరించటానికి నిలిపాడు. ఆవిడ ఆదేవుని రాకకు నిరీక్షించటంలో శ్రమపడకుండా సంరక్షకు మహాముని అన్ని సుభద్రంచేసినట్టు శ్రీ సత్యనారాయణ గారు శ్రీరామ ఆత్మపాత్రనోట పలికించే ఉన్నాడు. అది అంతే.

శ్రీరామ ఆత్మకు మతంగ మహర్షి మహిమావృతమైన వాతావరణపు గాలి ఇదివరకే తగలటం మొదలైంది. అంతకంతకు ఆశ్రమాన్ని సమీపించే వేళ శబరి యొక్క గురుభక్తిమహితమైన మరో క్రొత్తగాలి తెర తగిలింది. శ్రీరామ ఆత్మ అది పసికట్టాడు. రూపక శిల్పరచనలో శబరి పాత్ర ప్రవేశానికి పదస్యుల నున్ముఖం చెయ్యటం ఈకంద పద్యంలో శ్రీ విశ్వ

నాథసత్యనారాయణ గారు సాధించిన ఘనవిజయం.

అలా మతంగ మహర్షి మహిమాఢ్యమైన వాతావరణాని కలవాటు పడ్డంతలో మరోప్రత్యేక నిష్కామభక్తి వాయుతరంగం తాకి శబరి ఉనికిని ఎత్తి చూపుతుంటే అపారభక్త వాత్సల్య గుణోపేతుడైన శ్రీరామ ఆత్మకు ఆశ్రమణిని కనుగొనాలనే కాంక్ష కలగటంలో వింత ఏముంటుంది! ఏ వింతా లేకుండా వ్రాయటానికి శ్రీవిశ్వనాథ సత్యనారాయణగా రెందుకూ! అయితే ఏమిటా వింత! చదవండి తెలుస్తుంది.

మధ్యాక్కరః:-

మెడలోనఁదులసిపేరొకటి-మెత్తనిమేనివిభూతి
వడిఁదియ్యవిల్లూని కుసుమ-బాణుండుభాణంబుచివర
సడలురేకుల తుమ్మిపూవు-సంధించి జ్యానుతా విరహ
జడుమీఁద రామునిమీఁద-జ్యావల్లిసారించి విడిచె. 331

వ. అంత శ్రీరామచంద్రుండు సౌమిత్రి తోనిట్లనియె) 332

కం. తెలితమ్మి పూవుబాణము
వలెనయి నాయాత్మలోనఁ-బడినట్లయ్యెన్
వలిమేని ప్రసన్ననగుముడు
తలశబరినిఁ జూడఁగోర్కి-తారాడు మదిన్. 333

కందపద్యం చివరిపాదంలో మనం అనుకొన్న శ్రీరామ ఆత్మకి శబరిని దర్శించాలనేకోరిక ప్రకటితం అయ్యింది. అయితే పై మధ్యాక్కర ఏమంటుంది? ఉన్న[illegible]వింత అంతానాలానేఉంది. మెదడుకు పదును పెట్టుకోమంటుంది. ప్ర[illegible]త్నిద్దాం.

గమనిస్తే పూవుబాణం మధ్యాక్కరలో వదలితే పోయి కందపద్యంలో గురికి తగిలింది. మధ్యాక్కరలో ఆపూవు 'తుమ్మి' పూవయితే

కందంలో తెలితమ్మి పూవుగా మారింది. అదేమైనా అచ్చుపొరపాటేమో పుష్పబాణున్ని పంచసాయకాల్లో (అరవింద మశోకంచ చూతంచ నవమల్లికా నీలోత్పలంచపంచాస్యుః పంచబాణస్య సాయకాః" అనే ఉన్నాయి) తుమ్మిపూవు లేదు. తమ్మి అయితే 'అరవిందంగా ఉంది. మరి తగిలిన బాణం విడుపబడిందే కాబట్టి తేడా ఉండకూడదు. అయితే కవి శ్రీ విశ్వనాథసత్యనారాయణ గారు. ఆయన దృష్టిలో ఆలొచించాలి. మహాత్ముల యెడ ప్రయోగింపబడిన శస్త్రాలు పూలమాలలై వారి మెడల నలంకరించటం కొన్నికథలొఉంది. అలాంటి ఒక వింత ప్రదర్శించటానికి ప్రయోగం అయిన తుమ్మిపూవు గురియైన శ్రీరామ ఆత్మ హృదయాన్ని తాకే టప్పటికి తమ్మిగా మారటం కవి దృష్టి అన్నది కాదనలేం. కందంలో "తెలితమ్మి పూవుబాణమువలెనయి" అని వాచ్యంగానే ఉండి. కవి వాక్కు శ్రీరామ ఆత్మనోట పలకినట్లు .

కందంలో శ్రీరామ ఆత్మలో శబరినిచూచు 'కోర్కె' తారాడింది కోర్కెకు పుష్పబాణ ప్రయోగం శ్రీ విశ్వనాథ వాడటం ఉన్నట్లు కబంధుడాకలి తీర్చుకుంటానన్నప్పడు 'పుష్పబాణజుహురాణములు' అంటె కోర్కెల గుత్తాలనే దానిభావం. అని ముందే తెలుసు కొన్నాంగదా! ఇప్పుడు మథ్యాక్కజలో కుసుమ బాణుడన్నా అతడి బాణం అన్నా కోర్కెల గుత్తాలని మీదికి తోలేవాడనీ (బాణం ఓ కోర్కె గుత్తం అని) అందులొ ఓ గుత్తాన్ని-అదే కొర్కెను తోలితే అది కందపద్యంలో శ్రీరామ ఆత్మకు తగిలిందనీ-(తుమ్మిగా బయలు దేరింది గు రి క డ) త మ్మి వ లె అయిందనీ ఉంది. తమ్మి అరవిందబాణం. క్రియాకల్పన ప్రమేయంగా దాన్నే ఉన్మదబాణం అంటారు. ప్రేరేపణా-దానివలన బయలుదేరిన ఆశతో వేదనా కలిగించటం దానిపని. అది శబరిని చూడాలనే తపనను ప్రేరేపించిందనేది శ్రీరామ ఆత్మ కంఠోక్తి. తుమ్మి తమ్మిగావటంలో వింత అదీ.... ఇక్కడే ఒక్కమాట శబరిని గూర్చి కబందుడు చేసిన నామ

మాత్రపు పరిచయానికి రూపగుణాదులు వినికిడి లేనిదే మన్మథ బాణానికి స్పందన కలగటం అసహజం అన్న స్పృహ మనం విస్మరించ కూడదు.

కుసుమబాణుడంటే మధ్యాక్కర-ఐలోనూ మన్మథుడే కాని ఆ మన్మథుడొక్క శృంగారావిష్కరణకే గాని భక్తివాత్సల్యాల నావిష్కరించ కూడదా! (ఏన్నాళ్లీశృంగారం అని కొంచెం క్రొత్తదారి పట్టాడని పిస్తుంది.) గ్రంథాల్లో రూఢిని బట్టి కూడదు అయన పంచసాయకాల్లో అందుకు పనికివచ్చే బాణాల్లేవృగదా। అంటే శ్రీ సత్యనారాయణగారూరుకుంటాడా? శృంగార రసాధి దేవత శ్రీవిష్ణువు. అయనకొడుకా శృంగారాన్ని ప్రేరేపిస్తే బోళాశంకరుడు, భక్తవశంకరుడూ అయిన శివుడి మనసునుండి భక్తివాత్సల్యాలని ప్రేరేపించే వాడ్ని నేను సృష్టిస్తానంటాడు. ఆయన అంతటి వాడే సందేహంలెదు. సహృదయులకొక్కనీ అయనకేం నెప్పు! ※

తుమ్మిపూవు శివప్రీతికరమైన పూజాపుష్పం. పూజ భక్తి ఉండి గదా చేస్తారు. కాబట్టి శ్రీ సత్యనారాయ గారి కుసుమబునుడు భక్తి విధాయకంగా తుమ్మిపూవు బాణమే వదులుతాడు. అది శ్రీరామ ఆత్మలో భక్త వాత్యల్యాన్ని ప్రేరేపిస్తుంది దానివలన ఆ దేవుడులో భక్తుడికి దర్శనం ఇవ్వాలనే కోరిక మొదలౌతుంది. సరిగ్గా అదే చూచుకొర్కె తారాడటంగా కందపద్యంలో ఉంది. అలాంటి కోరిక పుట్టించే బాణం పంచబాణుని పంచసాయకాల్లో ఉంది. అదే అరవిందం తెలితమ్మి ప్రయోగించి నవ్వుడు భక్తిపురస్సరమైన తుమ్మిపూతూపే (భక్తదర్శన) కాంక్ష కలిగించె ఉన్మద బాణం తెలితమ్మితూపుగా అయింది.

ఇపుడా కుసుమ బాణుని వేషం-ముఖ్యంగా రెండు విషయాల ప్రస్తావనఉంది.

1. మెతలో తులసి పూసలపేరు. మన కథాసందర్భంగా భక్తికి ప్రసన్నుడు కావలసిన వాడు శ్రీమహావిష్ణువుయొక్క అర్ధాంశావతారమైన

శ్రీరామ అత్మ. ఆయన ప్రీతికి ఆయన ధరించే తులసిపేరు ధరింపజేసి ఉండవచ్చు. ఇలా ఏదేవుడి ప్రసన్నత కాదేవుడికి ప్రీతికరమైన మాల్యాం బరాలు ధరించాడనటం అంతసమంజసం కాదేమో అయితే భక్తిని ప్రే రేపించే తనమనోజునకు శివుడు తన ఇష్టదైవ ప్రీతికరమైన మాల్యాంబరా లు ధరింపజేయవచ్చుగదా!

2. మెత్తని విభూతిపూత. శివుడు తనమనసిజునికి ఇష్టదైవ ప్రీతికరమని మాల్యాలతోపాటుగా తిరునామం కూడా పెట్టించేస్తే అతడు తనకు చెందిన వాడని గుర్తుఎలా! తానై స్వయంభక్తుడైయుండి కూడా వినియోగించని నామం తన మనోజుడి కెందుకు పెడతాడు! కాబట్టి మెత్తని విభుతిపూతనే నమోదు చేసాడు.

ఈ విషయాలను బట్టి భక్తివాత్సల్యాలను ప్రేరేపించే శివకుమార మన్మథుడొకడున్నాడనిపిస్తాడు. అలా ఉన్నాడనటానికి మనకే పురాణంలో అన్నాప్రమాణం ఉందా అంటే నేచెప్పగలిగింది ఒక్కటే. శ్రీ విశ్వనాథ కృత శ్రీమద్రామాయణ కల్పవృక్షపురాణం ఉందనేదే అది. దానికైనా ఒక ఉపపత్తికావాలిమరి. ఒక్కసారి మనం ప్రారంభంలో ప్రస్తావించి ఉన్న అయన కల్పవృక్ష రహస్యాల వాక్యాలు మళ్లీ స్మరించి సరిచూసు కోవలసి ఉంటుంది

"ఒకప్రౌఢుఁడైన కవిశబ్దములు భాషలోనే యుండును, గాని యా కవి తనయొక్క ఆత్మ ద్రవ్యమున కనుకూలమైన శబ్దములను తెచ్చికొని ప్రోవు పెట్టును. (అవి తులసిపేరు, మెత్తనివిభూతి, తియ్యవిల్లు కుసుమబాణుండు, సదలురేకులు, తుమ్మిపూవు, విరహజడుఁడు, తెలితమ్మిపూవుబాణము, కోర్కెతారాడు) వానియందొక వైలక్షణ్యముండును. (సామాన్యలక్షణాలు వాటికి నప్పవన్నమాట) అందఱికి తెలియదు. (మనం తేల్చుకుంటున్నాం) శబ్దముల కూర్పుచేత నొకయేదోధ్వని యుదయించును. ఈ ధ్వని కావ్యధ్వని కాదు. మహాకవి యక్కడ నున్నాఁడు.

దానిని గ్రహించుటకు శబ్దబ్రహ్మ సాక్షాత్కరింప వలయును." కడపటి వాక్యం అలాఉంచితే కావ్యధ్వనికాని ఆయేదోధ్వని తెలియాలంటే అక్కడ ఉన్న మహాకవిని పట్టుకోవాలన్నమాట; సరే చూద్దాం.

అయితే మనం ఇందాక అనుకొన్నట్లు ఈ కుసుమబాణుడు శివ మానస పుత్రుడేనా! ధరించిన తులసిపేరూ మెత్తని విభూతీ తుమ్మిపువు బాణం మొలికీ, తగిలినప్పుడు తెలితమ్మిపూవైన వింతా-వివరాలిప్పటికే ఆ అభిప్రాయాన్ని బలపరుస్తున్నట్లు గ్రహించే ఉన్నాం. తక్కిన విల్లు మాట ఇప్పుడు చూద్దాం.

తియ్యవిల్లు మామూలు రూఢ్యర్థం చెరుకువిల్లనే. వైలక్షణ్యాం గమనిస్తే తియ్యము మాటకి 1. ప్రియవచనము, సాంత్వనము. 2. ప్రియము అని శబ్ద రత్నాకరం ఇచ్చింది. అందులో 2వది గ్రహిస్తే ప్రియము సాధించే ధనస్సు, ప్రియధనుస్సు. భక్తభగవంతులందు, ప్రపత్తి ప్రసన్నతల ప్రియం కలిగించే సాధనం. ఇది విష్ణుమానసపుత్రుడైన మన్మథుని వింటి కన్నకొంచెంభిన్నమైంది. శృంగార రసావిష్కరణ ఆరసాధి దైవం విష్ణుపుత్రుని సాధన. అందుకనువైంది చెఱకువిల్లు ఈ భిన్నమైంది ఏగడతోచేసిందో గానీ (కన్న తండ్రి) భక్తవాత్సల్యాతిమధురమయిన కోదండం ధరించిన వాడు శివమానస పుత్రుడనటం సమంజసం.

పోతే వదలిన బాణం సడలురేకుల దనటం (చక్కగా విచ్చుకొన్న పూవుగా వైలక్షణ్య భావం కావచ్చు తుమ్మిని అచ్చుతప్పుగా భావించి దిద్దివేసే వారికోసం, అవటానికి అరవిందబాణమే కాని దానికి సహజమైన శృంగారం యొక్క ప్రాధాన్యం సడలించే రేకుల దనిభావంగా స్వీకరిపెట్టాడు అది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి ముందుచూపు. మన కోసం కాదు. దాని కొసం ఆయన ప్రథమోద్దేశాన్ని గుర్తింపజేసే శివప్రీతి కర పుష్పం తుమ్మి పూవుని మార్చుకోవలసిన పరిస్థితిలో పడలేదు మనం.

అదిగోనండి! మహాకవి అక్కడున్నాడు. అయితే ఆయన స్వ

యంగా కావ్యధ్వని కాదన్న ఇంకో ఏదోధ్వని ఏమిటి! అది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ సహజ పరిహాస శీలం (అక్కడ మహాకవి ఉన్నాడంటే ఆయన తత్త్వం అన్నమాట.) శృంగారరసాధిదైవమానస పుత్రునెగసన ద్రోసి పరమ శివుని అర్ధనారీశ్వరుని చేసిన కథకు ప్రతిగ భక్తవరప్రదాత మానస పుత్రుని సృష్టించి శృంగార (విరహం అంటే విప్రలంభ శృంగార మే) జడుడైన విష్ణుస్వయమర్థాంశావతారమయిన శ్రీరామ ఆత్మ భక్తవ శంకరునిగా మార్చిన కథకు ప్రాణప్రతిష్ఠజేసి అది గుర్తించలేని వాళ్లని శ్రీ విశ్వనాథ తనపై వాక్యాల వెక్కిరించటమే ఆ పరిహాసశీలం. సరె. ఇదివర కోసారి ఆయన "నీకు శబ్దబ్రహ్మ సాక్షాత్కారం లేదుపో" అంటాడనుకొ న్నాం. మరి ఇప్పుడేమంటాడాయన!....ఎవ్వరమూ చెప్పలేం. ఒప్పుకుం టాడు మన వివరణ అంటే సందేహమే తరగతిలో పరీక్షతప్పితే ఇంటికి పో అన్నంత తేలిక కాదుగా ఉత్తీర్ణుడైతే ఉన్నత తరగతిలో చేర్చుకోవటం ఎన్ని పరిగణనలూ-అన్నీకాక ఇంకా ప్రవేశ పరీక్షలుకూడా వచ్చిపడ్డాయే! మన ప్రవేశపరీక్ష వేరుగా ఒక అనుబంధంలో వ్రాస్తాను. సరే. ఇంతకీ ఈ శివమానసపుత్ర మన్మథుడికోసమా శ్రీ సత్యనారాయణగారి ఆవాక్యాల ధిష ణాహంకారం అంతాను! ఇలాగే బ్రహ్మకి ఒకడూ ఇంద్రుడికి కొకడూ చొప్పున మానసపుత్ర మన్మథులను ఇలాంటి వాళ్లు సృష్టిస్తోంటే సహృ దయులకు మతులుపోవా? ❋

ఒక్కసారి ఈ రెండు పద్యాలసారం-శివుని శ్రీరామమంత్ర ప్రీతి కి ప్రతీకగా తులసి పేరొకటి మెడలో వేసికొని ఆశివ సంబంధీకుడని తెలి యజేయు రూప ప్రతీకగా మెత్తని విభూతి దాల్చి శివమనసిజ కుసుమ బాణుడు దైవభక్త పరస్పర ప్రియహిత ప్రతీక అయిన తియ్యవిల్లు నందు శివ ప్రీతికరమైన పూజా పుష్పంగా భక్తికి ప్రతీక అయిన తుమ్మిపూవు బాణం ములికి సమర్చి బాణాన్ని త్రాడుకి తగిలించి శృంగార రసాధిదైవ అర్థాంశావతార శ్రీరామ ఆత్మ సీతావిరహ లేదా విప్రలంభ శృంగార జడు ని మిదకు లాగి విసిరాడు. ఆది భక్తపరతంత్రా కాంక్షను ప్రేరేపించే

నూతన అనుభవానికి నాంది పలికే ఉన్మద-తెలితమ్మి పూబాణం వలె అయి శ్రీరామ ఆత్మ హృదయంలో తగిలి భక్తపరతంత్ర భావకల్పన ప్రతీకగా శబరిని చూడాలనే కోరిక శ్రీరాను ఆత్మ మదిలో తారాడిందని స్వయంగా ఆయన లక్ష్మణసాక్షితో చెప్పాడు. సరిపోయిందికదూ! ఇలాగే ఇకముందుకూడా అమలినార్థ యుక్తిచేతనే శబరీ శ్రీరాముల అంతర్యాల ను మనం గ్రహించవలసి ఉంటుంది.

---

బహుశః శ్రీ సత్యనారాయణ గారికి క్రీడాభిరామంలోని ఈక్రింది 212వ పద్యం ఈ బుద్ధి పుట్టించి ఉండవచ్చు.

సీ. జవరాలిఁబొడఁగన్న-సన్న్యాసిపైనేయుఁ
దులసిలేఁజిగురాకుఁ-దూపు మరుఁడు
వేదవిప్రునిఁగన్న-విధవపైఝళిపించు
దర్భపల్లవహేతి-దర్పకుండు
కటకారకులకన్యఁ-గనినహాళికుమీఁదఁ
బొడుచుఁ బూముని కోలఁ-బుష్పశరుఁడు
నాడింథమునిఁగన్న-నాతిపై నేయును
నలరుఁ జిచ్చరకోల-నంగభవుఁడు
తే. బెరసి వెన్నెల కాయంగ-బేరకమ్మ
పులినతలముల నాయాయి-కొలములెఱిఁగి
తాల్చుశస్త్రాస్త్రములుజార-దంపతులకు
నసమబాణుండు తిరుణాళ్ల-నన్నినాళ్లు

ఏదో హాస్యానికన్న మాటపట్టుకొని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ఎంతపని చేసాడో చూడండి.



# కల్పవృక్షంలో శబరి-శ్రీరాముడు
# 3

'శబరీ శ్రీరామమ్' ఏకాంకిక-పంపాసరోవరం పడమటి గట్టున రాఘవులిద్దరూ ఉత్తరీయాలు కప్పుకొని ఊగి నడుస్తుంటే నూతన పాత్ర ప్రవేశాని కనువుగా హంసి రెక్కల జాడింపున ఓ క్రొత్తగాలితెర రావటం అనే వాతావరణం సమకూర్చ బడింది. అప్పుడే ఎక్కడ దాగిఉన్నాడో తెలియదుగాని శివ మనసిజుడు ఎక్కుపెట్టి విడిచిన బాణంవచ్చి శ్రీరామ ఆత్మపాత్ర గుండెల్లో పడి ఆయనకు శబరియెడ దర్శన కాంక్ష కలిగించి నట్లు ఆ పాత్ర స్వయంగా లక్ష్మణసాక్షి పాత్రకు తెలియజేసాడు.

మనం కాస్త సావధానంగా పరికిస్తే, అదిగో రంగం మీదకి శబరి పాత్ర ప్రవేశిస్తోంది. కొన్నిరకాల పూలూ కొన్నిరకాల పళ్లూ విడివిడిగా మెట్ట పళ్లికలో సామాజికులకూడా అవి దర్శనీయం అయేటట్లు ఉంచు కొని ఆ పళ్లిక నెత్తిని పెట్టుకొని వస్తోంది శబరి. సూత్రధారుడు శ్రీ విశ్వ నాథ సత్యనారాయణ గారు ఆమె ఎలాఉందో వివరించాడు. చిట్ట చివరి దాకా ఎండిపోయిన చెట్టు కొమ్మ చివరమాత్రం (జీవనవృక్షం వయోజీర్ణమై సత్కార సత్ఫలాలు కడకు మిగులపూచి కాచిన స్ఫూర్తి) పూలూ కాయలం తో ఉన్నట్లు ఉపమానం చెప్పాడు.

ఈసీసం శ్రీ విశ్వనాథ వారిదే అయినా మెచ్చదగినట్లు లేదనక తప్పదు. చెట్టుకొమ్మ అనేటప్పటికి పలవలున్నా యన్నట్లే లెక్క. కనుక ఆ చెట్టుకి మొదలూ, కనీసం ఇంకొక్కటైనా కొమ్మా, ప్రకటితం కావాలి. పాపం శ్రీ సత్యనారాయణ గారీ పళ్లిక నెత్తికెత్తి దెబ్బతిన్నాడు. ఒకటి చెప్పాలనుకొని మరొకటి చెప్పాడన్నది ఇక్కడ స్పష్టం. గమనించండి.

శబరి పూలూ పళ్లూ ఉన్న పళ్లిక ఒక చేతపైకి పట్టుకున్నట్లుంద ను కోండి. అప్పుడామె శరీరం చెట్టుమొదలుగా, రెండోచేయి మరో కొమ్మగా అనిపించి, అవికూడా ఎండి పోయినవిగా తలపిస్తుంటే పళ్లిక పట్టుకొన్న హస్తశాఖ చివర మాత్రం పుష్పించినట్లెంచటం సాధ్యమ య్యేది. అసలా దృశ్యమే మొదట మెదడులో మెదలిరాసేటప్పుడు ఆ అంతర్దృశ్యమదృశ్యమై వ్రాస్తున్న చెయ్యి ఆపళ్లిక నుకాస్తా నెత్తి కెత్తేసింది.

నేను సరిగా అర్థం జేసుకో లేకపోయా ననుకుంటే ఇదిగో పద్యం క్రింద వ్రాస్తున్నాను మీరు చదివి సరిగా గ్రహించండి.

సీ. కడుపులో మెఱుపులు--గలపరించిన నీట
మొయిలు వెల్గులు వోని-పూలుకొన్ని
బంగారమును రాగి-పాళ్లుగాఁ గరగించు
వన్నెయై యున్నట్టి-పండ్లుకొన్ని
కొన్నిపూవులు లేఁత-జన్నియ యావుపాదుగు
వలె గర్భమంథరో-జ్జ్వల మధువులు
కొన్ని పండ్లు రసాను-కూలవాంఛాపరీ
పాకముగ్ధాకార-వర్తులములు

గీ. విడివిడిగ మెట్టపళ్లికఁ-జేర్చి శిరసు
పైన నిడికొని మెల్లఁగా-వచ్చెశబరి
తుట్ట తుదదాఁకనెండిన-చెట్టుకొమ్మ
శేఖరంబున యందుఁబు-ష్పించినట్లు 334

అలావచ్చిన శబరి ఎదురుగుండా నిలబడిపోయింది శ్రీరామ ఆత్మ పాత్ర ఆమె కన్నుల్లో తన ప్రతిబింబం చూసుకొని (అంతవరకూ భార్యా విరహ వ్యథతోనున్నవాడల్లా) 'విరహబాధ యెల్లను విడిచేనట అప్పుడే కంటి నిరార శబరి కనులు తేరుకొనియె' నట,

అలా సీతవిరహం వదిలిపెట్టేసినందుకు శ్రీరామ ఆత్మ ఆధిదైవిక తత్త్వమైన ఆత్మగా నటించాలి న్యాయంగా. కానీ శ్రీ సత్యనారాయణ గారలా బయటపడనీయడని మనం ముందే అనుకొన్నాం. అయినా అటు వంటి అవగాహన మనం కుదుర్చుకొనే ఉన్నాం. కనుక అట్టే ఇబ్బందిలే దు. అలా మన అవగాహనకు రావలసినవాళ్లు ఇంక మతంగ మహర్షి (హంస ఆయన కేమయినా కుదురుతుందేమో అనుకొన్నా అది చాలదు.)

శబరీ మిగిలారు. ఇప్పుడు పాత్రప్రవేశం అయింది గనుక ముందుగా శబరిని గూర్చిన అవగాహన

"ఉన్మీలిత నిమీలిత మధ్యస్థ జీవపరమాత్మనో జీవాత్మా క్షేత్రజ్ఞ ఇతి విజ్ఞాయతే" (యజుర్వేదీయ శారీరకొపనిషత్.) కనులు మూసుకుంటే పరమాత్మ, కనులు తెరిస్తే జీవుడూ. ఈ రెండింటినడుమా పరిణామ పరంగా ఉన్న జీవాత్మ క్షేత్రజ్ఞుడు అని తెలియవచ్చును. ఇక్కడ జీవాత్మ సమాసం పట్టుకొని కొందరు మొదటి మాటకు ప్రాధాన్యం ఇచ్చిజీవుడే క్షేత్రజ్ఞుడనీ, ఆక్షేత్రజ్ఞజీవుడే శివుడని కొందరూ విష్ణువు అనికొందరూ ప్రాధాన్యం తమ ఇష్టదైవానికి కల్పిస్తూండగా ఇంకాకొందరు క్షేత్రజ్ఞుడంటే ఆ పరమాత్మే అంటూంటారు. మన పూర్వకావ్యవేదాంత గ్రంథాలలోనే ఈ తికమక ఉంది. అసలు క్షేత్రజ్ఞుడు జీవుడూకాడు పరమాత్మ అంతకంటే కాడు. (భగవద్గీత 13 అధ్యాయం క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగం చదివినా మనకిది స్పష్టం కాదు. క్షేత్రజ్ఞుడు ఉభయోర్మధ్యస్థ ఉభయలక్షణయుక్త పరిణామ సిద్ధ రూప జీవ + ఆత్మ - జీవాత్మ, మరొకడు అని శారీరక ఉపనిషత్తు విడమర్చి యిచ్చిన విభాగం. (ఇది స్థూలవిభాగం మాత్రమే. సూక్ష్మ విభాగం ఇంకా వేరేఉంది.) ఆ క్షేత్రజ్ఞ స్థాయిలోదే శబరి. అందుకే శ్రీ రామ ఆత్మపాత్ర శబరి తెరిచి ఉన్న కన్నుల్లో తన ప్రతిబింబం చూచుకొన్న నెపాన జీవ (సీత) ని దర్శించుకొని ఆ సీతా విరహాన్ని పూర్తిగా వదలివేయ గలిగాడు. తాను ఆత్మగా అధిదైవిక మూర్తిగా నిలబడి పోయాడు శ్రీ సత్యనారాయణగారా విషయం అడుగడుగునా తలపింపజేసినా ఆ పాత్రను మాత్రం ఆతత్త్వాన్ని పూర్తిగా ప్రదర్శించనీయడు) అలాగే శబరి ఆనంద బాష్పాల తెరల్లో (కనులు మూసీమూయని స్థితిగా క్షేత్రజ్ఞ భావం) పొరల మాటున ఆయనలో (తాను అతి సామీప్యవశం చేత జీవత్వం పొంది) ఆత్మనే చూసి తృప్తిపడి తేరుకొని శ్రీరామ ఆత్మకు పూజాదికాలు (ముందు మరచి పోయినా క్రమంగా) నిర్వహిస్తుంది. (అందుకే శ్రీరామ ఆత్మపాత్ర తాను కబంధుని వల్ల విని ఉండీ, ఎదుట చూస్తూ

నే ఉండీ కూడా 'అవ్వా ఎవ్వరే నీవు' (358వ పద్యంలో) అని అడుగు తాడు ముచ్చటగా. శ్రీరామ ఆత్మ పాత్రయెడ ఆమె భావన అంతా ఆత్మ పరమే.) శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ఈ జీవ-ఆత్మ దర్శనాలు రెండూ శబరీ కనుల పటం (Draving Sheet ) మీదే చిత్రించటం గమ నిస్తే శబరి పాత్ర క్షేత్రజ్ఞుడనడంలో సందేహించ వలసిందేమీ ఉండదు. అలా శబరి వచ్చి కొద్దిసేపలాగే నిలబడిపోయి తర్వాత తన తలమీదిపూల పళ్లిక దించు కోకుండానే (క్షేత్రజ్ఞ పరిజ్ఞానంతో) అడుగుతోంది. మీ అయో ధ్యానగర వీథులో నిన్ను నేనిక్కడచూస్తున్నట్లు (అసలాయన వస్తూన్నట్లు కబురు పెట్టకుండానే పూర్వాను బంధాలేవీ లేకుండానే స్వయంగా తెలు సుకొని నిరీక్షించి వచ్చి) చూసే వాళ్లు లేరా (అలావెఱ్ఱిగా చూస్తున్నావు! మరి నువ్వలా ఒక ఆడదాని కళ్లల్లోకి నడివీథిలో నిలబడి చూస్తుంటే మీ నగరంలో నిన్నదలించకుండా, నాలా నిలచి ఉంటారా!) అంది. (ఇది గో ఇప్పుడు శ్రీ విశ్వనాథ వారు శ్రీరామ ఆత్మని కవిగా- అదే సూత్రధారు డుగా తనే ముందు ప్రాణేశుడుగా ఒక అనుబంధం ప్రకటిస్తున్నాడు. ఏమంటే శ్రీరామఆత్మ ఆమెకనులనుండి క్షేత్రజ్ఞుడు-అంటేజీవ+ఆత్మలో ఉత్తరపదం లోని ఆత్మను తానాకర్షించుకొని మిగిలిన జీవుడు-అంటే జానకిని తాను శబరిలో కనుగొని భర్త అయ్యాడన్నమాట. ఈ సూచనవల్ల కొంతవరకీభార్యాభర్తలఅనుబంధపర్యాయశబ్దాలజరగబోతున్నసంభావనల్లో శ్రీరామఆత్మఆధిదైవికస్ఫూర్తినీ అవగాహనకందిస్తున్నాడాయన, ధన్యులం.

ఆవిడలా అడిగితే శ్రీరామఆత్మ పాత్ర (ఆధి దైవికభావంలో) ఉవ్వెత్తున నవ్వులలో నీవంటివారు కలరు+ఆపూబల్లిక దింపుకో అనీ, కలరా+పూబల్లిక దింపుకో అనీ కలసి వచ్చేట్టు వ్రాసారు శ్రీ విశ్వనాథ. మరి రంగస్థలంమీద ఆ పాత్ర నవ్వుతూ మాట్లాడ్డంలో ఆదేమైందో చూ ద్దాంగాని ప్రస్తుతాని కాదేముడు ఆత్మగా ఆ క్షేత్రజ్ఞుడికి కర్తవ్యం మాత్రం గుర్తుచేసాడు. (అయోధ్యా పురవీథులో ఆయనకు అపరిచితు లెలా ఎదు రౌతారు! మహారాజపుత్రుడాయె తాను. కొత్తవాళ్లలా అమాంతంగా వస్తే రాజనీతి వాళ్లను పరదేశ గూఢచారు లనుకొని బంధిస్తుంది. కనుక) ఆ

పాత్ర మాట కలరా! నవ్వులో కాకువునబడి ఉండరన్న భావం వ్యక్తం చెయ్యటం జరిగింది.

దానికావిడ "మఱచితిన్ స్వామి!" అంది. క్షేత్రజ్ఞుడికి మరుపా ఔను. అది సహజం. సంత్రుక వాసికూడా లేని తేడాలో జీవుడుగా ఇటు మ్రొగ్గాలా ఆత్మగా అటుమొగ్గాలా అన్న తారట్లాటలో తడబాట్లు సహజం గదా! అదో మరపులో (ప్రతిక్షేపించాడు శ్రీ విశ్వనాథ.) అలా అంటూనే పళ్లిక దింపుకొని అందులో అన్నీ సరిచూసుకొంటూ పూలివి సరే–మరి తెచ్చిన తేనెలెవ్వి? ఎక్కడపెట్లాను! అనుకుంటూ వెలుగు నవ్వింది (తేవటం సహజ లక్షణంగా మరచిపోయింది) అప్పుడు స్వామి (ప్రాణేశకు పర్యాయ పదమే) కొన్ని పూలు తీసుకొని తనపాదాలమీద చల్లుకొన్నాడు. ఇదేమి విచిత్రం!

అది ఆ పాత్ర పరిహాసశీలం. (అధి దైవక మూర్తిగా ఆయనకది సహజం గుర్తిస్తే సృష్టి ఆయనకో లీలగదా! ఆలీలను చూసి కర్తగా ముచ్చట పడటానికే ఈ పరిహాసశీలం ప్రతీక.) అయితే ఆయన చేసిన పనికేమీ అర్థంలేదా! అయ్యో తేకేమీ! మా అయోధ్యానగరంలో నా గూర్చి నిరీక్షించి తీరా ఎదురైయ్యాక నీలా ఇలామైమరపుతో కర్తవ్యం మరచిపోరు నీవో- పళ్లిక దింపుకోవు (వాచ్యం) తేనె లెక్కడ ఉంచావో తెలియదు. (నవ్వున ఉవ్వెత్తుగా వేళాకోళం) పాదపూజచేయవు (చర్య) అని పలుకు లోనవ్వులో నటనలో సూచింపజెయ్యటం గొప్ప నాటకశిల్పం. రంగస్థలం మీద చూడటానికి ఉత్కంఠ కలిగిస్తుంది. (దర్శకుడు మందబుద్ధి అయితే మాత్రం ఇలా ఒకపనలసిఉంటుందని సూత్రధారుడు శ్రీ సత్యనారాయణ గారు ఏ మాత్రం జ్ఞప్తి కల్పించడు.)

మరో విశేషం ఉంది. క్షేత్రజ్ఞునిలో (జీవ + ఆత్మ) ఉత్తరభాగం ఆత్మను ప్రత్యక్షసాన్నిహిత్యం చేత తానా కర్షించుకొంటే ఆక్షేత్రజ్ఞుని లోని కింకర్తవ్యతాసందేహం మానీ ఆత్మ వైపు మ్రొగ్గనక్కర్లేదని తెలిసి జీవుడుగా నిలుకడపొంది శ్రీరామ ఆత్మపరిచర్యల శబరి శ్రద్ధవహింపగలదు.

అలాంటి ఆకర్షణకే పళ్లికలో చేయిపెట్టి పూలు గ్రహించి వినియోగించు కోవటం. పైగా అది క్షేత్రజ్ఞునిలోనుండి క్రొత్తగా తనలో ప్రవేశించిన ఆత్మ విభాగోపశాంతి కూడా ఔతుంది, ఆ ఉత్తమ కావ్యధ్వని పురస్సరంగానే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి విచిత్ర సంఘటనను కల్పించారు. ఇప్పు డా ఆటవెలదిని గ్రహించండి.

ఆ. వె. పూలతట్టదించి - పూలివి వెలుగుల
నవ్వి తేనెలేవి - యెచట ననఁగ
పూలుచూచి స్వామి - మునువ్రేళ్ళ గైకొంచు
చరణయుగమునందుఁ - జల్లుకొనియె

పద్యం రెండవపాదంలో యతిలేకుండాచేసి శబరికి అప్పుడు మతిలేకుండా పోయిందని సూచించాడు శ్రీ విశ్వనాథ, ఇన్నిరకాల బలపడిన శబరిలక్షణం క్షేత్రజ్ఞుడిదే. తథ్యం,

శ్రీరామ ఆత్మ ప్రవర్తనతో శబరి (జీవ+ఆత్మలో ఆత్మను ఆ అధి దైవికమూర్తికి కోల్పోయి జీవుడు మాత్రంగా మిగిలి) చకతురాలై అయ్యో స్వామీ! అంటూ దోసిళ్ళతో పూలుగొని శ్రీరామ ఆత్మపాదాలమీద చల్లింది. ఆమె కళ్ళల్లో నదీత్రయం (గంగా యమునా సరస్వతీ) రెండు వాగులు (శబరీ గౌతమీ) గా అయి తాను తెచ్చిన పండ్లలో మరీ రుచిగల వాటిని చూపిస్తూ కమలాక్షా, వీటిని నీ కోసమని తెచ్చానంది,

ఇక్కడ శబరి స్వామీ అంటూ ప్రాణేశ్వరునిగా శ్రీరామ ఆత్మను తొలిసంభావన చేసింది. ఆమె జీవ విభావంగా జ్ఞాతృస్థానానికి చేరి వెంటనే జ్ఞేయమందు సహజంగా స్వయం (ఆత్మనెలాగు) సమర్పితగ గుర్తుగొని ఆయన్నలా సంభావించింది. కనుక భౌతిక శృంగార మావిన్యానిలికిది చాలాచాలా దూరం, ఇంక మనం కూడా అలాంటిది మాట వరుసకైనా తలపుకు రానీయవద్దు. ఇప్పటికే ఒకటికింకోసారిగా సద్విషయక స్థిరమైన అభిప్రాయం కుదుర్చుకొన్నాం గనుక అది అలాగే గ్రహిస్తూపోదాం.

సరే శబరి పాత్ర తాను మరపునబడ్డ సంగతి స్వయంగా ఒప్పుకొని క్షమాపణ కోరుతోంది. చదవండి

శా. ఆకాశంబు సముద్రమున్వనములా - హా! చూచినట్లుండెనీ
యాకారంబది; విస్మృతింబడితిన-య్యా! పూవులంజల్లఁగా
నాకింతప్పటినుండి గాగమునిసం-తానంబునందున్ సప
ర్యా కృష్టామతి సాజమీదృశముగా-నైతిన్ క్షమింపంగదే, 338.

ఈపద్యం చివరిపాదంలో "ర్యాకృష్టా" అన్న కాదు, అచ్చులోనున్నది 'ర్యానిష్టా' అని ఉంది, అలాగే ఉండాలని నా అభిప్రాయం కూడా, కానీ ప్రాసతొలగినట్లవుతుంది. అలా తొలగించడము విస్మృతికి సూచనగా కవి భావమే అన్న నా విశ్వాసం. 337 ఆటవెలది రెండోపాదంలో ఆ విషయంగా ప్రకటించేయున్నాను. అక్కడి యతి ఇక్కడి ప్రాస, రెండు తొలగింపులూ శ్రీ విశ్వనాథవారి శిల్ప విశేషమేకాని దోషాలు కావు. ఇక తాత్పర్యం చూద్దాం,

చిన్నప్పటినుంచీకూడా నేను ముని సముదాయానికి సపర్యలుచేస్తూ ఉన్నదాన్నే, ఆ మర్యాదలన్నీ సహజంగా తెలిసిందాన్నే, ఏమిటో ఇలా మందమతినైపోయి నీ పాదాల పూలు చల్లటం మరిచిపోయాను, అసలు నీ ఆకారం చూసేటప్పటికి ఏదో ఆకాశమూ సముద్రమూ వనాలూ అంతా ప్రకృతిమయంగా తోచిందేగాని నా కసలు కరచరణాద్యవయవాల నిన్ను చూచినట్లు లేదయ్యా! క్షమించు అంది. అంటే ఆమెకు శ్రీరామ ఆత్మ విశ్వవాప్తిగా తోచిందన్నమాట. ఆ పరిసరమే ఆమె విశ్వం. అందుకన్న అలా ప్రకృతి రూపంగా కనపడింది. మరోచోటనీనామం (వేదాల్లోని మాట) శబ్ద బ్రహ్మపరం అయి అందుండి పరబ్రహ్మ పరం అయిన నీ రూపం తేలిగ్గానే గుర్తించానంది. చదవండి.

మ, అలవేదంబులల్లోని మాట యొకఁడ-య్యాచెట్టునంజెట్టునం
జిలుకల్నేర్చినదమ్మహర్షియుపదే- శించెన్సమస్తాటవీ
స్థలమందల్ల జపాక్షరోద్గత పవిత్ర స్వాదువౌ మూర్తియే
తెలియంజేసెను నిన్ను నా కదియయే తేరన్ భవన్మూర్తియే 361

మా గురువుగారు వేదాల్లోమాట తారక ఓంకార శబ్దం చెట్టుపెట్టుగా చిలుక చిలుకా కూడా పలికేటట్లు నేర్పారు అవి యీ మతంగవనం అంతటా జపిస్తుంటే ఆనాదం క్రమక్రమంగా బలపడి ప్రకృతి అంతటా సాంద్రమై కమనీయ మృదువైన రూపంగా తోస్తూఉంటుందిక్కడ. ఆ మృదురూపం గుర్తున నువ్విలా వస్తుంటే నువ్వేనని తెలియజేసింది అన్నది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు నామజప ప్రయోజనం శబరి నోటి వెంట వివరింపజేసాడు. ఆ జపాకృతి లేదా తత్జ్ఞానం శబ్దబ్రహ్మం అయితే దాని జ్ఞేయం పరబ్రహ్మరూపం దాని వెంట తెలియబడటంగా పరిణమిస్తుంది. అదే శ్రీరామ ఆత్మ రాకగా శబరి గుర్తించింది.

ద్వేబ్రహ్మణీహి మంతవ్యే శబ్దబ్రహ్మ పరంచ యత్,
శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మధిగచ్ఛతి॥

అని అథర్వణీయ త్రిపురాతాపిన్యుపనిషత్. నెలకొల్పిన సత్యాన్ని స్వయంగా అనుభవంలో ప్రత్యక్షీకరించు కొన్న అదృష్టవంతురాలు శబరి. ఒక్కసారి స్వామి శివానంద (హృషీకేశ్) నాదతరంగాలను బట్టి చిత్ర రూపాన్నావిష్కరించే యంత్ర విషయం ప్రస్తావించి భారతీయ 'భైరవి' రాగాలాపన మాత్రానికే సుస్పష్ట శ్వాన (కుక్క) చిత్రం ఏర్పడిన విషయం చెప్పి పవిత్రమైన ప్రార్థనా మందిరంలో తలుపులు వేసుకొని చక్కగా నామం చేస్తే ఆనామతరంగాలకే నామోద్దిష్టదైవం రూపుకట్టి కనిపిస్తుందని వివరించారు. దానికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి ఈ పద్యం ప్రతిబింబంలా ఉంది. సత్యం యొక్క బలం అలాంటిది. ఇందులోని వేదాలలో మాట మొదట్లో మన లక్ష్మణసాక్షి ప్రస్తావించే ఉన్నాడు. (329 పద్యం)

శబరి తన మతిమరపుకి క్షమాపణ చెప్పుకొని ఇవిగో ఈ పళ్లునీకోసం తెచ్చానందిగదా! అందుకా శ్రీరామ ఆత్మసాత్ర

గీ. రాముఁడ నియె నట్టడవిలో-రామరామ
నన్ను నిలబెట్టి యివితను-మన్ననెట్లు
కాళ్ళు కడిగి కోవలయును-కనులు తుడిచి
కోను వలయుస్నానము చేయ-గాను వలయు. 340

అని పరిహాసశీలి ఇంకా

శా. కాదీపాటునని భుజింపు యనినన్-గాదందునే నేనమ
ర్యాదం జేయుట నీకునేల....యన...."గా అందుకామె" ధర్మ
స్పష్టదృక్పక్షమై
యీదేశంబునఁ జెట్టుచెట్టుగృహమే-యీనాకు నీకేమొస్నా
నాదుల్నిత్య పవిత్ర మూర్తి కిని మ-ర్యాదామహాంభోధికన్ 341

అంది. శ్రీ సత్యనారాయణ గారు శబరి వెంట నీళ్ల ప్రస్తావన తేవటమా మానడు. వాని వినియోగించి నట్లు చెప్పనూ చెప్పడు ఎందు కని? వెనుక40పుటలో హంసి జలపక్షే అయినా ఈయన గట్టెంకించారేమి-వీలు దొరకిన చోట పట్టుకుందాం అనుకొన్న మాటే ఇక్కడాను. గుర్తుంచు కోవాలి.

కాళ్ళు కడుక్కోవాలి... స్నానం చెయ్యాలి అంటాడాయన. నిత్య పవిత్రమూర్తివి నీకు స్నానం ఏమిటి అంటుందావిడ. సరే నువ్వలా గే తినమనే టటయితే అలాగే తింటాను నీకెందు కమర్యాదమాట అంటా డాయన... ఇదేమిటి! పాద్యాదులు తేకున్న మర్యాదల్లోపం శబరిదాయె. అంటే ఆమె తనకు జేసిన అమర్యాదను పరిగణించనులే ఉన్న పళం గానే పళ్లు తినటం అందుకు సాక్ష్యం అని భావం అన్నమాట. (ఆమె తినమంటే కాదనటం అమర్యాద ఔతుందనీ ఆ పాత్రభావం) "ఆ మాట నెత్తి శబరి మర్యాదలన్నింటికి సముద్రం లాంటివాడివి గదయ్యా అనీ స ముద్రానికి హద్దెమిటయ్యా అనీ కుదిరే సమాధానం చెప్పింది.

మరి ఆయస శంకచేస్తాడా? ఏమో! (తప్పించుకొనే నెపంగా తలచి) అని 343వ పద్యం సీసంలో మూడోపాదం "పరిచారికా స్వభావకు నాకు మర్యాద చేయనక్కఱలేదు చిత్తజన్మ" అని అమాయకతను వాచ్యంగా చాటుకుంటుంది మళ్లీ. ఏం గడుసుతనం! ఆఁ!

చేతులున్నాయి గనుక పూలూ, చెట్లున్నాయిగనుక పళ్లూ తెచ్చా నంటూనే నే పూలుతేలేదు నేపండ్లు తేలేదు. అంటుంది. శరీరం ఉంది కనుక వచ్చానంటూనే 'లీలామనోజ రాలేదునేను' అంటుంది. (ఇక్కడ లీలా మనోజ శబ్దం జపనాదసాంద్రతా మనస్సంభవుడని మన పైవివరణను బట్టి సార్థకం) ఇంతకీ ఏమిటావిడ ఉద్దేశ్యం? పైగా ఆయన్ను సట్టుకొని "క్రొత్తగా నీవు మా కొండిక చోటికి రాతే" దంటుంది తర్వాత గీతంలో "నీవయి యిటు వచ్చినావు స్వామి' అంటుందే పిచ్చిదికాదుకదా! చూస్తే శ్రీరామ ఆత్మపాత్ర అందేదో మహార్థం ఉన్నట్లు' అనిన శ్రీరామచంద్రుడు ముసిముసి నవ్వుల నిట్లనియెథ.(344)అని సూత్రదారుడు శ్రీ విశ్వనాథ స్వయంగాఅనటంమూలంగా ఆమెకలాంటిదేమీ లేదని రూఢి చేసుకోవచ్చు,

అంటే శబరి శ్రీరామ ఆత్మయొక్క భౌతిక రూపాన్ని చూస్తూ మాట్లాడుతూ సేవిస్తూ ఉన్నా అవిడ అయనను అధిదైవిక (పాత్రధారి అయినా పాత్ర) మూర్తిగా పరిగణించీ తాను గూడా భౌతిక దేహ (పాత్ర) ధారిగా జ్ఞాతృ-జీవ వ్యక్తి అయిన దానిగా స్వీకరించమని అర్థిస్తోంది అన్న మాట. అలాదైవం జీవాన్ని స్వీకరించి తనలో కలుపుకోవటమే కైవల్యం. స్వీకరించడం అంటే అప్పటినుండి భరించడమే కనుక భర్తే ఆదైవం. అలా భరింపబడేదిగా భార్యే ఆ జీవం. ఇదీ ఇందులో వేదాంతం,

దైవానికి ఏం సమర్పించినా ఆయన సృష్టించిన పదార్థమే తక్కవేరే ఇచ్చేదేదీ ఉండదు. అయినా ఏదో ఇచ్చామన్న మన తృప్తికోసం మనకు

హితవై అందుబాటులో ఉన్నవేవో సంగ్రహించి తెచ్చి సమర్పించి ఆనందించటం పూజాక్రమం. శబరి అదే చేస్తున్నానని వివరిస్తుంది. దేహ ప్రాప్తివల్ల ఆ నాటకంగాని అసలది శూన్యం. అదే శబరి మాటల అంతర్యం. అయినా ఆసత్యం తెలిసిన సర్వజ్ఞుడు కనుక ఆవిడ నోటవిని చిద్విలాసంగా నవ్వుతున్నాడు. వెనుక అగస్త్యుడేదో అన్నప్పుడు ఆయనలా నవ్వటం విషయం గ్రహించే ఉన్నాం. ఇప్పుడాయన ఇంకా పరీక్షిస్తున్నట్లు అనే మాటలు చదవండి.

గీ. క్షోణిసుతయందమును జూచి-చూచి చుప్ప
నాక ననుజూచి కామించి - నది యనంగ
క్షోణితనయ సౌందర్యంబుఁ- జూడనట్టి
దానవీనన్ను కోరుట-తప్పులేదు, 345

అని ప్రోత్సహిస్తున్నట్లుంటాడే. అదేమిటి? చుప్పనాక అది సీత అందాన్ని చూసి ఓర్వలేక అమెసొత్తు అయిన తనను పొంది ఆమెయెడ కక్షతీర్చుకోవాలనుకుంది, కనుక అది తప్పని నీలో ఆ ఈర్ష్యకు చోటు లేదు కనక స్వచ్ఛమైన మనసుతో కోరుకొంటున్నావు గనుక అలా కోరటం తప్పు కాదనీ భావమా! ఓర్వలేక పోవటం మాటెలా ఉన్నా సీత సొత్తు అయిన తనను కోరటం శబరికి మాత్రం తగునా! అదీ శ్రీరామ ఆత్మ సమర్థించటమా? మతి ఏమీ (ఏకపత్నీవ్రత నియమ బుద్ధి) చెదిరి పోలేదు గదా! ఆలోచిస్తే

పుణ్యపాప కర్మానుసారీ భూత్వా ప్రాప్తశరీర సంయోగమ్
అప్రాప్త శరీర సంయోగమివ కుర్వాణః ప్రాణ్యాధ్యాసీ జీవః॥

అని మొదట్లో మనం తెలుసుకున్నదే మరోసారి గుర్తిస్తే ప్రాణి యందధివసించే జీవుడు. ప్రాప్త శరీర ప్రాధాన్యం + మర్యాద = హద్దులేని భౌతిక వర్తనంలో ధర్మ ప్రసక్తి ప్రాధాన్యంలేని పాపకర్మానుసారి అనీ

2. మర్యాద = హద్దుమీరని వర్తనంలో ధర్మ ప్రాధాన్యమే గాని శరీర ప్రాధాన్యంలేని పుణ్య కర్మానుసారిఅని రెండురకాల విభజన కనిపిస్తుంది.

అలాగయితే పుణ్య కర్మానుసార జీవుడు సీత. ఆమెకు శరీర ప్రాధాన్యం కంటె ధర్మ ప్రాధాన్యం ముఖ్యం. ఆ విషయంగా శ్రీరామ ఆత్మ ఆవిడను పరీక్షిస్తూనే ఉంటా డప్పుడప్పుడు. దశవర్షఖండంలో నిదర్శన చదవండి

శా వా రాముండనె నెంతయున్మరులుకొ-న్నంగాదటే ఘోరకాం
తారంబుంజతి తోడ వచ్చుటనినన్-ధాత్రీజ ధర్మంపుబు
ధ్యారానైనది భర్తపై మరులులే-దన్నన్ రఘూత్తంసకుం
డారంభించు శిరఃకంపముగ ముం-దైయేగె మార్గంబునన్.

పద్యం మొదట 'నా' అంటే అనగాఅని అర్థం. పోతేఇంక భయంకరాటవికి భర్తతో రావటం తనమీద మరులుకొనేగదా! అన్నది శ్రీరామ ఆత్మప్రశ్న. దానికావిడ (సీత) భర్త మీద (భౌతిక-శారీరకమైన) మరులు లేదు. ధర్మ బుద్ధి మాత్రం ఉంది. అనే తెగవేసి చెప్పింది. అలా సీత ధర్మ = పుణ్య కర్మానుసార జీవుడు.

కాగా పాప కర్మానుసార జీవుడు శూర్పణఖ. సీతయొక్క ధర్మపరమైన పుణ్యమర్యాద కళ్లారా చూసికూడా తెలివిని బడక హద్దు మీరిన ప్రాప్తశరీరాభిమానంతో రాముని-కాకుంటే లక్ష్మణునైనా సరే భౌతిక కాయాపాదక సౌఖ్యాని కాశించింది. వెలుగు ఉంటే చీకటి తొలగి పోయినట్లు ధర్మవిహిత పుణ్య కర్మానుసార జీవుడైన సీతను చూసి పాప కర్మానుసార జీవుడైన శూర్పణఖ తొలగి పోవాలి. కానీ అధర్మ కాంతిని భౌతిక లాలసత్వచ్ఛాయయై అత్రిపుటి (జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయాల) నావరింప (మ్రింగ) బోయింది శూర్పణఖ అదీ తప్పు. ఆ తప్పుకు శిక్ష దాని భౌతిక కాయస్వరూపాన్ని విరూపం చెయ్యటంగా అమలు పరిచాడు లక్ష్మణ సాక్షి. అదీ శూర్పణఖ సంగతి, అప్పటి శ్రీరామ వనవాసకాలం సరిగ్గా

పదమూడేళ్లొందిట. "అథ త్రయోదశేవర్షే పంచవట్యాం మహా మనాః,
రామో విరూపయామాన శూర్పణఖాం నిశాచరీమ్".

ఇప్పుడా ఆదర్శ పుణ్యకర్మను సారజీవుడు సీత. ఆమె దర్శ
నం లేకుండానే నువు పుణ్యకర్మల భౌతిక పరమైన అనుభూతి మర్యాద
(వివాహబంధాని) కూడా ఆస్కారం లేని పవిత్ర సదాచార భక్తిజీవుడు
గా శబరి శ్రీరామ ఆత్మ (పవిత్రైక్య) కైవల్యాన్ని కోరటం ఏమీ తప్పుగాదు.
భక్త సహజ ధర్మం కూడాను. ఆమాటే రంగస్థలం మీది శ్రీరామ ఆత్మ
పాత్ర అన్నాడంతే. ఇందులో మతిలేకపోవటం వంటి దేమీలేదు. ఉన్న
యథార్థమే అది. భగవంతుని అంగీకారం. సీతసౌందర్యం ధార్మిక మర్యా
దావధిగా ప్రతిక్షేంచుపికోవాలి. అంతే

శ్రీరామ ఆత్మపాత్ర అదిగో తన సహజ పరిహాసశీలంతో ఏమం
టున్నాడో చదవండి.

శా. నీ యీడేమిటి నీడుమేను భుజగీ-నిర్మోక మన్నట్లుగా
నా యీడేమిటి నా శరీరమును సం-తానద్రుశాఖాకృతిన్
బోయెంబో ననుఁ జిత్తజన్ముఁ డనుచుం-బొల్లంబడంబ్రాణనా
ధాయంచాడెదు నాకు నియెడలఁ జి-త్తంబట్లనే యున్నదిన్.346

ఇదే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు తెచ్చిపెట్టే తికమక.
ఆ పాత్రే ఆశ్చర్యంలో పడ్డాశంటాడు మనకా పాత్ర అటూయిటూ ఊగి
స లాడేక్షేత్రజ్ఞ స్థితిలో అయినా గుర్తు నిలుపుకొనే (ఒక ప్రక్క శబరి
క్షేత్రజ్ఞుడై ఉండి జీవపాత్ర ధరించి నటిస్తూంటే శ్రీరామ ఆత్మ తప్పక
అధి దైవిక పాత్రనారికాక తప్పదయ్యె.) అవకాశం ఇవ్వడు. ఒకవేళ
క్షేత్రజ్ఞుడే అయి ఆత్మ పాత్రలో నటిస్తున్నాడేమో అనుకుందామన్నా
అప్పుడా ఆత్మకి తెలియందేమీ ఉండకూడదు, కాని శ్రీ విశ్వనాథ వారి
శ్రీరామ ఆత్మ పాత్ర జ్ఞ (తెలిసి ఉండటం) అనే శబ్ద గౌరవం పట్టనట్లు
ఆశ్చర్యపోతాడన్నింటికీ!

ఆయన ఆశ్చర్యంఏమిటంటే శబరి "చిత్తజన్ముఁడనుచుం బొల్లంబడం బ్రాణనాథా" అని సంబోధించటం. ఒక తరహా అయితే తనకూ ఆమె యందు మనసన్లే ఉండటం. ఉండకూడదా అంటే పొల్లంబడన్ (పొర్లి-పొంగి బోర్లపడటం అర్థంకాదు) పొల్లుగా వ్యర్థం అయిపోయే స్థితిలో పడినట్లు వృథా అంటాడే! కారణం ఉంది మరి. అది ఈడూజోడూ కాకపోవటమే. ఆమె శరీరం పాముకు బుసం (నిర్మోకం అంటే కుబుసం) లా శక్తులుడిగిన వయసుకు చెందింది. తానేమో దేవతావృక్షంలా ("పంచైతే దేవతరవో మందారః పారిజాతకః! సంతానః కల్పవృక్షశ్చ పుంసివాహరిచందనమ్" అన్న అయిదింటిలో మూడోది సంతానవృక్షమే) వయసున్నవాడు. అదీ విషయం. అంతవయో శరీర సత్వభేదాలున్నా మనసులో పుట్టిన (మన్మథుడో కోరికయో) అది వృథా అడియాస అయేటట్లు శబరి ప్రాణనాథా అనటమూ తనకు కూడా ఆమె యందు ప్రాణప్రియా భావం కలగటమూ ఆశ్చర్యమే మరి. గమత్తేమిటంటే ఇద్దరిలోనూ ఒకే స్పందన ఉదయించిందటూనే వృథా అనటం మనకి ఆశ్చర్యమే. అయితే ఒకటుంది. ఆ శరీరసత్వ వయోభేదమే లేకపోతే ఆ చిత్తజన్మ-వ్యర్థం గాదని ఆ పాత్ర- కాదు కాదు శ్రీ సత్యనారాయణ గారి నమ్మకమేమో మరి.

అదేం కాదు. ఈ వయోసత్వాలభేదం వల్లే చిత్తజన్మకలాపం వ్యర్థమనిపించటం సామాన్య పాఠకుల కోసం. మనకైతే అది జాత్యజ్ఞేయసంబంధమని ముందే తెలుసుగా. మనంకూడా ఇంకో అడుగుముందుకు వెడితే-జీవదేవతత్త్వాలు అనాదులు. అందులోకూడా ప్రాచీనం దేవతత్త్వం (అరెండింటి కాలభేదం గుర్తించలేం గానీ కొంత ఊహకందే విషయం అన్నింటికీ అది దైవతత్త్వం అని.) కాబట్టి వృద్ధతమం కావలసింది దైవతత్త్వమే. (అయినా అవతార తనువులో, రామరూపంలో నవనవలాడు తూందిఇప్పుడు.) అంతకంటే ఏమైనా తర్వాతదే జీవతత్త్వం కావాలి. అందుచేవయను తక్కువై తీరాలి. కాని తనువునాశ్రయించి కాలం

మీరినందున ఇప్పుడు జవజవలాడుతూంది శబరి. అయినప్పటికీ దేవజీవ సంబంధమైన సహజ స్పృహచే చిత్తజన్మ – కోరిక మెదలటం – ఆస్పృహ తెలియని (శ్రీ సత్యనారాయణగారు నిల్పిన) శ్రీరామ ఆత్మపాత్రకది ఆశ్చర్యమే ఔతుంది. అదికైవల్యపరమై చిత్తం లో ఉదయించే చిత్తజన్మ–కోరికగా మనం గుర్తించాలి. అదీ అక్కడున్నాడు మహాకవి విశ్వనాథ.

పై ఉద్దేశాన్ని దృఢపరుస్తునే శ్రీరామ ఆత్మపాత్ర 'ఆకాంతా విరహార్తుండ/నాకును నీవిట్లు వలచి– నావిదిభాగ్యం" అన్నాడు. ఆకాంతా విరహార్తి అంటే ఆ సతీధర్మ ప్రకాశజీవ సీతదూరమయ్యేనన్నబాధ. ఆబాధితునియందు సేవా ధర్మ ప్రకాశ జీవ శబరి కోరి సమీపించటంవల్ల శ్రీరామ ఆత్మకి ఒంటరినన్నబాధ తప్పినదిగా ఒకఅదృష్టమే అనిపించింది. అందు కింకొంచెం మన వివరణ అవసరం.

ఏ ధర్మమార్గానుసారి అయిన జీవుడైనా సర్వాత్మనా ఆధర్మ ఆత్మ (దైవం)ను ఆశ్రయిస్తే ఆ దైవం (ఆత్మే) స్వయంగా ఆజీవుడిని చేదుకోవటంగా భక్తవాత్సల్యం ద్యోతకం ఔతుంది. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" (భగవద్గీత 18 అధ్యా, 66 శ్లో) అన్న గీతాచార్యుని వాగ్దానంలో సర్వధర్మాన్ పరిత్యజ్య అంటే ధర్మబాహ్యుడవై అనేభావంకాదని ముందు గుర్తించాలి. ఆ మాటే అయితే క్షత్రియ ధర్మానుసారం యుద్ధం చెయ్యమని ప్రోత్సహించేవాడేకాదు. స్థితప్రజ్ఞతో సహజమైన (ఏదో) ఒక ధర్మమార్గంలో దైవాన్నిచూస్తూ ఆదారి మార్చక అనుసరిస్తూండటమే దైవాన్ని శరణు పొందటం అంటే ఒక్కసారి ఆ భగవద్గీత అదే అధ్యాయంలోదె ఈక్రింది శ్లోకం చదవండి.

సహజం కర్మకౌంతేయ సదోషమపి నత్యజేత్ ।
సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః ॥

(గీ. 18 అధ్యా. 48 శ్లో.)

తనకు సహజం అయిన (ధర్మ) కర్మ ఓ అర్జునా దోషంగలదే (అయినా వదలటానికి వీల్లేదు. నిప్పు పొగచే కప్పబడేట్లు అసలేకర్మనైనా దోషం ఆవరించే ఉంటుంది. అన్నది మర్చిపోగూడదు. అంటే అలాశ్రే యమైన స్వధర్మమార్గాన్ననుసరించేటప్పుడు అన్యధర్మాలనేకాలు కంట కాలై గుచ్చుకొంటాయి. కొడవళ్లై కడుపు కోతపెడతాయి. శూలాలై గుం డెలో నాటుతాయి. ఇంకా అలా ఎన్ని ఉన్నా వాటినన్నిటినీ వదలి సహజ సిద్ధ ధర్మమార్గాన్నే శరణు పొందాలని పై గీతా ప్రవచనాని కర్థం. అర్జు నుని బంధుమిత్రాది హింసాపరివర్జనం కూడా అవటానికి ధర్మమే మరి. అర్జున విషాదయోగం) అహింసా పరమోధర్మః అంటారు గదా! అదే శూలమై అర్జునుని గుండెలో నాటుకుంది. దాన్ని పెకలించి పారవెయ్యట మే పరిత్యజించటం. సహజ క్షత్రియ ధర్మమార్గాన్ననుసరించి (సంధి విఫలం అయ్యాం తర్వాత పరిణామం గదా) యుద్ధం చెయ్యటమే శ్రీ కృష్ణభగవానుని శరణుపొందటం. అంతేకాని అకర్మణ్యత్వం కాదు. అదీ పై గీతాచార్య ప్రవచన తాత్పర్యం.

ఇక్కడ శ్రీరామ ఆత్మతో జీవసీత సహజసాధ్వీధర్మమార్గాన్నను సరించి అయోధ్యానగర సంభవాలైన సుఖాలేకాదు అత్తగారి పాదసేవ వంటి ధర్మాచరణలూ వదలివేసి అడవులవెంట భర్త శ్రీరామ ఆత్మ వెంట వచ్చిగూడా పరీక్షసమయానికి కంటి నదరుకి చిక్కి భర్తచెప్పిన హిత వా క్యాలు పెడచెవినిబెట్టి పతిహితమార్గం తప్పి-మరోధర్మం రావణ సంహార కార్య కారణమైంది- దాన్నే అగస్త్య మహర్షి "అనవరతంబు ధర్మమున యందుఁజలించని మానసంబుగ/గ్గినదిసీత...." (ద. వ. ఖం. 349) అని ప్రకటిచాడప్పుడు. అంటే అదీ ధర్మమార్గమే. (ప్రజాహిత కార్యం) కాని "భర్తపై మరులు లేదు...." (ద. వ. ఖం. 23) అని సాధ్వీసహజ ధర్మమార్గం మాటవరుసకైనా తప్పింది. కొంచెం ముదిరి మాయలేడిని కోరింది. దాంతో 'మామేకం శరణం వ్రజ' అభిప్రాయాని కంతరాయ

మైంది. శ్రీరామ ఆత్మకి దూరం అయింది. అప్పుడాయన పాపం ఆ జీవ సీతను వెదుకోలేకున్నానే అనే వ్యథ-కాలమహిమచే జ్ఞాతృజీవులన్నీ దారి తప్పుతున్నాయా (సన్నిహిత పార్శ్వవర్తి జీవ సీతయే తప్పినప్పుడలా) అనిపించి జ్ఞేయఆత్మ వ్యథచెందటం సహజం. భగవద్గీత 4వ అధ్యాయం

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥
8 వశ్లో.

అని ప్రతిజ్ఞ చెయ్యటం జీవులు ధర్మమార్గం తప్పారన్న వ్యథ చేతనే అనేది స్పష్టం. అదే శ్రీరామ ఆత్మ విరహం! అప్పుడు (ఒకజ్ఞాతృ) జీవ శబరి సేవాధర్మాత్మక మార్గాన (క్షేత్ర-శరీరసహజం అయీ గురుశుశ్రూషలో పునీత అయీ పదుమూడేండ్లాయనమాట మీద నిరీక్షించటం ఇలా ఫలించి) వచ్చి శరణుకోరడంతో ఆభ్రాంతి (జీవులన్నీ అధర్మవశులవటం అనేది) తొలగటం వల్ల శ్రీరామ ఆత్మకు అది మహాభాగ్యం అనిపించటం సహజం. రంగస్థలం మీద ఆపాత్ర ఆదేవెల్లడించాడు. అది అధి దైవిక తత్త్వపరమైన భక్త వాత్సల్య మహితామృతవాక్కు. దానికావిడసమాధానం

"ఏకష్టంబును నచ్చు / నమ్మి కష్టంబుగనె రాద-యానందమతీ" (327స) అని. వచ్చిన కష్టం ఏదైనా అచ్చమైన కష్టరూప మాత్రంగానే రాదయ్యా! అంటే ఏమాత్రమో ఉపశాంతికూడా వెంటవస్తూనే ఉంటుందని భావం. కాదంటే ఆ అనుభూతిని గ్రహించే సంసిద్ధత ఉండాలి ఆసూచకంగానే ఆనందమతీ అని సంభావించిందా విజ్ఞురాలు. ఏదో ఉపశమన మాత్రంగా అన్నదేగాని అదేమీ ఆయనకు తెలియని విషయం అని చెప్పరాలేదు. కనుకనే తనసహజ సేవాధర్మంగా వెంటనే" "అంగీకరించి న-నస్మదానీతముల్ / పండ్లారగింపవే-ప్రాణనాథ/యన్నది శబరి" (348) అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ సూత్రధారి వక్కాణ. అయితే దేన్ని

ఆయన అంగీకరించటం? పై ఉపశమిన వాక్యమా? ఇంకా పైన శ్రీరామ ఆత్మయన్న "నీవిట్లు తలచినా విధిభాగ్యం" బు అన్నదాని పాడిగింపా? అంటే ఆయన భక్త వాత్సల్యానిష్ఠమై భాగ్యంగా భావించిందే అని గ్రహించాలి. అదీ శ్రీరామ ఆత్మ అధి దైవిక తత్త్వం, అజ్ఞాతృ జీవ శబరిలో జాగృతినంది ఉందన్నమాట. ఓహో! ఇ క్క డు న్నా డా మ హా క వి విశ్వనాథ!

అప్పుడుజీవ శబరి సేవామాధుర్యాన్ని శ్రీరామ అ త్మ భ క్త వాత్సల్యం హృదయం ఆస్వాదించటం. మరి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి అమృత లేఖిని ఏమి సరసాక్షర విన్యాసం జేసిందో చదవండి. ఆమె పండ్లారగించ మన్నదిగదా! ఎలా అంది.

"సృక్వాంతముల్ జరఠ సంధ్యా బాలచంద్ర శృంగాగ్రములుగ" అంటే పెదవిమూలలు ఆ చివరను ఈ చివరను సాగి (బోసినవ్వున) ముసలి నోటితో అంది. అది ఎలా అనిపిస్తుంది? అమావాస్య వెళ్లిపోయిం తర్వాత చెంద్రుడాకసాన నూతనంగా సంధింపబడటం (సంధ్య పక్షానికి చెందింది. కృష్ణశుక్లపక్షాల నడిమిది.) శుక్ల ద్వితీయ (విదియ) నాటి బాలచంద్రుని కొమ్ము లనిపించేటట్లుట. బాగుంది.

అందుకా శ్రీరామ ఆత్మపాత్ర మాటలైతే "అవినువు తినిచూచి యతిరుచ్యము లటంచు/తెలియక నేనెట్లు-తినగలుగుదు/నన్నాడుస్వామి (348) ఎలాగ? "నేత్రాంతముల్ పూర్ణిమా చంద్రికా వల్లీకిసాలములుగ" అంటే పున్నమీ చందమామ వెన్నెలతీవయొక్క చిగుళ్లు-ఆయన కళ్ల కొనల గన్పించే టట్లుట. ఏమిటీ చిత్రణం పాత్రధారులు నటింపగలరా!

శుక్లవిదియ నాటి చంద్రకోణాలనుంచి పదమూడో రోజున వచ్చే పున్నమినాటి చందమామ కాసేపందువెన్నెల పూత విదియనాడే మారాకు

(చివురు) వేయాలిగదా! క్రమపరిణామ స్పృహనందించి విదియ బాల చంద్రుని కాంతి అనే ఒక్క విషయాన్ని రెండు తుంపులుచేసి ఒకటి జీవ శబరి నవ్వులోనూ వేరొకటి శ్రీరామ ఆత్మ కంటి కొలుకుల్లోను నెలకొన జేసాడు. అదిగో అక్కడ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ మహాకవి ఉన్నది. జీవ శబరి నిరీక్షణ పదుమూడేళ్ల పర్యంతం అని ఆయన చెప్పాడా! అయితే ఏం విదియ పున్నముల నడిమిరోజుల సంఖ్యలో కాల ప్రతీకా భావం కల్పించి-రోజులను సంవత్సరాలు చేసుకొంటే ఆకాలం తెలిసిపోతుందని ఒక్కనాటి (విదియ) విషయాన్ని తర్వాతి కాలం (పున్నమి) మాట ఎత్తి సూచించాడు. అంతేనా! జీవ-దైవ అనుబంధం. 'చంద్ర చంద్రిక యోరివ' అని విడరాని వాటిని తాను విడమర్చి సూచించాడు. ఇక్కడ మహాకవి కాదు ఉన్నది, విశ్వమున కధినాథుడు విశ్వనాథుడే ఉన్నాడు.

న శివేన వినాదేవీ దేవ్యాచ న వినా శివః!
నైతయో రంతరం నాస్తి చంద్ర చంద్రి కయోరివ॥

కామకలా విలాసమ్ అనే తంత్ర గ్రంథంలో దేవిలేకుండా శివుడూ శివుడు లేకుండా దేవీ ఉండరు. వాళ్లకి భేదంలేదు. ఎలాగంటే చంద్ర చంద్రికల కుండనట్లే చందమామా వెన్నెలా విడదీయటం సాధ్యం కానట్లే అని స్పష్టంచేసింది. సరిగ్గా ఇలాంటి సంబంధమే శబ్దార్థ విషయమూను.

శబ్దజాత మశేషంతు ధత్తే శర్వస్య వల్లభా।
అర్థరూపం యదఖిలంధత్తె ముగ్దేందు శేఖరః॥ వాయుపురాణం

అంటే శబ్దాలన్నింటిని ఒక్కటీ వదలకుండా శివుని భార్యధరిస్తే వాటి అర్థాల రూపాలన్నింటినీ శివుడు ధరిస్తాడని భావం. శివపార్వతులు విడివడని జంటకదా. జంట అంటే మిధునం. ఖగోళంలో ఒకరాశికూడాను

సరే ఇంతకీ శ్రీరామ ఆత్మ పాత్ర అన్నమాశ్చమిటి? "అవినువు తిని చూచి యతిరుచ్యము లటంచు తెలియక నేనెట్లు తినగలుగుదు" అంటే ఎంగిలిని ఆశిస్తున్నాడా! లేదు. ఇక్కడ శబ్దం. నామం, పండుపేరు అర్థం-ఆపండు రుచి. అమాటే శ్రీరామ ఆత్మ-అవి అంటే పండ్ల (పేర-శబ్దాల)ను జీవ శబరి,-తిని అంటే ఆస్వాదించి, అతిరుచ్యములు-అంటే" మిక్కిలి అర్థయోగ్యాలని తెలియ జెప్పక పోతే నేనంగీకరించటం ఎలా అంటాడు. ఎంతటి మహానుభావుడు! అవితా తక్కువేంగాదు. ప్రతివృక్షమందునా-అంటే శబ్దాల ఉత్పత్తిలోనే; ప్రథమమందు. అంటే అర్థయుక్తి దొరలినప్పుడే మునుముందుగా, రుచి చూచి అంటే దాని అర్థ సామంజస్యాన్ని స్వాదువూ అని గుర్తించే నీకు సమర్పించాలని తెచ్చానంది. ఎంతటి జ్ఞాతృ లక్షణ సంపన్నురాలో జీవ శబరి,

ఇది స్తోత్ర విషయ రహస్యం. అస్తి భాతి ప్రియంరూపం నామ చేత్యంశ పంచకమ్! ఆద్యత్రయం బ్రహ్మరూపం, జగద్రూపం తతోద్వయమ్॥ (ఋగ్వేదీయ సరస్వతీ రహస్యోపనిషత్) 1. ఆత్మస్థితి 2. ఆత్మ ప్రకాశం 3. ఆత్మీయతా అనే మూడంశాలు బ్రహ్మపరంగా ఉంటే 1. రూపం 2. నామం అనే రెండశాలూ జగద్రూపంగా మొత్తం అయిదంశాలు విశ్వనాథునికి. పోతే చివరి నామం సృష్టిలోని వస్తువును గుర్తించే వాచక వ్యవహారానికి చెందింది. అది సూచించే వాచ్యం అయిన ఆ వస్తువే రూపం. అదే అర్థం. (అట్టే తికమక పడకండి) జీవదైవ వర్తనలు జననమందిన అవతారపరం గనుక మన పాత్రలు జగద్రూపం అయితే- బ్రహ్మపరంగా అవి పరిణమించటంలో స్తుతి ఒక సాధన ఔతుంది. స్తుతి నామ సంకీర్తనమే. మరి ఆ నామం అర్థరహితం అయితే తగునెడ వినియోగం కాదు. అలా కాకుండా దానిని అర్థరక్షచేసి నీ కీర్తన సాగిస్తున్నావా! అనేది శ్రీరామ ఆత్మ పాత్ర ప్రశ్న అయితే ముందు నేను వినియోగించి అన్వయం కుదిరి దోషరహితంగా గుర్తించే కీర్తిస్తున్నాను సుమా. అనేది జీవశబరి

పాత్ర సమాధానం. ఎంత సమయోచిత జ్ఞాతృజ్ఞేయ సంభాషణా వైశిష్ట్యమో గమనించండి. అప్పుడీ వ్యవహారం ఏదో సరిగ్గా ఉందా అన్నట్లు" శ్రీ రామ చంద్రుఁడు "నిబిడ మంద మృదుహాసుఁడగుచుఁజూచె సౌమిత్రి వంక" (348) అని లక్ష్మణసాక్షి ఆమోదం ఆపేక్షించినట్లు శ్రీ విశ్వనాథ సత్య నారాయణ సూత్రధారుడు సదస్యుల కెరిగించాడు

చాలామంది ఇక్కడ జీవ శబరి పండు కొరికి (అసలామెకు పల్లు లేవు) రుచి చూచి శ్రీ రామ ఆత్మకు మధుర ఫలాలు సమర్పించిందని కొందరూ ఆ ఎంగిలిని సమర్థిస్తూ ఎంగిలి చేయటం అంటే ఆమె జ్ఞానకర్త ల అనుభూతి పొందటం అనీ ఇప్పుడు వాటిని శ్రీరామఆత్మకుసమర్పించట మే ఆ పండ్లు భుజింప స్వామికి నివేదించటం అంటూ మరింత సమర్థకం గా అన్నింటికీ స్వామియే భోక్త అని యింకొందరు వేదాతం చెప్తారు.

శ్రీకృష్ణుడు మీమీ కర్మలను నా కర్పించండి. మీ కర్మలకు కోటి మడుగుల ఫలం మీకు దక్కుతుందన్నాడుట పాండవులతో. వెంటనే ధర్మ రాజు తనేమైనా పాప కర్మలు చేసినవి ఉంటే అవి కాస్తా ఈ పాపాల భైరవుడికి సమర్పించేస్తే తానిక పుణ్యమూర్తిగా ఉండి పోవచ్చు అనుకొని బయలు దేరాడుట. భీముడన్నగారిని ఆపి నీవు ఆ మాయగాడి మాటలు సరిగ్గా విన్నావా! నీవిచ్చినవి కోటి మడుగులై మళ్ళీ నీకే వస్తాయి సుమా! అనేటప్పటికా ధర్మరాజు హడలి పోయాడుట, ఇదెం భారతంలో లేదు గాని కర్మలను భగవంతుని కర్పించటంలో కిటుకును తెలియజేయటానికి పనికి పస్తుంది. మరి అదీ వేదాంత రహస్యం. ఇక ఎంగిలి పళ్ల మాటేమిటంటే ఏదో భక్తి ఉద్యమంలో బయలు దేరిన కల్పన అది. ఆ మొధలుకిలా వేదాంతం వేసింది చిలవలూ పలలూవను.

"శాబరాఖ్యాత సద్వంశసంజాతయౌవృద్ధ.... వృక్షంబులందున్న పండ్లన్ వెసన్డుల్చి చేఁదాల్చి తియ్యంబులో కావొ నా స్వామి సేవింపగాఁ

జెల్లవో పుల్లవో చెల్లయంచింబ తాఁబంటితో నొక్క యొక్కొక్కటిన్ బుల్లనౌ వాని నందే పడంద్రోసి బల్తియ్యనౌ పండ్ల నెల్లన్ ముదంబారఁ గాఁదెచ్చి శ్రీ రాము ముందుంచ.... లో గూర్మియే శ్రేష్ఠమౌఁగాని పైపూతలుంజేతలున్ రోతలౌ లక్ష్మణా బిడ్డలందున్ మఱిన్ భక్తులందున్ గనన్వచ్చునే .... .... తాఁగొన్ని భక్షించి సంతుష్టుడై" (పుట 95 శ్రీ కరణం అశ్వత్థరావుగారి శ్రీ దండక రామాయణం ఇలా అన్యత్రాఁప్రబంధకవుల్లో కూడా) ప్రసక్త మైన ఎంగిలి విషయం వాల్మీకిగానీ ఆయన్ననుసరించిన తెలుగు కవులు గానీ ప్రస్తావించలేదు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారూ వ్రాయలేదు అలాగనివదలివేయనూలేదు. ఒక్క చెట్టుకాయలన్నీ ఒక్కేరుచివనితెలిసిన శబరి చెట్టు చెట్టుదీ ఒక్కొక్క కాయ రుచి చూచి (ఎంగిలి చేయనివే) తినదగినవి ఏరి తెచ్చింది. ఆమె అలా రుచి చూచిన ముక్కలే ప్రమా ణంలో పదోపరకో పాతికో కాయలైఉంటాయనడంతో ఆముక్కలు సమర్పి తఫలాలవనీఎవరైనాభ్రాంతిపడవచ్చుకానినిజంఅదిగాదు. ఈపద్యంచదవండి.

చం ఒకయొక ముక్కగా నయిన - నూరకనే రుచి చూడఁదిన్నవే
యొక పదియో మఱింబరక - యోమఱి పాతికయో యగున్ఫల
ప్రకరము కుక్షి నిండినది - రామ! విరామములేదు ప్రాణనా
యక యకటా శ్రమం పడితి - వా ఫలముల్తినవే దయామతీ! 350

ఆసలీమాట ఎందుకుచెప్పవలసి వచ్చిందంటే 349వ పద్యంలో శ్రీరామ ఆత్మపాత్ర "నేనొకఁడన్ భుజింపఁగాఁ దోచదు నాకు నీవు మనతో ననుజుం డును దిందమాయనన్" శబరిపాత్ర చెప్పిందిలాకాయల ఎంపికలో రుచి కోసం తిన్నముక్కలే నా కడుపు నింపేసాయి ఇంక నీతో తినలేను అని.

మనం ఇందాక పండు నామం (శబ్దం) అనీ రుచి - అర్థమనీ అను కొన్నాం గదా! దాన్ని బట్టి ఇంక తినలేనంటే శబ్దార్థాల తృప్తో వినుగో పుట్టిందని కాదు, సంకీర్తనా గ్రంథం పూర్తయిందని. మరి శ్రీరామ ఆత్మ

పాత్రను తినమంటుందే. అయన పాపం - జీవ సీతలాంటి వాళ్ళు అపార శబ్దాల (మాయలేడి వంచనబడి) సంకీర్తనోద్దిష్టమైన ఆత్మ దైవభావంనుండి తొలగిపోయి (నాచేగసమస్తమయ్యతివచేసిన ప్రేమబలంబు.... 254) శ్రమ నందుచున్నావు గనుక ఇప్పుడు నా సంకీర్తనలో (ప్రేమబలం) పుంజుకొని ఆత్మ తృప్తి పొందవలసిందన్న అభ్యర్థనే అయనను తినగోరటం. తరువాతి పద్యంలో ధరాత్మజాహృతిఅని జీవసీతాపహరణ వృత్తాంతాన్ని స్మరింపజేసి ఇప్పుడు శ్రీ రామ ఆత్మ అది మరచినట్లుగా చెప్పటమే శ్రీ సత్యనారాయణ సూత్రధారుని ప్రకటన. ఆ పద్యం చదవండి

గీ. అంతరాముఁడు శబరి వృ-త్తాంత మడుగు
చొక్కొక ఫలంబు కోయుచు- ముక్కలార
గించుచును జిత్రముగఁ బ్రసం-గించుచు సుధ
రాత్మజాహృతి విస్మృతి-నందినట్లు

ఒక్కొక్క ఫలంబు కోయుచు అంటే ఒక్కొక్క పదాన్నే విమర్శిస్తూ (పదచ్ఛేదం) అనే భావం, ఆమె వృత్తాంతం అడగటం ప్రయోగాభిప్రాయం అడిగి తెలుసుకోవటమే, ఇంక ఆరగించటం అంటేచక్కగా గ్రహించటమే. కాకపోతే ఇప్పుడిలా ముక్కముక్క తింటూ తరువాత పద్యంలో ఫలంఫలం పళం గానే సేవాక్రియా భాగంగా ఎలా ప్రకటిస్తాడా పాత్ర? చదవండి.

సీ. కాళ్ళు కండెలు గట్టఁ - గానలోఁ దిరిగిన
దిదిమౌనిసపర్య - కెనఁగు ఫలము
కుశలును దర్భలు - కుసుమముల్దెచ్చిన
దిదియగ్ని పరిచర్య-కెనఁగు ఫలము
నారబట్టలుగాలి-కారఁగా బట్టిన
దిది ఋువర్షతుసేవ-కెనఁగు ఫలము

నార బట్టలు గాలి - కారగాఁ బట్టిన
దిది వర్షఋతుసేవ - కెసఁగు ఫలము
పిడకలు సుముకక - ప్పి సుభద్ర పరచిన
దిదియగ్ని పరిరక్ష - కెసఁగు ఫలము

గీ ఇదియు దీర్ఘకాలపు శ్రద్ధ - కెసఁగు ఫలము
నిదియుఁబతిగాఁగోరిన - న్నేవరించి
నవ ప్రతీక్షాద్రివేలపై - నయన విస్తృత
తామరసములఁ జొచ్చిన - దాని ఫలము 352

ఈ సీసం మొదటి పాదం మౌని సపర్యకుపక్రమణంకాగా తక్కిన మూడు పాదాలు దాని వివరణ. అంటే రెండో పాదం శబ్ద (పదార్థ సేకరణ మూడో పాదం (భక్తి సేవాపరంగానీ, అన్యరసాల పరిహారణచే గానీ) శుద్ధి కరణం అయితే పద్యం మొదటి పాదంలో మౌని పరిచర్య అని స్పష్టంగా కర్మ విషయ ప్రధానంగా ఉంటే మనం శబ్ద ప్రధానంగా గ్రహించటం ఏమి సబబు అనిపిస్తుంది. కానీ ఆ కర్మ ఏమిటి అనే వివ రాల్లో మొదట చివర కూడా అగ్ని ప్రస్తావనే ఉంది. గమనించండి. దాన్ని బట్టి అదే ప్రధానం అన్నమాట. అంటే అగ్నిర్వాగ్భూత్వాముఖం ప్రావి శత్" (ఋగ్వేందీయ ఐతరేయో పనిషత్ 2 ఖండః) అగ్ని శబ్దమై నోట ప్రవేశిస్తుందని ఉపనిషద్వాక్యం, కాబట్టి శబ్ద ప్రధానంగా వ్యాఖ్యానించ టం కంటే ఇంకేదీ సబబు కాదు. మౌని పరిచర్య కర్మ ప్రాధాన్యమే అయితే కాళ్ళు పట్టడం. జుట్టు చిక్కుదీసి ముడివేయడం వంటివి ఉండా లి. సీతా పరిచర్యను మురిపిస్తూ లక్ష్మణ సాక్షి శ్రీ రామ ఆత్మకు చేసినవే ఆ పరిచర్యలు. మూడోపాదంలో బట్ట లారగట్టడంగా ఒకింత ఉన్నా కూడా అదీ (తడిపోగొట్టె వేడి అగ్ని ప్రాధాన్యంగానే ఉంది. సరిగ్గా గ్రహిస్తే ఇది అధిదైవికం - అధి భౌతికంనుంచి చేదుకొంటున్న ఆధ్యాత్మిక భావం భక భగవత్సంధానకం అయిన సంకీర్తనా ప్రముఖం

ఇంకా కడపటి గీతంలో శ్రీ రామ అత్మ ఆ సంకీర్తనాన్ని జీవ శబరి తన కంకితం ఈయగా స్వీకరించడం కూడా ఉంది, దీర్ఘకాలపు శుద్ధ జీవితమంతా ముని సేవ అని భావంకాదు. పదుమూడేండ్లనాడు గురువు చెప్పిపోతే అప్పటి నుంచీ తనకోసం పూనిన శ్రద్ధనే శ్రీరామ ఆత్మ పరిగ్రహించటం అనే భావం. అది తర్వాత పాదంలో స్పష్టంగా "పతిగాఁ గోరి నన్నే వరించి' అని ఉండనే ఉంది. ఎలా ఉందిట! 'నప ప్రతీకాబ్ధి వేల" నూతనంగా కల్పించిన ప్రతీక - ప్రతి బింబ భావ సముద్రానికి గట్టుగా ఉంది. అది అడ్డు కట్టకాదు. రక్షణకైన గట్టు. ఇలా మొదట వాచ్యంగా చెప్పిన మౌని పరిచర్య అంతా ప్రతీక విధానంలో ఉందని సూచింపబడింది, ఈ చివర. అది శబ్ద ప్రతీక అని మనం గ్రహించటం నయన వివృత తామరసములిం జొచ్చిన దాని ఫలము. విచ్చుకొన్నకనుదామరలందున్న - అంటే ఆశ్చర్యం. అద్భుతంఫలం. కాగా తొలి పరిచయం లో శ్రీరామఆత్మ సన్నిధానంలో ఆయన తన ప్రతిబింబాన్ని విశ కన్నుల్లో చూచుకోవడంలో జరిగిన ఫలం అని కూడా. దాన్తో సంకీర్తనా శక్తి యొదవింది.

"శబ్దముల కూర్పుచేత నొక యేదో ధ్వనియుదయించును. ఈ ధ్వని కావ్యధ్వనికాదు. మహాకవి యక్కడున్నాడు. దానిని గ్రహించుటకు శబ్ద బ్రహ్మ సాక్షాత్కరింపవలయును". అంటూ విశ్వనాథ సత్యనారాయణ గారు స్వయంగా శబ్ద ప్రాధాన్యం మిక్కిలిదిగా ప్రకటించి ఉండటం గమనించినా తన రచనలో దానికే అవకాశం ఇచ్చి ఉండటం నిజం అని తేల్చివేస్తుంది.

ఇక్కడ గుర్తుంచు కోవలసింది ఈప్రస్తావన చేసింది అది. దైవిక శ్రీ రామ ఆత్మ పాత్ర అనేది. మరి అదే ఆధి భౌతిక జీవశబరి ప్రస్తావించి ఉంటే ఆ మౌని పరిచర్య భౌతిక సేవా మాత్రంగానే ఉండేది, ఉండేదని

ఊహించ నక్కర్లేదు, ఉండనే ఉంది. గురువుగారు తన సేవలకోసం ద్యులోకంల్లో పడే బాధలనావిడ ఏకరువు పెట్టే ఉంది. చదవండి,

సీ. ఫలసమిత్పుష్పసం-బారంబు వేళకు
దెచ్చి యందిచ్చెడు-దిక్కు లేక
విరిగిన గుడ్డతా-మరతూటి దారాన
నతుకు వెట్టి యొసంగు - నాశలేక
మొగుడు కన్నులఁ బొగ - పోయి యగ్నులనూది
వెలయించి పెట్టెడు-వెనుకలేక
యింద్రరథంబుపై - నేగిన యుత్తరా
యణ మార్గ దూర ప-ర్యంతగామి

గీ. యామహాస్వామి యచ్చట- నటమటించు
నో తదాజ్ఞా విలంబన-మోర్వలేను
సిద్ధముగ నున్న యగ్నిలోఁ-జేర్చిమేను
చనియెదను నన్ననుగ్రహిం-చవెకృపాళు 362

పాపం ఆ అమాయకురాలు భౌతిక సేవాపరాయణత్వ భావనలో పడి 'ఉత్తరాయణ మార్గదూర పర్యంతగామి" అంటూనే ఇంకా ఈ లోక సహజసేవలకాశించి తనకోసం ఎదురుచూస్తూంటాడనుకొంటుంది. ఆమె పరిజ్ఞానం అంతే, గురునానతి మీద ఇంతవరకు వేచి శ్రీ రామ ఆత్మను భగవన్మూర్తిగా తలచటం తప్ప స్వయం తపో సాధన గెల్చుకొన్నదికాదు. శ్రీ వాల్మీకులవారి శబరి కాదీమె. ఎవరెవరో తేల్చుకోలేని తికమకలో ఇక్కడ కూడా ఆమెనో పరమహంస పరివ్రాజికగా నమ్ముకొనే వాళ్ళెవరికీ నచ్చుబాటుకాకపోయినా ఆమాట పై సీసపద్యం వల్లసత్యంకాక తప్పదు.

ఇప్పుడింకోచమత్కారం. రంగస్థలం మీద శ్రీరామ ఆత్మ పాత్ర అలా సంకీర్తన పదాల సదర్థగ్రహణం ప్రకటిస్తూ ఫలశకలాలు స్వీకరిస్తుం

తే జీవ శబరి పాత్రపద్మాల్లాంటి(మూశపత్ర) కళ్లల్లో మన్మథ చతుర్ముఖు లు (శ్రీ మహావిష్ణు సంతానం) ఉదయించి నట్లుందిట. మన్మథుడన్నమాట మనసు కోరిక పర్యాయపదంగా అనుకున్నాంగా వెనుక, దాన్నిబట్టి సంకీ ర్తన కర్తగా తానూహింపని మహితార్థాలను సహృదయులు వెలువరిస్తే ఆ కర్తకు నూతనానుభూతిగా మనసు వికసిస్తుంది అదే మన్మథుడు ఉద యించడం అంటే. కాగా చతుర్ముఖుడు సృష్టికర్త అనుకోకుండా తన సంకీర్తనలో సదర్థసృష్టి పొడసూపడం. అదే విధాత్ముడుదయించటం. అది కృతికర్త కృతిభర్తలయోగానికి కలిగిన సంతానం అనేదే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ సూత్రధారుని ప్రకటన. చదవండి.

కం. పలు ఇట్లు చెప్పుచుండగఁ
బలి చెప్పుచుఁదినుచునుంట - బంధుర శబరీ
నత నేత్రాంభోజమ్ముల
నతను విధాత్రులు ఫలించి- రాయుననుండెన్ 353

వ. అంత శ్రీరామచంద్రుడు సౌమిత్రి సమానీత (పాపం ఆ సాక్షి పాత్ర ప్రాధాన్యం అంతవరకె రంగస్థలం మీద) జలంబుల (ఎందుకనో జలం శబరి ప్రమేయంగా ఉండదు. ఓ అనుబంధంలో తేల్చుకుందాం) ధంగుళీప్రక్షాళనంబును నంరసమ్మార్జనంబునుజేసి శబరీశ్రీరామచంద్రులు

రంగస్థలంమీద శ్రీరామ ఆత్మ పాత్ర వేళ్ళు కడుక్కొని మూతి తుడుచుకొన్నాడు, అందుకు నీళ్ళు తేవటం మాత్రం లక్ష్మణసాక్షి వంత యింది. మరి ఆయన ఏమీ కడుక్కొని నీళ్ళు తెచ్చినట్లులేదు. పాపం ఒక్కముక్కన్నా తిన్నాడనిపించదు. (349వ పద్యంలో శ్రీ రామ ఆత్మ పాత్ర " నేనొక్కఁడన్ భుజింపగాఁ దోచదు నాకు నీవు మనతో ననుజుం డును దిందమా!" అని అడిగినట్లు ఒక మాట ఉంది కానీ తిన్నట్లు లేదు ఎంగిలికి వేదాంతం చెప్పేవాళ్ళేమంటారో! ఆయన తిన్నాడంటే మరి ఆవిడ

జ్ఞానకర్మలొక్క శ్రీరామునికే సమర్పించినట్లుకాదే ! అది పరిగణిస్తే ఎంత స్వార్థం అనిపిస్తుంది. నిజ్ఞానికది స్వార్థమేంగాదు. సహజం. జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ విషయంగా నడిమి జ్ఞానం జ్ఞేయంకోసమేగాని స్వయంజ్ఞానంకోసం కాదు. (దీన్నిబట్టి కళకళకోసంకాదనే వాదన బయలుదేరింది. అది ఇలాంటిదికాదు) "జ్ఞేయం దృష్ట్వా పశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్" (యాజుషీయ బ్రహ్మ విద్యోపనిషత్) జ్ఞేయదర్శనానంతరం జ్ఞానాన్ని వదలివెయ్యవచ్చు. కనుకనే కనుకనే అవజ్ఞ అనిపించినా జ్ఞానలక్ష్మణసాక్షి పరిగణన జ్ఞాతృజీవ శబరికి బొత్తుగాలేదు జ్ఞేయశ్రీరామ ఆత్మకు నామమాత్రంగానే ఉంది. సామాన్య లౌకిక మర్యాదగా "మనతో ననుజుండును." అన్నాడనుకుంటే అదీలేనట్లే లేదు. ఉండకూడదు. ఇక్కడికి అవగాహన అయితే అదిగో శ్రీరాముడూ బశరీ మాటల ముచ్చట చదవండి.

గీ. అవ్వ ! నన్వీరి వెన్నుల-యట్లు ముగ్గు
బుట్టపలెనయ్యో నీశిరం-బును ననంగఁ
బ్రభువ ! నీయాత్మవాకిట-రంగవల్లి
నినుచుటకు నింతగాగఁబం-డిన దటంచు 355

ఇక్కడ తలముగ్గుబుట్టలా అయిందంటే ముగ్గు'శబ్దానికే ప్రాధాన్యం. లక్షణావృత్తి సాధ్యం అయిన వెంట్రుకలకికాదు. అందుకే జీవశబరి ఆ శబ్దాన్నందుకొని నీ ఆత్మవాకిట ముగ్గులు దిద్దటానికయ్యా అంది. మరి తల పండటం (పూర్తిగా లక్షణావృత్తి)గా తీసుకొన్నా అదిపాండిత్యపరమై నీ ఆత్మముఖంగా చిత్రరచనకే అందన్నమాట. తరువాత

గీ. అవ్వ ! ఎంతో తపించి నీ-యాయువెల్ల
నార్చినావిట్టులెంచి యే-కైతివనఁగఁ
బ్రభువ ! స్నేహంబుచేత నా-ర్ద్రంబుఁజేసి
యింత దివ్వెగా వెలిగిఁచ-వేయుటంచు. 356

ఇప్పుడూ ఏకైతి వనటం జాతీయలక్షణ ప్రాధాన్యం. సర్వవాఙ్మయమూ (నీ తెలిసినదంతా) నా కర్పించి నీవేమీ మిగుల్చుకోకుండా వట్టిపోయావన్నభావం. (సర్వమూ జ్ఞేయమైనట్టి సమష్టిపరంజేసి జ్ఞాతృపరం-వ్యష్టి-వ్యక్తిగా తలంపే వదలిన త్యాగదృష్టిగా మిగిలిపోయావని) ఆయన గూఢంగా వ్యక్తంజేసాడు. ఆవిడ అది ఏమీ నష్టం కాకుండా (వ్యష్టి సమష్టిలో భాగం గనుక సంరక్షణ బాధ్యత వహిస్తుందన్న నమ్మకం) నికర్పించాసుగదా! నీ స్నేహంవల్ల దీపంఅయి వెలుగుతుంది నీ ఆర్ద్రహృదయంలో ముంచివెలిగిస్తే అంటూందావిడాను. (ఇంతకంటె ప్రజాస్వామ్యభావం ఏముంటుంది!) స్నేహశబ్దం శ్లేషవల్ల నూనె (అర్థం) అయింది నూనెతో తడిసిన ఏకు (శబ్దం యధాతథంగాగొన్న వర్తి ఔతుంది. వెలిగిస్తే దీపం ఔతుంది. ఒక దీపం ఇంకోదీపాన్ని వెలిగించాలి. అది ప్రజాస్వామ్యంలో పరస్పరవ్యక్తి సహకారభావం.) దేవాలయాల్లో అఖండదీపం దీని ప్రతీకభావార్థానికే, తరువాత-

గీ. అవ్వ! నీకిట్లు తీవ్రవ్ర-తాభిషంగ
మునను ప్రాణాలు గూళ్లువ-ట్టినవనంగఁ
బ్రభువ! నీయింత తీవ్రద-యాభిషంగ
మునను బ్రాణమ్ము గూటఁజే-రినదటంచు. 357

ప్రాణాలు ముఖ్యమైనవి అయిదు 1 ప్రాణాము 2 అపానము 3 వ్యానము 4 ఉదానము 5 సమానము, అని. ఇందులో కడపటి సమానమే దేహం అన్ని భాగాల్లోనూ వ్యాపిస్తుంది. మిగతావి సంచరించేస్థానాలు వేరే వేరే ఉన్నాయి. "ఆస్యనాసికయోర్మధ్యేతథాహృది ప్రాణసజ్ఞోఽ నిలోనిత్యం వర్తతేముని సత్తమ 2. అపానో వర్తతేనిత్యం గుదమేఢ్రోరు జానుషు ఉదరే సకలే కట్యాం నాభౌజఘేచ సుత్రత 3 వ్యాన శ్రోత్రాక్షీమధ్యేచకకు ద్భ్యాం గుల్ఫయోరపి ప్రాణస్థానేగళేచైవ వర్తతే మునిపుంగవ 4 ఉదానసంజ్ఞే విజ్ఞే

య; పాదయోర్హస్తయోరపి 5 సమాన స్సర్వదేహేషు వ్యాప్య తిష్ఠత్యసంశయః|" అని దత్తాత్రేయుడు సాంకృతి అనేమునికి ఉపదేశించినట్లు దర్శనోపనిషత్ 4 ఖండంలో ఉంది.

ఏ కారణంచేతనే అయినా దేహం ఆ ప్రాణాలను భరించలేనట్లు శక్తిహీనం అయి మరణకాలం రాక ఉన్నపుడే ప్రాణాలు నిష్క్రమణానుకూల స్థానాలకుచేరి బయటికి పోటమా దేహంలోనిలవటమా అని చూస్తూంటాయి. అలా స్వేచ్ఛాసంచారం కోల్పోయి ప్రాణాలు నిష్క్రమణకు సిద్ధమైచేరే శరీర భాగాలే గూళ్ళు ప్రాణాలాగూళ్ళు పట్టాయంటే చావు దగ్గర పడిందని అర్థం వ్రతానుష్ఠానాల పట్టుదలకుపోయి జీవశబరి చావు దగ్గరపడ్డదానిలా అయి ఉందన్నాడు శ్రీరామ ఆత్మపాత్ర. అప్పుడావిడ గూళ్ళు బహువచనం అయినట్లూ అందులోని ఏకవచనరూపం గూడుగా గైకొని నీ దయానుగ్రహపు పట్టున నా ప్రాణం గూటపడిందంటుంది. శబరి గూడు-ఇల్లు అన్నది "శరీరం గృహమ్" అన్నట్లు శరీరమే. శ్రీరామ ఆత్మ ప్రాణాలూ గూళ్ళూ రెండూ బహువచన శబ్దాలేవాడితే జీవశబరి ప్రాణమూ గూడూ రెండూ ఏకవచనాలే వాడుతుంది. ఔనుమరి ఆయన జ్ఞేయ-సర్వజ్ఞుడు ఆమె జ్ఞాతృ-అల్పజ్ఞ.

మన మీ మూడు గీత పద్యాల్లోనూ మొదటిది మాత్రమే తల పండటం పాండిత్యపరంగా గ్రహించి జీవశబరి శ్రీరామ ఆత్మముఖంగా పదసంకీర్తన) రచించటంకోసమే అని సమాధానించిందనుకొన్నాం. మరి మిగిలిన రెండిటా అది కొనసాగలేదా ? అంటే కొనసాగకేం. పాకానపడి మరీ కొనసాగింది. ఈ మూడు పద్యాల వ్యంగ్యం చూస్తుంటే కావ్యంలో దాని ప్రాధాన్యం విషయంగానే కొనసాగినట్లు గ్రహించటం ఏమంత కష్టం కాదు మొదటిది సంకీర్తన పదరచనకే అందని చెప్పుకొన్నాంగా! తర్వాత-

రెండో పద్యంలో శ్రీరామ ఆత్మజీవ శబరిని ఏకులా ఎండిపోయా

వనిగదా అన్నాడు! (కావ్యం కవిపేరు మీదుగా చెలామణీ అవటంఉంది. భారవి, మాఘం అలాంటివే,) అంటే రచన శుష్కశబ్దార్థ మాత్రంగా ఉందని "శబ్దార్థ శాసనజ్ఞాన మాత్రేణైవ నవిద్యతే" వట్టి శబ్దార్థాలు వాడే శాసనం తెలుసుకొన్నంత మాత్రంచేత (రచన) ఏం తెలుస్తుంది ? తెలియదవ్వా! అన్నాడన్నమాట! చాలా తక్కువ అంచనా వేశాడు.

దాని కావిడ నీ స్నేహం (నూనె) తో తడిపి వెలిగించవయ్యా అనిగదా అంది? అంటే "విద్యతేసహి కావ్యార్థ తత్త్వజ్ఞై రేవకేవలమ్" కావ్యాల అర్థం తత్త్వంతెలిసినవాళ్ళకి మాత్రమేకదా (మీకెలాతెలుస్తుందీ అని ఆయన అంచనాకు తిరుగు జవాబిచ్చినట్లేఅని) ప్రభూ అది తెలిసేది! నీవా తత్త్వవిమర్శకుడవు జ్ఞెయసర్వజ్ఞుడవు సహృదయంతో చక్కగా దాన్ని వివరించి ప్రకాశపరచవచ్చుగదా అందన్నమాట. బలే!

మూడో పద్యంలో శ్రీరామ ఆత్మ ప్రాణాలు గూళ్లు పట్టాయే అనికదా జీవశబరి నన్నాడు। అంటే

శ్లో॥ సోర్థస్తద్వ్యక్తి సామర్థ్యయోగీ శబ్దశ్చకశ్చన ।
యత్నతః ప్రత్యభిజ్ఞేయౌతౌ శబ్దార్థౌమకహాకవేః ॥

వాచ్యంకంటె భిన్నమైన వ్యంగ్యార్థమే రచనకు ప్రాణం, దాన్నిప్రకాశింపజేసే వ్యంజక శబ్దాలే మహాకవులు విశేషించి గ్రహించవలసి ఉంటుంది. అవి నీపదరచనలో విహరింపక గూళ్లెక్కేసాయి. (శాస్త్ర గ్రంథాల్లో మిగిలిపోయాయని భావం) అంటే అవిలేని నీరసకావ్యం అని ఆక్షేపించాడన్న మాట.

దానికావిడ నీ దయవల్ల గూటపడింది అందికదా !

శ్లో॥ ఆలోకార్థీ యథాదీప శిఖాయాం యత్నవాన్జనః
తదుపాయతయా తద్వదర్థేవాచ్యే తదాదృతః

చీకటి వేళ (లేదని పించిన వేళ) వస్తువులు (ప్రాణాన్ని) దర్శింప

యత్నించేవాడు దీపాన్నుపయోగించినట్లు వ్యంగ్యార్థాలు ప్రవర్తింపజేయు టానికి వ్యాఖ్యార్థాల ఉపాయాలందు ఆదరం చూపాలి. నేనలా చేసే ఉన్నాను. దయతో శ్రద్ధపడితే వ్యంగ్యార్థ ప్రాణం వ్యాఖ్యార్థ గృహంలో చేరుకొనేఉంది, అని జవాబిచ్చిందన్నమాట.

అలా కావ్య ప్రధాన విషయిక చర్చ కృతిభర్త అయిన శ్రీరామ ఆత్మకూ కృతి కర్త అయిన జీవశబరికీ మధ్య సంభాషణగా కొనసాగి ఆనందం కలిగించింది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ధ్వన్యాలోకం పాఠం ఈ రకమైన నూతన విధానంలో సాగటం ఆయన దగ్గర పాఠం జేసినవారు గుర్తింపగలరు.

ఇలా శ్రీరామ ఆత్మ పాత్ర తాను గూఢార్థయుక్తి నడిగింది. గుర్తింపనీయక జీవశబరి పాత్రను మాత్రం "నీ మాటలు సామాన్యార్థాలు (వ్యష్టినిష్ఠమైనవి) కావు నిర్భరదివ్యార్థము (సమష్టి సర్వ సమ్మోదక నిష్ఠ) లై కనంబడెడు నవ్వా యెవ్వరే నీవు?" (358) అంటాడు. అన్నీ అయ్యాక ఇప్పుడీ సందేహం ఏమిటి? (అడిగేవాళ్లకి చెప్పేవాళ్ళెప్పుడూ? లోకువే.) అది ఆమెకీ (ఒంటరికి) సమష్టి పరిగణనాజ్ఞానం ఎక్కడిదీ అనే.

ఆవిడ క్షేత్రజ్ఞ అని మనం గుర్తించుకొన్నాం ముందే. కనుక (ఇప్పుడా క్షేత్రాన్ని గురించి ప్రశ్న) మనకా జీవశబరి పాత్ర అవగాహన ఔతుంది. ప్రస్తుతం భౌతికదేహ సంబంధిత కాబట్టి అపరిచిత కవకాశా కృతి (క్షేత్ర) వివరమారంభించింది. ఆమె సమష్టి భావానికి మొదటి సహకారి మతంగ మహాముని తపోముద్రగల ఆముని పేరి ఆవనపరిసరం. ఆమాటే ఆమె పరిచయపూర్వకంగా చెప్పింది. తానామునికి పరచర్యచేసే భాగ్యం (రెండవ సహకారి పొందానంది. పేరు దేహబంధన వ్యవహారార్థమైంది) 'శ్రీమణి' అని చెప్పుకొంది. (మూడవ సహకారి) ఈ మూడింటికన్న ముఖ్యమైన భగవన్నిరీక్షణగా) మీరు చిత్రకూటం చేరినప్పుడా

యన (ముని) దివ్య లోకానికి వెడుతూ మీ అన్నదమ్ములిప్పటికిలా ఇక్కడికి వస్తారనీ మీ కాతిథ్యం ఇయ్యాలని నన్నాజ్ఞాపించాడు. నేను నా మోక్షం గూర్చి అడిగితే ఆ ఆతిథ్య భాధ్యత నెరవేర్చి నన్నూ ఆ దివ్యలోకానికి రమ్మన్నాడని స్పష్టంచేసింది. (359 వ.ప.) ఎప్పుడో-జరుగవచ్చు - మానవచ్చు అనిపించే ఏదో సమష్టిసంతృప్తికి విజ్ఞాల సిద్ధాంతపరమైన ఆజ్ఞమీద అచంచల విశ్వాస రూపమే జీవ శబరి - పాత్ర. అది సమష్టి సర్వజీవ సౌఖ్యానందానికి మూలసూత్రం స్వీయాచరణలో బోధించటానికే రామాయణంలో ప్రత్యేకింపబడిన పాత్ర. అయితే శ్రీ రామ ఆత్మ కాతిథ్యం ఇచ్చినంత మాత్రంలో సర్వజీవసౌఖ్యానందం సూచించినట్లేనా?

శ్రీరామ ఆత్మ పాత్ర 'యెవ్వరే నీవు?' అని కూడా అడిగాడు. ఆ పద్యం చదవండి.

మ॥ మరి ని మాటలు నూహచేసినను సా-మాన్యార్థముల్గావు ని
ర్భర దివ్యార్థములై కనంబడెడు 'న-వ్వాయెవ్వరే నీవు?' నీ
పరమోదార ఫలానుభూతిని శ్రమ-ల్బాసెన్ మరేనింక నె
వరనంచాడెద వీవు నాశ్వయుజనం - బంధాంబుధాంతాలకా! 358

మొదటి ప్రశ్నకావిడ తన వివరాలు చెప్పటం మనం పైన గ్రహించే ఉన్నాం. ఇంక శ్రీరామ ఆత్మ యెవ్వరనుకుంటోందో తేలాలి. అందుకావిడ చెట్టునంజిలుక ల్పూర్వగా జెప్పిన వేదాల్లోని మాటకు నీవర్థమైన వాడవనే సూచనగా అజపాక్షర శబ్ద తరంగ సాంద్రతవల్ల ఉదయించిన మూర్తి వేఁ దేవతల ప్రార్థనలవల్ల ఈ అవతారం) ఇలా వచ్చావని తెలుసుకొన్నాను లేవయ్యా అంది. జవంనుండి రూప పరిణామ విషయం ముందే మనం గ్రహించిఉన్నాం. అక్కడే ఈ 362 పద్యాన్ని నిక్షేపించుకొన్నాం.)



# కల్పవృక్షంలోశబరి-శ్రీరామచంద్రుడు

## 4

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సహజ చమత్కారం (పరిహాసశీలం) తో శ్రీరామ ఆత్మ పాత్రకు జీవసీతా విరహబాధ జీవశబరి పాత్ర పరిచయంతో దిలగిందన్న రహస్యాన్ని జ్ఞాతృ-జ్ఞేయపరంగా సమంజసమే అని సదవగాహన చేసికొన్నాం. బాగానేఉంది. మళ్ళీ అలాంటి చమత్కారంతోనే జీవశబరియొక్క మునివిరహాన్ని శ్రీరామ ఆత్మ పాత్ర సేవలో తొలగిందనిపిస్తాడాయన. అది ఎలా అవగాహన చేసుకోవాలో! ముందా పద్యం చదవండి.

మ. కరమేకారిన చేవయై మునివియో-గక్లేశమీ నీలసుం
దరమేఘాకృతిసేవఁ బాసితి దా - తా సుందరాపాంగ మం
థర విద్యుజ్జలదాభి రామ తను-నాదైవంబగున్ మౌని త
త్పరమంబైనను జాజ్ఞచేసితివి భవ-త్ప్రావృట్కృపావృష్టిచే 360

నాకు దైవ సమానుడై కడకన్నులతో వక్రోక్తి (మంథరే మందే పృథౌవక్రే చవాచ్యవత్" అని విశ్వకోశం) మాట మెఱుపున్న మేఘంవంటి శరీరంగల మతంగముని సేవకు ప్రతిగా మీ సుందర నీల మేఘ శరీరాన్ని సేవించి (సన్నిచట నియమించిపోయిన) మహాప్రసాదమైన మునియాజ్ఞను నీ సకాల (వర్షర్తు) దయా (ఆగమన) వర్షంవల్ల మరీ ఏకుమాదిరిగా ఆర్చి వేసిన ముని విరహం-అసన్నిధానం) వేదనను పోగొట్టుకొన్నానయ్యాఅంది ఆవిడ. దీని అవగాహనకోసం మనం జీవశబరీ – (కాదు క్షేత్రజ్ఞ శబరీ) మతంగ మహర్షుల ఆధ్యాత్మికాను బంధం కనుగొనవలసిఉంది చూద్దాం:

మనం ఇదివరలో మతంగ మహర్షిని 'హంస'గా గ్రహిస్తే చాలదనుకున్నాం. [పుట 51] ఆయన ఆధ్యాత్మికతత్త్వానికది నప్పేదికాకపోయినా, దాని ప్రయోగమాహాత్మ్యమే ఆముని వనమంతా ఆవరించి ఆశ్చర్యపరుస్తూన్నది. గనుక ఇప్పుడు మనం ఆ హంసను గూర్చిన అవగాహన చేసుకోవలసినఆవరం ఉంది.

జీవశబరీ వృత్తాంతపరంగాచూస్తే మతంగ మహర్షి మహాత్మ్యం శిష్య వాత్సల్య విశేషం ప్రధానంగా ప్రదర్శింపబడిందని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఆ మహర్షియొక్క గురుస్థానాన్నే ఎక్కువ పరిగణించటం గమనింపవచ్చు చూడండి. " శ్రీ మతంగ విశేషోజ్జ్వలమౌ మహా మహిమ" (321 లో అది తపో మహిమకాదు.) " అడవిఁజరించు శిష్య జనులంగములం.... మిక్కలి బడలిపోదురటంచు దయాతరంగముల్వాడిచిన యట్టి మౌని.... యడవిని వ్యాప్తమౌ మహిమ... ( 322 వ.ప. ) అన్న రెండు పద్యాల్లోనూ ఆ తర్వాతి కందంలో ప్రాకటముని మహిమ రెండుసార్లు ప్రసక్తం అయినా తపశ్శబ్దం లోపించటం గమనింపవచ్చు. కాగా "మునిరాజు శిష్యులందునఁబరిరక్షణామతి" (324) ఆయన గురువుగా శిష్యవాత్సల్యం ప్రధానంగా ప్రకటం అయ్యాడన్నది స్పష్టం. ఆ ముని ఆశ్రమ ప్రాంత సూచన 329 పద్యంలో లక్ష్మణసాక్షి గుర్తించినా తర్వాత అదే జీవశబరి అన్నా (360 లో) అది వేదంబులలోని మాట. చెట్టూ పిట్టాకి కూడా వచ్చేటట్లు వెల్లడింపబడింది. 329 వ పద్య వివరణ సందర్భంగా వేదంలోని ఆ మాట 'ఓం' అనే ప్రణవ (తారక) మని మనం కొంతముందే (పుటలు) గ్రహించే ఉన్నాం. అప్పుడు ఓం- రాం ఏకార్థశాలూ రూపాంతరాలే అని కూడా అనుకొన్నాం. ఎలా లేదన్నా ఆ రెండూ కూడా ముఖోచ్చారణ మందిన వైఖరీ శబ్దరూపాలే. అపుడా ముఖ నిసృత వైఖరీ పూర్వ విషయం మాట ఏమిటి? (ఇక్కడ పరాది చాతుర్విధం ప్రసక్తం కాదు) ఆలోచిస్తే ఆ ప్రణవం అప్పుడు జీవ సహజమై సాగుతుండేదీ హంస అన్న విషయం గమనింపుకి వస్తుంది.

"గమాగమస్థం గమనాది శూన్యం। ఓంకారమేకం రవికోటిదీప్తమ్।
పశ్యన్తి యే సర్వజనాంతరస్థం। హంసాత్మకం తే విరజాభవన్తి ॥

రాకపోకలందుండేదానిని, ఊహలో లేని దానిని (గమనాది శూన్యం అనే దాన్ని గగనాది శూన్యంగా పఠించటం విన్నానుగాని హంస ఆకాశంలా శూన్యంకాదు. కనుక ఉపనిషత్తులో ఎలాఉన్నదాన్నలా వివరించుకొంటున్నాం) ఊహలో లేకపోవటం అంటే ఆ హంస రాకపోకల గమనింపు లేనిదని భావం. కోటి సూర్యుల కాంతి గలదానిని. జనులందరిలోనూ నెలకొని ఉన్నదానిని, ఓంకారాక్షరం ఒక్కటిగా పరిణమించేదానిని ఆ హంస ఆత్మకమైనదాన్ని ఎవరు గ్రహిస్తారో వారు రజస్తమో గుణ విముక్తులై సత్యమూర్తులు కాగలరని సామవేదీయ ధ్యాన బిందూపనిషత్ 24 మంత్రం ప్రకటిస్తూంది.

దీనినిబట్టి మనం రెండు విషయాలు తెల్సుకోవచ్చు 1. మతంగ మహర్షి సత్యస్వరూపుడయ్యాడనుకుంటే అనుకోవచ్చుగానీ ఆయన'హంస' ఆధ్యాత్మికతత్వంకాదు. 2. హంస అన్న రెండక్షరాలే ఓంకారం అన్న ఒకే అక్షరం అయింది. కాబట్టి హంస ప్రణవాకృతే అన్నమాట.

"జీవత్వం ఘటాకాశ మహాకాశవ ద్వ్యవధాన మస్తి। వ్యవధానవశాదేవ హంసస్సోఽహమితి మన్త్రేణోచ్ఛ్వాస నిశ్శ్వాసవ్యపదేశేన సంధానంకరోతి। ఏవం విజ్ఞాయ శరీరాభిమానం త్యజేత్। న శరీరాభిమానీ భవతి సఏవ బ్రహ్మేత్యుచ్యతే". (అథర్వణీయ నారద పరివ్రాజకోపనిషత్, షష్ఠోపదేశః). ఇందులో జీవబ్రహ్మతత్వ విభాగం స్థూలమైంది. సూక్ష్మ విభాగ వివేకం వేరే ఉంది. ప్రస్తుతానికి స్థూల విభాగం చాలు. ఆ వివరం జీవత్వం అనేది కుండలోని ఖాళీ ప్రదేశం. బ్రహ్మత్వం అనేది బయటి ఖాళీ ప్రదేశం ఈ రెండు ఖాళీల వ్యవధానం అంటే అడ్డుగోడ కుండ. అదే మన శరీరం. ఆ వ్యవధానాన్ని తొలగించి, శరీరంలోని జీవత్వపు ఖాళీని బయటి బ్రహ్మత్వపు ఖాళీలోకి అలా బ్రహ్మత్వపు ఖాళీని బయటినుంచి శరీరంలోని జీవత్వపు ఖాళీలోకి కలుపుతూ అంటే జీవత్వాన్నలా శుద్ధి

చేస్తూ హంసః-సోఽహంఅనే మంత్రంచేత గాలి వదలటమూ పీల్చటమూ ద్వారా లోబయళ్లకు అదే జీవబ్రహ్మలకు ఓ అనుబంధం చేకూరుస్తుంది. అదే (ముఖ్యం ఎప్పటికైనా అని) తెలిసి అడ్డుగోడలా ఉన్న కుండలాంటి శరీరం మీద అభిమానం వదిలెయ్యాలి. అలాంటి శరీరాభిమాన రహితుడైన జీవుడు బ్రహ్మ అనబడతాడు.

దీన్నిబట్టి జీవుడికీ బ్రహ్మకీ శరీరాభిమానం అనే తెర అడ్డుగా ఉందనీ ముఖ్యంగా అందుకు ప్రత్యక్షంగా ఉన్న శరీరం అడ్డమే అయినా హంసస్సోఽహం మంత్రం వల్ల ఆ జీవబ్రహ్మల అనుబంధం ఊపిరి రూపంలో కడదాకా సాగుతూనే ఉంటుందని తెలిసింది

ఇక్కడో మాట హంసమంత్రజప పరాయణుడుహంసే ఔతాడని యాజుషీయ బ్రహ్మోపనిషత్తు" అనాహత ధ్వనియుతం హంస యోవేద హృద్గతమ్। స్వప్రకాశ చిదానందం సహంస ఇతిగీయతే" అని హంసటత త్వంకూడా అని సూచించింది. అనాహతస్థానం హృదయమే. కనుక హృదయస్థానంలో స్వప్రకాశ లక్షణమూ చిదానంద వ్యవహారమూ కలదైన ఈ హంసనెవరైతే తెలుసుకుంటాడో అతడు 'హంస' అని చెప్పబడతాడు. అలా హంస ఔతాడనేభావంతో మతం మహర్షి ఆధ్యాత్మిక స్థానం గుర్తించటం జీవశబరీ శ్రీరామ ఆత్మల అనుసంధాన కర్తగా హంసతత్వం అనుకోవచ్చునుగానీ మరి శబరి మనసూక్ష్మ విభాగ పరిగణలో జీవసాక్షిల నడిమిదైనక్షేత్రజ్ఞుడేగాని జీవుడుగాదయ్యె, కాబట్టి జీవ దైవ మధ్యస్థస్థాలి విభాగంగా క్షేత్రజ్ఞుడవటంకూడా చాలదన్ని మనం అనుకొనిఉన్నాం ఇప్పుడు మనం ఆ సూక్ష్మ విభాగం తెలుసుకోవలసివచ్చింది. ఆ దారిలోనే వేదాల్లోమాట సూచననుబట్టి హంస దగ్గరకి వచ్చాం. అది ఓంకార ప్రతి ప్రత్తిగలదిగా తారకయోగ్యమై రాకపోకల అనుసంధానం చేసేదిగా గమ

నింపేటప్పుడు ఊపిరిగా ఉచ్ఛ్వాస నిశ్వాస సంబంధం గలదనుకున్నాం కూడా అదిఎలాగో ముందు చూద్దాం.

"హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః
హంసహంసే త్యముం మంత్రం జీవోజపతి సర్వదా॥"

సామవేదీయ యోగచూడామణ్యుపనిషత్.

ఊపిరి బయటకు వదిలేటప్పుడు హకారము (ఆవలింత వచ్చినపుడెవరికి వారే గుర్తింపవచ్చు) లోపలికి పీల్చుకొనేటప్పుడు సకారము (ఆయాసం వచ్చినపుడు గుర్తింపుకు వస్తుంది) వాటి నడుమ నాద అనునాసిక్యం జేరగా హంస పలుకుతుంది. హంస హంస అనే ఈ మంత్రాన్ని జీవులెల్లప్పుడూ తమ గుర్తించిన ప్రయత్నం లేకుండానే జపిస్తూంటాయి. పక్షులూ జీవులే కనుక ఆ జపం సాగుతూండటం అది మతంగ మహర్షి స్ఫుటం అయి స్పష్టంగా తెలిసి పలికేట్టు తన వనంలో వాటికి అలవాటు చేసాడన్నమాట.

అదంతా ఓం-రాం వైఖరీ రూపాలకి పూర్వ వ్యవహారం. కాని స్ఫుటం అయి స్పష్టపరిస్తే అదీ వైఖరీ రూపానికివచ్చి హంస మంత్రంగా వ్యవహారంలోకివచ్చింది. అజపా గాయత్రిగా పేరు పొందింది. అది తారకం అయ్యి మోక్షం ఇస్తుందనటమేకాదు. దానికింకేమీ సాటికావన్నాయి. ఉపనిషత్తులు.

"హంస హంస వదేద్వాక్యం ప్రాణినాం దేహమాశ్రితః
స ప్రాణాపానయోర్గ్రంధి రజపేత్యభి ధీయతే॥"

హంస హంస అనే పలుకు ప్రాణుల దేహాన్నాశ్రయించి ఉంది అది ప్రాణాపానములనే వాయువులు కలిసే గ్రంధి స్థానంలో అజపా అనబడు

తుంది. అంది యజుర్వేదీయ బ్రహ్మోపనిషత్. ఆ గ్రంధి స్థానం పట్టు కోవటం మనలాంటివాళ్లకష్టం, ఆ బాధ లేకుండా యోగ చూడామణ్యు పనిషత్.

"జాగ్రన్నేత్రద్వయోర్మధ్యే హంస ఏవ ప్రకాశతే

జాగృతుని రెండు కళ్ళ మధ్యా హంసయే ప్రకాశిస్తుంది. అని స్పష్టం చేసింది.

"అజపానామ గాయత్రీ యోగినాం మోక దా సదా।
అనయాసదృశీ విద్యా అనయా సదృశో జపః
అనయా సదృశం జ్ఞానం నభూతో నభవిష్యతి"

అని యోగుల కజపా గాయత్రి ఎల్లపుడూ మోక్షం ఇస్తుంది, దానిలాంటి విద్యా, దానిలాంటి జపం, దానిలాంటి జ్ఞానం పూర్వం లేదు, ముందు కాలంలో సంభవించదు. గా వర్ణించింది ధ్యానబిందూ పనిషత్ 63 బాగానే ఉంది.

"హంస విద్యామిమాం లబ్ధ్వా గురు శుశ్రూష యా నరః।
ఆత్మాన మాత్మనా సాక్షాద్బ్రహ్మ బుద్ధ్వా సునిశ్చలమ్॥"

గురు శుశ్రూషవల్ల ఈ హంసవిద్య సాధించినవాడు తనంతట తానే బ్రహ్మ తత్త్వప్రబుద్ధుడౌతాడు. అంది బ్రహ్మవిద్యోపనిషత్ 29. అదిగో అక్కడ దొరుకుతాడులాఉంది. మతంగ మహర్షి చూద్దా.

'దేహ జాత్యాది సంబంధాన్ వర్ణాశ్రమ సమన్వితాన్
వేదశాస్త్రాణి చాన్యాని పదపాంసు మవత్యజేత్

గురుభక్తిం సదా కుర్యాత్ శ్రే యసే భూయసేనరః" బ్ర.వి. 30
అలాంటివాడు దేహ ధర్మబంధమూ, వర్ణాశ్రమాది బంధమే కాదు వేద శాస్త్రాలనీ ఇంకా ఎలాంటిదైనా ఆ బంధాన్ని కూడ కాలి దుమ్ముకి మళ్ళే వదిలివేయవచ్చు కాని గురుభక్తి ఎల్లప్పుడూ చేస్తూ ఉండాలి. అది నరుడికి మళ్ళీ మళ్ళీ శ్రేయం కలుగజేస్తూనే ఉంటుంది. బహుశః శబరి ఇక్కడి దౌతుంది.

ఇక్కడ వేదములలో మాట హంస (దాని పరిణామాల ఓం గానీ రాం గానీ. మంత్రం స్థావరజంగమ భేదం లేకుండా వనమంతా గొంతెత్తి పలికేటట్లు ప్రసాదించిన ఉత్తమ గురువు మతంగ మహర్షి. వర్ణాశ్రమ ధర్మప్రసక్తి లేకుండా బ్రహ్మప్రాప్తికలిగించే దాగురూపదేశం. (ప్రసన్నుడనే తన కుమారునికి ధర్మవ్యాధుని కుమార్తెకూ వివాహం జరిపించిన మతంగమునే ఈయనేమో!) ఆ గురూపదేశం ఆజ్ఞానువర్తనగా పాటించి పదుమూడేళ్ళు నిరీక్షించి సాఫల్యం అందుకొనే స్థితికి వచ్చింది శబరి. అంతవరకూ మనకు హంస విషయక పరిజ్ఞానం సందర్భావగాహనకుపకరించింది అంటే అది జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయత్రిపుటిలో నడిమి జ్ఞానస్థానీయ అహంస విద్య.

ఉల్కా హస్తో యథాలోకే ద్రవ్యమాలోక్యతాం త్యజేత్ ।
జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్ ॥

(ఉల్కా - అజ్వాలాసా అగ్నిరుల్కా : మంటలేని నిప్పు. అని గురుబాల ప్రబోధిక. శబ్దరత్నాకరం ఈ అర్థంతోపాటు భస్మము (నుసిభావంలో) "అని కొందరు" అని ఇచ్చింది. రెండూ శ్లోక ప్రకరణానికి నప్పవు. భస్మముఆనికాక (అది భస్మకముగాని అయిఉంటేదానికి) వెండి అనే అర్థం. ధనంగా నాణెమై వస్తువినిమయానికుపయోగిస్తుంది. అయితే శ్లోకపకరణార్థము ఔతుంది. కనుక దాన్నిస్వీకరిద్దాము] ధాన్యాదిద్రవ్యం

కొనడానికి చేతిలో ఉల్కా (రౌప్య) నాణెముంచుకొని విఫణికి వెళ్ళినవాడు ఆ ధాన్యం గైకొని ఈ ఉల్కా (రౌప్య) నాణెం (వ్యాపారికి ఇచ్చివేసినట్లు) వదలివేసినట్లు జ్ఞానంచేత జ్ఞేయం గుర్తించుకొన్న వెంటనే ఆ వెనుకటి జ్ఞానాన్ని వదలివెయ్యాలి (ఉల్కా అన్నది కాగడాగా కొందరు దాని వెలుగున ద్రవ్యం గ్రహించి ఆతర్వాత కాగడావదలివేసినట్లంటారు.)

సరిగ్గా అలాంటి జ్ఞానస్వరూపుడైన మతంగ మహర్షినుండి ఆయన ఆశ్రమంలోని స్థావరజంగమ జీవులన్నీవేదంలో మాటగా ఆయన జ్ఞానాన్ని స్వీకరించి వంటబట్టిం తర్వాత వదలివేశాయన్నట్లు దివికి సాగనంపబడ్డ వాడనిపిస్తుంది. కానీ ఆయన ఇంద్రుడంపిన రథంమీదకదా దివికి వెళ్ళింది! నింద్రుడి ఆహ్వానమేగాని కమ్యులవసరం తీసిపంపి వెయ్యటంగాదు ఆ గౌరవస్థాయిగా మనం మతంగమహర్షి అధ్యాత్మికతత్త్వం ఏదోకనుక్కోవాలి

ఇంతవరకు ఒక క్రమంలో మనం గ్రహించిన ఆధ్యాత్మిక తత్త్వాలు మూడు. 1) జీవుడు-సీత 2) క్షేత్రజ్ఞుకు-శబరి (ఈమె జీవ-ఆత్మల నడిమి తెర అన్నది స్థూల విభాగమే కానీ సూక్ష్మవిభాగం వేరే ఉందని అనుకొనే ఉన్నాం. ఇప్పుడా సూక్ష్మవిభాగానికి వచ్చాం కనుక వెంటనే ఆత్మను చెప్పటంలేదు ) 3) సాక్షి-లక్ష్మణుడు. కాగా శ్రీరామ ఆత్మ ఇటు పరిచయస్థులలోనేగాక అటు అన్యుల మనసులలోనూ మెదలు తూండటంచేత అంతర్యామి (ఒక తత్త్వం) అనుకొంటే (తాత్కాలికమే) అప్పుడు సాక్షికి అంతర్యామికీ నడుమ ఒకతత్త్వం "కూటస్థుడు" అని ఉంది. అది-"సర్వప్రాణి బుద్ధిసాక్ష్యధిష్ఠా నాత్మాస్తి భాసతేచ సకూటస్థః" నోశ్లోపని అంతర్యామిని గూర్చికూడా

కూటస్థాద్యుపహిత భేదానాం స్వరూపలాభేహేతుర్భూత్వామణిగణె సూత్రమివ సర్వక్షేత్రేషుయదానుస్యూతం అంతర్యామయన్ ప్రకాశతేహ్యాత్మాసోంతర్యామీ" (యాజుషీయ సర్వసారోపనిషత్)

ప్రాణులందరిర్లోనూ బుద్ధిగా ఉన్నసాక్షి కధిష్ఠానమైఉండి ప్రకాశించేదిఏది ఉందో అదే కూటస్థుడనే తత్త్వం. ప్రత్యేక విజ్ఞాన శాఖ.

కూటస్థుల భేదరూపాల అంటే వివిధ విజ్ఞాన శాఖలందూ హేతు వాద నిర్ధారమై ముత్యాల్లో సూత్రంలా దేహక్షేత్రాలన్నింటా చొరబడి పైకగ పడని తత్త్వం. అదే అంతర్యామి ఈ ఆధ్యాత్మిక తత్త్వాల సామాజకా న్వయపరం అయిన అవగాహనకి ప్రత్యేకపరిశీలన అవసరం. ఓపికఉంటే అనుబంధంగా చేరుస్తాను. ప్రస్తుతానికి కూటస్థుడిస్థానం ఇటు సాక్షి కీ అటు అంతర్యామికీ నడుమదని గ్రహిస్తేచాలు, అంటే ఏ మాత్రం లోపంఉన్నా సాక్షికి దిగిపోతుంది. కాస్త గుణవంతం అయితే అటు అంతర్యామి గూటి కెక్కుతుంది అనే అభిప్రాయంతో సరిపెట్టుకోవచ్చు మనసందర్భానికి.

ఇంక రంగస్థలంమీద శ్రీరామ ఆత్మపాత్ర తనను గూర్చి శబరి పాత్రను "మరేనింక నెవ్వరనం చాడెదవీవు' (358 ప.) అంటూ ప్రశ్నిం చటం తన అవతారపు గుట్టాయన రట్టు చేయలేదుగదా అన్న అనుమానం అది తీరడానికిదో పరీక్షాప్రశ్న. అందు కావిడ హీరేంద్రమణులు మీరలన్న దమ్ములు వత్తురంచాడి" (359 ప,) తనకు మునిహీరం అనే వజ్రమణి- ముత్యం గావచ్చు- అలాంటివాడొకడూ ఇంద్ర నీలమణి వంటివాడొకడూ అయిన మీ అన్నదమ్ములు వస్తారని చెప్పి ఇంద్రరథం మీద వెళ్ళిపోయా రంది. అందుండి శ్రీరామ ఆత్మ ఆ మునిలో స్థితప్రజ్ఞ సాక్షిని కనుగొన్నాడు జీవ శబరి ఏమో "నాదైవంబగున్ మౌని'' (360 ప ) అని విశ్వాసం ప్రక టించింది. కాని అంతమాత్రాని కాయన అంతర్యామి కెదిగినట్లుగాలేదు. అలాగె సాక్షికి దిగినట్లూకాదు. నిజంగా వనమంతటా వ్యాపించి ఆ ముని నేర్పిన విద్య ఇంకా పాఠం చేయబడడం చూస్తుంటే ఆయన ఉత్తమగురు వనటమే కాకుండా ఆ స్థావర జంగమ ప్రాణులన్నింటి మనసుల్లోనూ అధి ష్ఠానం కలిగి ఉన్నాడని తేలుతూండటంవల్ల ఉపనిషన్నిర్వచనం కూట

స్థుడు అనేది మతంగ మహర్షి ఆధ్యాత్మికతత్త్వస్థాయిగ రూఢి ఔతోంది. అదేరకంగా శ్రీరామ ఆత్మస్థాయి అంతర్యామి అనికూడా రూఢే.

మనం ఇంతగా గుడిగుడి కుంచం ఎందుకు తిరగడం అంటే జీవశబరి తన గురువుగారు తనకోసం పైలోకంలో ఎదురు చూస్తూంటారు, నేనింక విలంబనం ఓర్వలేను, వెళ్ళటానికి అనుజ్ఞ యిమ్మందిగదా! అప్పుడా జీవశబరితో శ్రీరామఆత్మ "నీకు మౌనిమీద - నీ మీద నాకును/ వలపుంబొంతనములు పలు విధములు," (363 ప.) అంటాడే ఈ ముగుళ్ళ రహస్యం తెలియట్యానికది అవసరం.

ఒక్కసారి రంగస్థల మీద పాత్రల తత్త్వ స్వభావాలు పరిశీలిస్తే లక్ష్మణసాక్షి విషయంలో తక్కిన రెండు పాత్రల నిర్లక్ష్యమే (అదీ ఉపే క్షయే) తగుననుకొన్నాం. కాబట్టి ఆ (ఒక) పాత్ర విషయం తేలిపోయింది. ఇంకేముందిలే రెండే అనుకొనేటంతలో పరోక్షప్రసక్తిగా మతంగముని పాత్ర కూడా తెలుసుకోవలసివచ్చింది అలాంటప్పుడు ఏదో జీవ-క్షేత్రజ్ఞఆత్మలనే స్థూల విభాగం ఎలా పనికివస్తుంది. అసలు సీతారామలక్ష్మణులతో కలిసి పాత్రలు అయిదయ్యాయి, ఇప్పుడు వాటిక్రమం : 1 జీవ 2 క్షేత్రజ్ఞ 3 సాక్షి 4 కూటస్థ 5 అంతర్యాములు వరుసగా సీతాశబరి లక్ష్మణ మతంగ శ్రీరామ పాత్రల్లో కనుక్కోవాలి.

ఇప్పుడు కడపటి అంతర్యామి అంటే మామూలుగా అందరి లోనూ లోనవర్తించటంగా అయితే ఆ అందరి వ్యవహార ఆదర్శజీవ శరీరం గదా! కాబట్టి జీవపాత్రయందు అంతర్యామి అశ పాటమరించటం (అభి మానం ప్రసరించటం) సహజం. మరి ఆ జీవపాత్ర అపవర్గ ప్రముఖ కామనాయకవశం అయి తాత్కాలికంగానే అయినా ఆదర్శ అంతర్యామిని పొమ్మంటే ఆ దగ్గరలోని క్షేత్రజ్ఞపాత్ర తాత్కాలికంగా జీవపాత్ర నటింప రాగా - శ్రీరామ ఆత్మ పాత్ర లోటు భర్తీఅయింది, ఆదర్శం నశించలేదన్న

అభిమానంతో) నీమీద నాకు వలపు పొంతనం అంటే అది అప్పటి ఆధ్యాత్మిక సత్యం.

ఇంక కూటస్థ పాత్ర (ప్రత్యేక వైజ్ఞానిక శాఖ) శిష్య జనరక్షణ (ఆదర్శ పాలనకు వేరే మార్గం) దీర్ఘకాల దీప్తంచేసి భవిష్యన్నిర్ణయం శ్రీరామ ఆత్మపాత్ర (ఆదర్శ సాఫల్య నిదర్శనం) కోసం ముందు నిరీక్షణ చేసి (సిద్ధించిన) అనంతరం స్వాగత నత్కారమన్న సదాచరణం (తన గురువందించిన (ప్రత్యేక విజ్ఞాన శాఖా ఫలాలు సమర్పించటం) గా శబరి క్షేత్రజ్ఞుని జాగృతం చేస్తూ అంతర్యామిగా మతంగమునే ఉన్నాడు. అంటే అయన (ప్రత్యేక విజ్ఞానశాఖ అదర్శంలోనే విలీనమయ్యిందిగా) శ్రీ రామ పాత్ర (అంతర్యామి) అభిమానం కలవాడై కార్యాచరణయందు పరిచారిక (శబరి) శరీరంలో ఉన్నాడు (అందుకే మనం వెనుక శ్రీరామ ఆత్మపాత్ర అయనలో క్షేత్రజ్ఞుడినే చూస్తూన్నాడనీ అది క్రింది మెట్టుకి దిగటంకాదనీ చెప్పుకొన్నాం) అయితే ఇక్కడ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వలపు పొంతనాలు పలు విధాలంటూ ఒక్క రెండే ప్రస్తావించటం, ముఖ్యంగా మునికి తనయందున్న (తరవాత పద్యం సూచనగా ఉన్నా) వలపు పొంతనం సామాన్య దృష్టికి (శ్రీరామ ఆత్మ స్వయం ప్రకటనలో) రానియ్యలేకపోవటం అన్యాయం,

తర్వాత శబరిపాత్ర క్షేత్రజ్ఞుడుగా పై మెట్టుగా వెంటనే ఉన్న సాక్షియందభిమానం కలదిగావాలి. అయితే శబరి పాత్రది జ్ఞానమార్గం కాదు భక్తి మార్గం దానికి నమ్మకం ముఖ్యం. ఆ నమ్మకం గురుమతంగమహర్షి (కూటస్థుని) యందు కుదిరింది (భక్తి అయినా అజ్ఞానంలో పడి కొట్టుకోవాలని లేదు, స్మృతి తప్పుతుంది అంతే, జ్ఞాన మార్గంలోని

సాక్షి ఆశ్రయం ఎలాగూ తప్పదు అది ముని మాహాత్మ్యానికి గల సాక్ష్యం గా వన వ్యాప్తిసంజ్ఞ ఉందని గుర్తించాలి. ఆ తరహాలోనే మహాత్ములు కొందరలా మహిమలు ప్రదర్శిస్తూంటారు) కాబట్టి క్షేత్రజ్ఞుడు కూటస్థుని యందు నేరుగా అభిమానం కలిగి ఉండటం ఏమీ అసహజంకాదు. అదీ "నీకుమౌని మీద నీ మీదనాకును/వలపుఁబొంతనములు పలు విధములు" (363 ప) అని శ్రీ రామపాత్ర అనటం విడ్డూరం అనుకోవలసిందేమీ కాదు శబరి పాత్ర సమాధానంలో అది ముచ్చటగా వెల్లడౌతుంది.

ఆ. వె. శబరి యిట్టులనియె - జలధికి గౌతమి
మీఁదనెంతో శబరి-మీఁదనంతె
జలధిరాజు భర్త - శబరి లజ్జావతి
గోడ వెనుక దాగి - కొనియెపొందు 364

నాకు మునిమీద మనసని నీకు అనుమానం ఎందుకయ్యా! నేనా ముని వెనుక జేరితే ఆయనకెలాగూ నీ మీదే అభిమానం (క్రిందటి పద్యం లో స్పష్టంగా ప్రస్తావించవలసింది,) ఆ అభిమానం వెనుక నా మనసూ నీదే కాదుటయ్యా! అంటూ ఉపనదీ-నదీ-సాగరసంబంధం సమర్థనీయం గా వెల్లడించింది గోదావరి నది— మునికీ, శబరి ఉపనది— స్వయంగా తనకూ, సాగరం —శ్రీరామ ఆత్మకూ సమర్థనీయాలు. ఆ అనుబంధం ఓ ప్రబంధస్వారస్యంచేసిచెప్పింది. సాగరం జలధుల రాజు-భర్త ఆయన పెద్దభార్య గోదావరి నది. కొత్తచిన్నది శబరి, కొంచెం సిగ్గరి. (భర్తనుచేరటం మానదు) ఆ పెద్దభార్య అండను తక్కుతూ తారుతూ మెలమెల్లగా సందిట చేరుతుంది. అదీ అర్థాంతరన్యాసం, ఎంత స్వారస్యమో! అది శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి మెఱపు పొంతనం,

ఏమిటీ శ్రీ విశ్వనాధ వారిదే ఈ ఆధ్యాత్మిక వ్యవస్థా కల్పనమంతా అన్నట్లు వ్రాస్తున్నారు. అది మూల రామాయణంలోదే కదా అంటే కాదని నిరూపించే అవసరమూ అసలు ఆ అభిప్రాయమే నాకు లేదు ఒక విషయం. మూలంలో ఉన్నది చెడగొట్టకపోవటం మాత్రం గొప్ప కాదా! మరో విషయం మన్మథాది వికారకల్పనలు చేసికూడా ఆధ్యాత్మిక సూత్రం తెగకుండా కాపాడటం ఎంతగొప్ప! ఇంకోటి. మతంగముని ప్రత్యేక వ్యక్తిత్వం శ్రీ సత్యనారాయణగారే వెలికి తీసి కూటస్థ ఆధ్యాత్మిక స్థాయిని మన కళ్ళకు జేయటం ఆయన ఘనత కాదా! మూలంలో అంతా ఆయన శిష్య వర్గం పేరు మీదుగా నడచింది, చదవండి కబంధుడు శ్రీరామునికిచెప్తున్నాడు,

"మతంగ శిష్యాస్తత్రాసన్ ఋషయస్సుసమాహితాః" 23 శ్లో॥

అక్కడ మంచి సమాహిత బుద్ధులైన ఋషులు మతంగ మహాముని శిష్యులున్నారు

"తేషాంగతానా మద్యాపి దృశ్యతే పరిచారిణీ
శ్రమణీ శబరీ నామ కాకుత్స్థ చిరజీవినీ" శ్లో ॥ 25

వాళ్ళందరూ (మాతంగ శిష్యగణం) దివినలంకరించారు; కాని రామా! (వాళ్ళ) పరి చర్య చేసే సన్యాసస్త్రి శబరి పేరుగల చిరజీవి ఇంకా ధర్మ నియురాలై ఉంది. ఇలా 73వ సర్గ విషయంగా ఉందిమరి. ఇపుడూ 4వసర్గలో శబరి మాటలు చదవండి

చిత్రకూటం త్వయిప్రాప్తే విమానైరతులప్రభైః!
ఇతస్తేదివమారూఢా యానహంపర్యచారిషమ్॥ 14

నీవు చిత్రకూటం చేరినప్పుడే నాసపర్యలనందుకుంటూండే వారు (మతంగ శిష్యగణం) ప్రకాశవంతమైన విమానాలెక్కి దివం చేరారు.

త్రైశ్చాహముక్తా ధర్మజ్ఞైః మహా భాగైః మహర్షిభిః 15
నాతో అధర్మం తెలిసిన వారూ, మహాభాగులూ అయిన మహర్షులన్నారు.

ఇలా ఎక్కడ చూచినా బహువచనంలో ఉండే శిష్యగణ ప్రసక్తి వదలి ఏకవచనంగా మతంగ మునినే పేరెత్తి ప్రస్తావించటం శ్రీ సత్య నారాయణగారు కావాలనే చేసారు. ఎందుకని! మూలంలోనే ఉ దనుకొనే ఆధ్యాత్మిక వ్యవస్థను స్ఫుటంగా ప్రదర్శించటానికనైనా ఒప్పుకు తీరాలి.

ఆ మహాకవి ఆత్మ దర్శ్యాన్ని లో చూపుగలవారు గ్రహించి ఆనం దిస్తే ఈగురు... దైవ—జీవ ముగ్గుళ్ళ వలపు పాలుపుకి తక్కినవాళ్ళానం దిస్తారు. ఇది నన్నయ్యగారి యందభిమానంగల శ్రీ విశ్వనాథ సత్య నారాయణగారు ఆయన కథాకవితార్థయుక్తిని తన రచనా ప్రణాళికలోకి తీసుకొన్నాడలా! అలాగే పెద్దన్నగారి యందభిమానంతో అనుక్రమమైన వలపు పాలుపు (గంధర్వ—వరూథినీ—ప్రవరుల తీరు శ్రీరామ — శబరి ....మాతంగమునులు) గ తన క ల్ప నా ప్రణాళికలోకి తీసుకొన్నాడు' కాళిదాస, నన్నెచోడ కవిరాజ శిఖామణి శ్రీనాథ వల్లభరాయలుల యందలి అభిమానంగావచ్చు పెడమరల త్రిప్పి శివమనసిజుడు కాంతా విరహజుడు ని విష్ణ్వవతార రాముని యెడద శబరిని చూచుకోర్కె తారాడ పుష్పబాణ ప్రహరంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణదే అనిపించే అభూత కల్పన చేసాడు. తెనాలి రామకృష్ణుని యందలి అభిమానంతో ఆయన పరిహాస శీలం స్వంతం జేసుకొన్నాడు ఇన్ని చేసి కూడా అధ్యాత్మిక వ్యవస్థకే ప్రమాదమూ రాకుండా జాగ్రత్త పడ్డాడు అస్తోమత ఆయన స్వంతం. మరినేనదేగా వ్రాసాను.

ఏమిటండీ మీరు మొదట్లో శ్రీవిశ్వనాథవారికి ఏదోధిషణాహంకారం అంటూ ప్రారంభించి ఇప్పుడిలా... ఔనండి నేనిప్పుడే చెప్పాను నేనేమి

వెక్కిరించటానికొక్కదిది వ్రాసేది అనీ. కావాలంటే మరోసారి తిరగవేసి చదివి చూడండి. ఆయనే ఘనంగా చెప్పుకొన్నధిషణాహంకారాన్ని ఎత్తి చూపానంతే.

అయితే కవులకిది తగునా అంటే మాత్రం కచ్చితంగా తగదనే చెప్తాము, మరి దానివల్ల ఈ కల్పవృక్షంలో శబరీ శ్రీ రాముల అవగాహన కేమైనా ఇబ్బంది కలిగిందా అంటే ఆ వివరాలకోసం కాదీ విగ్రహవిమర్శ· అయినా ఆయా సందర్భాల్లో మొగమోటమూ అల్లాగే మర్యాదాభంగమూ లేకుండానే బయట పెట్టాను. ఉదాహరణకు మతంగ విశేషోజ్జ్వల మహా మహిమకు మూలమైన – పూలదండల ప్రసక్తివచ్చిన 321 & 322 పద్యాల తాత్పర్యానికి వాల్మీకి నాశ్రయించాలని ఆ రెండు శ్లోకాలను (పుట 18) అందించాను,

ఒక వేళ మర్యాద మీరి ఏమైనా ఓ అడుగు పడితే అది మరోలా సమర్థించటానికే. దానివల్ల ఆప్రకరణ విశేషం పరిధి పెంచి అధిక గౌరవం కల్పించటానికే. ఉదాహరణకు 'అల్లొక నగంబు' 309వ పద్యం వివరిస్తూ ధిషణాహంకారం ఎలా బయటపడుతుంది? అనీ వాల్మీకిని 'నేనాయనతో చావనా అన్నాడీయన తక్కువేముంది? అంటూనే ఎన్నోవిధాల తదౌన్నత్యాన్ని స్థాపించానో కావాలంటే మళ్ళీ ఓసారి చదివి చూడండి, (పుట 14 నుంచి)

అయితే కవికి ఉండకూడదన్న ధిషణాహంకార విషయంగా ఇందులో ఏమీ పెద్దగా లేనట్లేనా అంటే ఒకటి మాత్రం ప్రస్తావిస్తాను, ఇంతకు ముందు మతంగముని మహిమకు చెందిన పద్యాల మాట తల పెట్టాముగదా! అవి చూడండి, సందర్భాన్ని కతకని, మనకా పూలదండలు

చెండులో తోరణాలో అసలెక్క డెలాఉన్నాయో తెలియనీయని తుంపుల్లా ఉంటాయి, అలాంటి వాటినిగూర్చే ఈ జరాసంధ సంయోజన చేసుకొనే వాళ్ళెవరుంటారన్నానుకూడా, అలా సంయోజన చేసుకొంటే బాగుంటుం దన్న ప్రస్తావనే అది, అయితే ఆ తుంపులు చేసిపెట్టిన గుణం ఎక్కడో చంద్రచంద్రికల్లా సహృద యాహ్లాదకరంగా వెలయించింది. ధిషణ-మరి అలాటి కూర్పుకు నోచుకోక ముక్కలుచేసి పాఠకులను గందరగోళపరచింది అహంకారం. ఈ రెండూ ఒకేచోట (వ్యక్తిలో) సమావేశం అయినందువల్ల వచ్చింది ధిషణాహంకారం. ఆయనే అన్నాడు నేనూ చెప్పాను. ధిషణతో కూడిన అహంకారం ఉండదు. ఉంటే అది సమర్థనీయంకాదు. ఎలా ! శబరీ శ్రీరామ సంభాషణలో ఈ క్రింది గీత పద్యం చదవండి.

గీ॥ అవ్వ ! నీకిట్లు తీవ్రవ్ర-తాభిషంగ
మునను ప్రాణాలు గూళ్లు వ-ట్టిన వనంగ
ప్రభువ ! నీయింత తీవ్ర ద-యాభిషంగ
మునను ప్రాణమ్ము గూటఁజే-రినదటంచు 357

పద్యం ఎంత తెలుగు వెలుగు చిమ్ముతోంతో దూసారా ! చక్కని తెలుగు జాతీయపు తీపి పలుకుబడులు "ప్రాణాలు గూళ్ళు వట్టు" "ప్రాణము గూటఁజేరు" అని. మరి ఈతేట తెనుగు పానకంలో "అభిషంగ" అంటా రెండు ములుకులుదేరి ఎట్టైనా గుచ్చుకొనే బలమైన పుల్లలు వేయటం ఏమిటి చెప్పండి. చూసిన వాళ్ళం వాటిని తీసేసే తాగుతాం తక్కిన సామాన్య జనం మాటేమిటి ? మామూలు ఉపాధ్యాయుడు పాఠం చెప్ప వలసివస్తే అసలు తాత్పర్యం అమరవద్దా! నేనది వివరించేటప్పుడు ప్రకర ణార్థం పట్టుపట్టి సరిపెట్టి వ్రాసానుగానీ అసలు ఆ "అభిషంగ" శబ్దాని కర్థం ఏమిటి ?

"అభిషంగస్తు శపథేస్యాదాక్రోశే పరాభవే" అంది విశ్వకోశం. తెలుగుని ఘంటావు శబ్దరత్నాకరం : 1) అవమానము 2) ఒట్టు 3) తిట్టు అంది ఇంక అమరమూ దాని వ్యాఖ్యగురుబాల ప్రబోధికా పట్టుకుంటే తృతీయ కాండ నానార్థవర్గు 180 వ శ్లోకంలో -

"శాపే త్వభిషంగః పరాభవే". (ఎక్కడికివెళ్లినా పరాభవం తప్ప కుండా ఉంది.) పద్యప్రకరణానికేమన్నా కుదురుతుందేమో అన్న విశ్వ కోశం ఇచ్చిన శపథం అనే అర్థాన్ని అమరం వదలివేసింది. సరే ఆ ఉన్న దానికే గురుబాల్ల ప్రబోధిక వివరణ-

"అభిషంగ శబ్దము శాపమునకు తిరస్కారమునకును పేరు. శాపమనగా నపకారి కనిష్టమును జెప్పుట. లేనిఅపవాదమని కొందఱు. అభిషజ్యత, ఇత్యభిషంగః షంజసంగే "పొందబడునది" ఆక్రోశే శపథేపిసాచత్ అభిషంగః పరాభీవః ఇతిరుద్రః" అని ఉంది.

పూర్తిశబ్ద వ్యవహారమున్న అర్థాలు వదలి ధాతువు 'షంజ-సంగే' అన్నదాన్నుంచి నిష్పన్నమైన వ్యుత్పత్తిగా 'పొందబడునది' అని ఉన్నదా న్నందుకొని తీవ్రవ్రతాభిషంగము అని తీవ్రవత కూడిన వ్రతంచేతే అయినా దయచేతే అయినా పొందబడినవిగా చెప్పుకుంటార్లెమ్మని ప్రయోగిస్తే భాష ఏమైపోవాలి? 'అభిపూర్వశ్శాపే' అని తెలిసిన నిఘంటువులన్నీ ఆక్రోశ శపథశాప అవమానాలని అర్థనిర్ణయం చేసి అందిస్తుంటే అదేమో పట్టించు కోనక్కర్లేదని దూసుకు వెళ్ళిపోవటం-ధిషణాహంకారం శబ్దగౌరవాన్నతిక్ర మించింది. అహంకార స్పర్శలేని ధిషణ అలా ఎప్పుడూ చెయ్యదు. మాట వరసకి ఆయన మీద నేనెలాగో ఓ గీతం అల్లి అందులో

'అందుకొనుము మా వచనతీ - వ్రాభిషంగ' యుక్తులన్నామను కోండి- ఇంకేమన్నా ఉందా! వినీవినగానే మీదపడి కరిచేసినంత పనిచేస్తారు.

అంటే అసలు విషయం ఆయనకు తెలుసు. (ఇలా అనుకోవటాల మీద నిర్ణయం ప్రకటించకూడదనుకోండి. అయినా విశ్వాసంమీద నమ్మి వ్రాసాను ఒప్పుదల కాకుంటే వదిలెయ్యండి.) అయినా వ్రాసాడు. గమత్తేమిటంటే చక్కగా 1) అభిరుచి 2) ఆత్యాసక్తిగా పద్యం యొక్క ప్రకరణార్థాన్ని సమర్థించే ఓ సమీపశబ్దం (అభిషంగకి) అభిష్వంగ అని ఉంది, ఆ మాటని యథాతథంగా వ్రాస్తేఅందులోఉన్నవావత్తువల్ల గణం చెడుతుంది.అల్లాగే ఓ మాదిరిగా ప్రకరణం సరిపెట్టే అర్థం ఉన్న అనుషంగ శబ్దం ఉంది. గణానికి చేటులేదుగాని మూడోపాదంలో యతికెసరుపెడుతుంది. కనుక ఆ మాటెత్తక ఓస్ నన్నడిగేవాడెవడని ఆ వావత్తు లాగేసి భాషను చిత్తుచేసాడా వస్తాదు. ఇంత సూక్ష్మపరిగణనమూ రూఢీఉన్నదాన్ని మహాకవి ప్రయోగంగా పరిగణించి గ్రాహ్యంఅనటానికేమాత్రమూ సాధ్యంకాదు ఇక్కడకవి నిరంకుశత్వం చెల్లదు. ధిషణాహంకార స్వభావం అలా ఉంటుంది. పేరెత్తక పోవటం గౌరవం, నేనీశబరీ శ్రీరామ సంభావనా వస్తుకభాగం ఎత్తి వ్రాసుకొనేటప్పుడు మొదట్లో ఈప్రయోగం నచ్చక ఈ పద్యం వదలి వేసాను. తర్వాత తాత్త్వికార్థావగతికోసం మరోసారి లైబ్రరీకివెళ్ళి మార్జిన్‌లో వ్రాసుకువచ్చాను, తప్పలేదు; ఆ తత్త్వార్థామృతం వదలుకొలేకపోయాను. అదే సాధ్యమైనంత తేటగా మీకూ పంచాను.



# 5

జీవశబరీ శ్రీరామఆత్మల శృంగారాభాసలిప్తమైన ఆధ్యాత్మిక తత్త్వసంభాషణం అయింది గదా! అది సర్వజగన్నాయకుని చేరటానికి జీవులంతా కాస్త వెనుకముందుల సాగుతూండటం సారాంశంగా అందిస్తుంది. మతంగ మహర్షి భోధనలను అనుసరించటం చేత శ్రీరామఆత్మను (అది దైవాన్నే) చేరుకుంటా ననటాన్ని (అవే అమె ఇంకా పైలోకంలో కూడా ఆ గురు దేవుని సేవచేయబోవటానికాత్ర పడటంలో సూచింపబడింది.) జీవ శబరి ఎంత సరసంగా ప్రకటించిందో గమనించారుగా! అందుకాయన ఒక్కక్షణకాలం తానవతారమూర్తి గా భూతలంమీద అవతరించానన్నమాట పూర్తిగా వదలివేసి సంపూర్ణ అధిదైవికమూర్తి విశ్వనాథునిగా స్మృతినంది 'సరే అముని వెనుకనే (ఆ బోధనామార్గంద్వారానే నన్ను చేరరమ్మని)రా' అని అనుమతించాడు. జ్ఞాన సమంగా భక్తిమార్గాన్ని పరిపూర్ణ హృదయ పూర్వక అదరంతో ఆహ్వానించిన సామ్య లక్షణం ప్రదర్శించాడు, అది శ్రీరామ ఆత్మ అధి దైవిక లక్షణం. అప్పుడాయన వట్టి అంతర్యామి అన్న తత్త్వం కాడు. ఆపై స్థాయి బ్రాహ్మతత్త్వాన్నందుకొన్నాడు, (మనం వెనుక శ్రీరామ ఆత్మ అంతర్యామితత్త్వం తాత్కాలికమే అని ప్రకటించు కొని ఉన్నది ఇందు కోసమే) అదియెంత! ఆ కాస్త మాటా అనేంతవరకే. ఏమైనా బ్రహ్మతత్త్వ ప్రకాశం అంటూ వహించాడుగా. మరి ఆ బ్రహ్మ అంటే ఏమిటి? "సత్యం జ్ఞాన మనంత మానందగ్ం సర్వ శరీరోపాధి వినిర్ముక్తం కటకమకుటాద్యుపాధిరహిత సువర్ణఘన చిన్మాత్ర స్వభావమాత్మ చైతన్యం బ్రహ్మ" (యాజుషీయ సర్వసారోపనిషత్)

ఇందులో మళ్ళీ సత్యమంటే ఏమిటీ, జ్ఞాన మంటే ఏమిటీ, అనంతమంటే ఏమిటీ. ఆనంద మంటే ఏమిటీ. అనే నిర్వచనాలకోసం ప్రయత్నించి తికమకలో పడవద్దు మనం. అవి అలా ఉంచితే చిత్

స్వభావమాత్రమై - అంటే ఈ సత్యజ్ఞాన అనంత ఆనందాల నాల్గింటి సాధారణ లక్షణాలొక్కటిగా విజ్ఞానం ముద్ద గట్టి ఏ స్థావరజంగ మాది స్వరూప (శరీర) వికారాలూ పొందని బంగారం ముద్దలా (అన్నమాట) ఉండే ఆత్మ సారమైన చైతన్యం – అదే బ్రహ్మ

అబ్రహ్మను గ్రహించటానికి మనలో భావుక హృదయం (అంటే నిర్మాణాత్మకమైన సహకార సమభావం గుర్తింపగల హృదయం) ఉండాలి ఆదారిగా మనసు పెంచుకొంటుంటే అదే బ్రహ్మ నందుకుంటుంది జీవ శబరి శ్రీరామ ఆత్మ (బ్రహ్మ) ను చేరటం (ఋషి ననుసరించే అయినా) అంటే అదే. ఇదే సత్యం. ఈ సత్యం తెలియజేసే ఉపాయమే జ్ఞానం. అది అంతులేకుండా వ్యాపించట మనేదే అనంతం. అలాఒక శరీరపు పంజర లో చిక్కుకొన్న మనసు స్వయం సిద్ధోపాయంతో పెరిగి పెద్దదవటం కన్నా ఆనందం అంటూ వేరే ఏముంటుంది? అలా అక్రమంలో కొనసాగే చైతన్య మాత్రమే, (అన్యత్రాకానిదే) నండోయి! చిన్మాత్ర స్వభావ అంటే దానికే బ్రహ్మఅని పేరు. ఎటు వచ్చి అంచెకంచెకోగుర్తింపుగా జీవ-క్షేత్రజ్ఞ-సాక్షి - కూటస్థ - అంతర్యామి - బ్రహ్మ అని వేరువేరుగా పరిగణిస్తూంటాము. అంచెలన్నీ బ్రహ్మవిశేషాలే.

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవతేనగన్తవ్యం బ్రాహ్మ కర్మ సమాధినా" (గీ. అధ్యా

4 శ్లో 24) అని చెప్పిన గీతాచార్య ప్రవచనాని కర్థం ఇదే. ఆ ఉద్దేశ్యం తోటే చందాలూ, ధర్మాలూ స్వీకరించే పెద్దలు బ్రహ్మార్పణమంటూ ఉంటారు. ఇప్పుడా అంచెలందు కోకుండానే అసలది నమ్మకుండా కూడా చందాలు వసూలు చేయటం. అవసరానికి మాట వాడుకోవటం ఎక్కువై పోయాయి, అసలు విషయం ఆ బ్రహ్మకే ఎరుక!

ప్రకరణానికివస్తే ఆయన అలా బ్రహ్మతత్త్వార్థ యుక్తిగా ఒక్క మాట అని వెంటనే యథాప్రకారం శ్రీరామ ఆత్మ పాత్రకు మరలి వచ్చే సాడు. ఆశ్చర్యం ఆయన స్వీయలక్షణం. 'అమ్మోని సుత్రాముడు' అంటే ఆ మునీంద్రుడని-ఆయన అబ్బో "మహత్వప్రాథవారాసి' - అంటే మహి మావిశేషంలో సముద్రం (అంతు తెలియరానంతటివాడు)ట. మరి కబం ధుడు చెప్పాడు (ఆయన్నుచూసే అవకాశంలేదు కనుక) ఆ మునియొక్క మోహనకరమైన ఆశ్రమంలోని అద్భుత విచిత్రాలు (ఐనా) చూడాలని ఆత్రపడుతున్నా నన్నాడు, (365 ప)

సరేనని ఆవిడా చూపించింది. 366 & 367. ఇంకా వివరాలకు పోయి అనాడు ముని పూలతో అలంకరించిన వేదిక చూపించి ఆ పూలు చూడు ఇప్పటికీ వాడిపోకుండా అలాగే ఉన్నాయి, (369 ప) అవిగోపడి యల్లా ఉన్నాయవి సప్తవార్థులు. ఆ ముని యాగరక్షకైవచ్చి ఆ మహర్షి వెళ్ళిపోయినా ఇవి మరలిపోకుండా ఇక్కడున్నాయి. (370 ప) ఈ చెట్ల కొమ్మల బిగించి ఆరేందుకు కట్టిన ఆ మహర్షి వస్త్రాలు రంగు మా యలేదిప్పటికీ. అ కొమ్మలేమీ గాలికూగిసలాడవు, (అవి చిరిగిపోతాయేమో అని. పద్యం 371) అని వివరించింది.

ఆ తరువాత ఆ ముని నా గుండెల్లోవి ఆలోచనల నిండిపోయి, నను విడిచి వెళ్ళిపోయాడు ఇప్పుడలా నువు నా గుండెలనిండిపోయావు. నా ముని ననుసరించిపోవాలనుకొంటున్నాను, అలా నువు దయచూపిస్తే ను స్వర్గంలో పరున్నట్లే. (373 ప) పై లోకంలో మునీ ఈ లోకంలో నువ్వూ ఇప్పుడు నాకు సమానమే. (374 ప.) అసలాయనతో అప్పుడే నేనూ వెళ్ళవలసింది. నీకీ స్వాగత సత్కారాలు చేయటానికి (న్యాయంగా) ముని మహిమ నాచుకొన్న ఇక్కడి చెట్లూ చిలకలే చాలు. నా ధర్మంలో ఏదో లో

పం (పాపం) ముని సంకల్పంలో తోచి అది నీవిలా మానవాకృతిలో రాగా నిన్ను చూడటంతో ఆ లోపం (పాపం) తీరిపోతుందనేది ఆ మహర్షి చేసిన ఉపశాంతి కల్పన ఏమో (375 ప.)

అని అలా తన పాపక్షయ మహిమోపేతుడైన శ్రీరామ ఆత్మపాత్ర యందు ఆ బ్రహ్మ తత్త్వాన్ని గుర్తించి భక్తితో 376 నుంచి 882 పద్యం దాకా ఏడుపద్యాల్లో సంస్తుతించింది, అన్నీ అసాధారణచ్ఛందాలే. మొదటి ద్విపద కాస్త అలవాటులోఉన్నది తరువాత వరుస త్రిపద, చతుష్పద. వితాళ చతుష్పద, కర్ణాట చతుష్పద, పంచపదవితాన ఈ షట్పద. బహుశః జీవ శబరి అగ్నిప్రవేశంచేసి (అలా చేసిందని తేల్చి ఎప్పుడో చెప్పాడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. అయినా అవి స్తోత్రంచేస్తూ అగ్ని ప్రవేశం చేసిందనుకోవచ్చు.) ఆయా పదాల అంచల పైలోకానికి పయనం సాగి స్తున్న స్ఫూర్తికలా ప్రయోగించి ఉండవచ్చు చతుష్పద పుటంచెలో అవి నాలుగుదారుల కూడలిగా ఎటుపోవలసిందీ తెలుసుకోవటానికి కొంచెం తార ట్లాడినట్లు మూడురకాల్లో సూచించి ఆపైనే పంచషట్పదాలకు దాటిపోయిన సూచన అయి ఉండవచ్చు. తరువాత 383 వచనంలో వృద్ధిపొందిన షట్ప ద నినాదం మాట స్మరించటంచూస్తే ఆ భావం సందేహించవలసింది కాక రూఢేఅయింది.

ఇంక ఆ స్తోత్రంలో తాత్పర్యం వివిధ శాస్త్రవిషయాల కలగాపుల గంలా ఉంది. భాషా అందుకు తగ్గట్టే కోమల పుష్ప మహాకోణ గ్రావసమా కులంగా సాగింది. మచ్చుగా మొదటి ద్విపద చదవండి.

ద్విపద. రఘుకులాంబుధి చంద్ర - రాజీవనేత్ర
యఘ విదారణ శీల - యానందమూల
నా ప్రాణనాథ! ..........

అంతవరకే పూలబాట. అక్కడినుంచి ఎలా అడుగుపెట్టినా గుచ్చుకోవటం మానని ములుకుల రాళ్ళబాట చదవండి.

సం-ధ్యా హసన్మల్లి
కా ప్రసూనాను షం-గాపాంగ రంగ
శంకృద్వినిశ్చల-స్వాంతపయోధి

ఇంతవరకూ భాష అయితే ఆపైది భావానికా పలుకురాళ్లబాట.

ఓం నోంకార శేష ప-ర్యంకంబునందు
నిద్దురకానట్టి-నిద్దురవోవు
పెద్దవుపిన్నవై- పేర్చినసామి! (376)

ఓంకార శేష పర్యంకంమీద యోగనిద్ర పోతున్నసామి మహావిష్ణుమూర్తి అనుకోవాలా! 'పిన్నవై పేర్చిన సామి' మఱ్ఱియాకు మీద బాలుడై (బాలం ముకుందమ్ అన్నట్టి) పరున్న బాలదైవాన్నా అదీకాక ఆ మహావిష్ణువు పెద్ద అయితే ఈ అవతారంవల్ల పిన్న యైపేర్చిన వాడనేమో ఏమైనా దురవగాహం గానే ఉంది. ఇలాంటి అవకాశం చిక్కినప్పుడు బమ్మెర పోతనగారి కుంతీ స్తుతి భీష్మస్తుతి పద్యాల్లా సామాన్య పాఠకుల నిత్య పారాయణకుత్సాహం కలిగించేటట్లువ్రాసిఉంటే బాగుండేది. ఏమైనా స్తోత్రంవ్రాసాడు ధన్యుడు ఆ స్తోత్రం అలా ఆయేటప్పటికి.

వ. ఇట్లు శబర్యగ్నిప్రవేశంబుతో వృద్ధిపొందిన షట్పదీ నినాదంబు రాఘవు లాకాశంబున విమాన నిస్వనంబుగా జూచి 383

ఇందులో షట్పదీఅనేది పద్యాలో కడపటిదిగాఉన్నా ద్వి, త్రి, చతుః పంచపదులుకలిపియే అని అర్థం. ఆ పద్యాల స్తోత్ర ధ్వనిబహుశః ఆయన చెప్పకొన్న కావ్య ధ్వనికాని ఏదోధ్వనికొసం స్తోత్రం అలావ్రాశాడేమో మహానుభావుడు) ఆకాశంలో ఆశబరిని తీసుకొనిపోయే విమానధ్వనిగా చూసా

రట. ఆ అన్నదమ్ములు. ఇక్కడ షట్పదికి శ్లేష చూపించి తుమ్మెదలని తీసుకొని - యాగాగ్నిధూమానికి షట్పదులు చేరతాయనీ అలాచేరిన వాటి ఝుంకారం అథ్వని అనీ వ్యాఖ్యానించటం సమంజసంకాదు. ఆహుతి అయింది శబరి దేహం. పురోడాశంకాదు. ఆదేదో మహాసహిమ అంటారా మీయిష్టం. తరువాతి పద్యం చదవండి

> గీ. భూమి పిండను భూతముల్ - వృద్ధి వృద్ధి
> పొందును ద్యులోకమున వృద్ధి - పొంది పుట్టు
> కానిపించుచే శబరియుం - గానిపించె
> దివ్య మాల్యానులేపనా - దినవమూర్తి 384

భూతాలంటే జీవులనే. అవి పుట్టటం భూలోక విధానానికి వ్యతిరేకం ద్యులోకంలో ఇక్కడ వృద్ధిపొందటం కడమెట్టు. అక్కడ అదే తొలిమెట్టుట అయితే అక్కడ కడమెట్టేమిటో తెల్సుకుంటే గాని అసలీ వృద్ధి సంగతి ఏమిటో చెప్పలేము. ద్యులోకం భోగ భూమి. అనుభవించటానికి తగినపుణ్యసమృద్ధిలేకుంటే అందులోకిప్రవేశం లేదు అందుచేత ఆ పుణ్యం వృద్ధే అక్కడి మొదటి మెట్టు ఆ భోగం అనుభవంవల్ల క్షయం ఔతుంది. అప్పుడు "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" ఆక్షీణ పుణ్యంతో భూలోకంలో పుట్టటం ఇక్కడ మొదటి మెట్టు. ఇది కర్మభూమికాబట్టి సత్కర్మలాచరించటం చేత పుణ్య సమృద్ధి కలుగుతుంది. ఆ వృద్ధి కడమెట్టై మళ్ళీ స్వర్గప్రవేశ ప్రథమసోపానం పట్టువడుతుంది అదీ సగం పద్యానికితాత్పర్యం. జీవశబరి పుణ్యం పండింది. పై లోక ప్రవేశార్హత దక్కింది. రాఘవులు వచనం 383లో ధ్వనించే విమానం చూశారన్నాడుగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణ సూత్రధారుడు! వాళ్లకావిమానం కనిపిస్తూనే శబరీ కనిపించింది. ఎక్కుతూనేనో - లోపల కూర్చొనో (స్పష్టత లేదు. కానీ ఆవిడ ఎలా ఉందీ అంటే దివ్యమైన దండలూ మైపూతలతో క్రొత్తగా కనిపించేరూపం.

అలంకారాలు సరే అసలావిడ రూపం ఎలాఉంది అని. అగ్నిలో ప్రవేశించిందిగదా మాడి బొగ్గవలేదా అనిపిస్తే తర్వాత పద్యం చదవండి

గీ. ఒకయు నిర్వచనీయమౌ - నూహచేత
ఆమెయె యామె యనిపించు - నంతెకాని
దేవతా రూపమైన యా - దీధితికిని
యోగినీ రూప కామెకు - పోలికేదు. 385

అగ్నిలోపడింది యోగినీరూప జీవశబరి. మరి విమానంలోదో? దేవతారూపం అయింది. అందుచే ప్రకాశమానంగా ఉన్న విమానంలోని ఆమెకూ మనం భూమ్మీదచూసిన ఆమెకూ పోలిక ఏమీలేదు. అయితే ఆ విమానంలోది వేరెవరన్నానేమో అంటే చెప్పటానికి హేతువుతోచని ఏదో మనసులో మెదిలే ఊహవల్ల ఆ యిద్దరు వేర్వేరనిపించటంలేదు. ఒక్కరే అనిపిస్తుంటేనూ అనే ఈ మాటలు సూత్రధారుడివనిపిస్తాయి. కాని శ్రీరామ ఆత్మ పాత్ర అనవచ్చేమో అని తోస్తుంది. ఏమంటే ఆ ఏకవ్యక్తి రూపద్వయంగ మనించేది రాఘవులు. అందులో విస్తుపోయే లక్షణం శ్రీరామఆత్మ పాత్ర స్వంతం. అతడీ ఆశ్చర్యకర సన్నివేశం వదులుకుంటాడా! అందుకే రంగస్థలంమీద ఆ పాత్రధారియే ఆ పద్యం మాటలన్నాడు.

అయితే రంగస్థలం మీదనుంచి జీవ శబరి పాత్ర నిష్క్రమించి కూటస్థ తత్త్వానికెదిగి తేజోరూపంలో విమానం ఎక్కి ఆకసానికెగిరిపోతున్నట్లు సాధ్యం అయితే దర్శకుడు ప్రదర్శింపజెయ్యాలి. ఆమె స్తోత్రం ద్విషట్ పదుల పద్యాలన్నీ నేపథ్యం నించైనా వినిపించాలి. దీన్నిబట్టి ద్విపద మొదలుపెడుతూనే జీవశబరి అగ్నిప్రవేశము చేసేటట్లూ నిర్వహించాలన్న మాట సన్నివేశాన్ని. అదీ జీవశబరి పాత్ర నిష్క్రమణ కాలమూ విధానమూను. అదిగో ఆ సాన ..........

శ్రమణీ బాగు బాగు, శ్రమణీ జయజయఅనే దేవతల ఘోషలు కూడా వినపడి అంతంత దూరమైనట్లుకాగా ఇంక చెవులకందక పోయిం తర్వాత శ్రీరామఆత్మ పాత్ర పంపా సరోవరంమీది గాలిలో నిట్టూర్పులు విడుస్తూ వెడుతుంటే లక్ష్మణసాక్షి ఆయన నూరడించే సేవాధర్మంతో సమీ పించాడు. అప్పటికాయన నోరు విడివడింది. (ప్రదర్శనలో శబరి ప్రవేశం తో తాళం పడింది.) అప్పుడాయన అన్నమాటలనే సాక్ష్యంగా పెట్టుకొని ఈ వివరాలన్నీ మనం పరిశీలించాము. ఆయన ప్రస్తావించిన మూడు విశే షాలూ మనం సరిగానే అందుకోగలిగాము. ఆ విశేషాలు ఈ మునిరాజాశ్ర మం ఇంత విచిత్రంగా చేసిపోయాడు. ఈ శబరి మరీ చిత్రంగా సేవచేసి పోయింది. మిగిలిన ఈ వనం ఇంకా మల్లెల వాసనలు నింపుకొన్న గాలితె రల విన్యాసంలో ఆ మునీశ్వరుని మహిమ లింకా స్ఫురిస్తూనే ఉన్నాయి (10వ పుట) అన్నాడు.

అప్పుడా శ్రీరామఆత్మ పాత్ర నేనూ నాలో అలాగే అనుకుంటు న్నాను. మనం అంటే ఆ ముని కెంతప్రేమో చూశావా! ఎక్కడా మనిషి అలికిడిలేని ఈ అడవిదార్లో ఈ శబరిని ఉంచిపోయాడు గనుకనేగానీ లేక పోతే మనలను పలకరించే దిక్కు ఉండేదికాదు సుమా! (388) ఏమిటో తమ్ముడూ! నన్ను చూసుకుంటే నాకే చిత్రం అనిపిస్తుంది. ఆమెతో హాస్యా లాడేటప్పుడు చూస్తే వృద్ధుల మనస్సెలా ఉంటుందో అలా అయిపోయిందీ నా మనసూను నన్నుచూస్తే వాళ్ళకి అలాగే ఉంటుంది. అయినా ఈ యో గిని అయిన శబరిని చూశానా! సంతోషం నిండిన దానిగా ఆశ్చర్యంతో చూ సాను (389) అలాఆమెతో ఆశ్చర్యంగా హాస్యాలాడేటప్పుడు జానకి అసలు గుర్తేలేదు, కాగా ఈ మతంగముని మహిమా ఆశ్చర్యంగానే ఉంది. సప్త సింధువులూ ఆయన సేవకై వచ్చినవి ఇంకా ఇక్కడే ఉన్నాయి.

ఆ శబరినీ ఈ మునినీ తలచుకొంటుంటే ఆ లక్ష్మీదేవి సగరవం

శీయ విచిత్ర చరిత్రలు గుర్తుకొస్తున్నాయి. (390) ఈ సింధువు లిట పడి యలై ఉన్నా నాకు వార్ధులే అనిపిస్తున్నాయి. లోకంలో పదార్థాలు ఏ స్థితి లో ఉన్నా సహజ ధర్మపు మేలి తోణాలనే కలిగియుంటాయి సుమా! అవి ఏ వికారము పొందును. ఇది ఎంత చిత్రమో చూసావా! ఇక్కడగు జలధులున్నట్లు గుర్తించటానికి ఇంతకు మునుపు మనం ఎరుగం గదా! (391) మనం ఇక్కడ పితృ తర్పణం చేద్దాం. ముని దయవల్ల ఇవి యి క్కడిలా ఏర్పడి ఉండకపోతే మానవమాత్రులకి ఇలా సప్తాంబుధులనొక్క వేళ పితృతర్పణం చేసే అవకాశం దక్కేదా! అంతేకాదు మనకి అవకాశం కలిగించాలనే ముని ఆ సప్తాబ్దులను తిరిగి వెనక్కి పంపించలేదు' మన మీది దయతో ఇక్కడే ఉంచేసాడు (392) అని పితృతర్పణం చేసాడు శ్రీ రామ ఆత్మపాత్ర ఆ పడియలదిగి స్నానం చేసి అనంతరం తన ప్రాణాలు తేలిక పడ్డాయనీ ఇంక ఋశ్య మూక పర్వతంగూర్చి పోవాలనిపిస్తోంది. మన మైత్రికి తగినవాడని కబంధుడు తెలియజేసిన సుగ్రీవుడే నా భావం అంతటా నిండి ఉన్నాడు.(393) (పద) అనీ శ్రీరామ ఆత్మపాత్రధారి అటు సాగుతుంటే లక్ష్మణసాక్షి పాత్రధారి అనుసరించటంతో ప్రదర్శన "శబరి శ్రీరామమ్'కు తెరపడింది.

కడపటికి మిగిలింది శబరి- జలం విషయం. అది వేరే అనుబం ధంలో చూద్దామనుకొన్నాం! అయినా ఏదోకొంత 'ఇక్కడా చూద్దాం అందు కు అవసరమైన క్షేత్రజ్ఞతత్త్వం స్థూలంగా గ్రహించి ప్రకరణావగాహనకుప యోగించుకొన్నాం. అప్పుడింకా సూక్ష్మ వివరణ ఉందని కూడా స్మరించే ఉన్నాం, ఇప్పుడా ప్రయత్నం చేద్దాం. పెద్దల అనుగ్రహం ఉంటే కొంత తెలియవచ్చు. అందులో కర్తవ్యంగా వ్యుత్పత్తి ని గమనించండి,

అమరకోశంలో 'క్షేత్రజ్ఞ ఆత్మాపురుషః' అని వ్రాస్తే దానికి గురు బాలప్రబోధిక' క్షేత్రజ్ఞాది శబ్దములు 3 సాంఖ్యమునందలి జీవుని పేళ్ళు క్షేత్రం శరీరం జానాతీతి క్షేత్రజ్ఞః జ్ఞా అవబోధనే క్షేత్రమనగా శరీరము·

దాని నెఱింగినవాఁడు" అని వివరించింది. ఇప్పుడు యాజుషీయ సర్వసా రోపనిషత్ నిర్వచనం.

మన ఆదిశ్చ ప్రాణాదిశ్చ చ్ఛాదిశ్చపుణ్యాదిశ్చేతే పంచవర్గా ఇత్యేషాంపంచవర్గాణా ధర్మీ భూ తా త్మా జ్ఞా నా ద్ధృతేనవినశ్యత్యాత్మ స న్ని ధౌ ని త్య త్వే న ప్రతీయమాన ఆత్మోపాధిః య స్త ల్లిం గ శరీరం హృద్గ్రంధి రిత్యుచ్యతే॥ తత్రయత్ప్రకాశతే చైతన్యం సక్షేత్రజ్ఞ ఇత్యుచ్యతే" అనీ అదే ఉపనిషత్తులో మరోచోట ఇచ్చిన ఇదే నిర్వచనం వర్గ ప్రపంచకంలో "ఇచ్ఛాదిశ్చ" అనే వర్గ ం వదిలేసి దాని స్థానంలో "భూతాదిశ్చ" అనేది చేరుకుంది. ఆలోచిసే భూత-సత్వ శబ్దాల అర్థం ఒ కటే కనుక పైన ఇచ్చిన నిర్వచనంలో సత్వాదిని భూతాదిగా చేయవచ్చు. మరోచోటి నిర్వచనంలో సత్వాది చోట ఇచ్ఛాది ప్రతిక్షేపిస్తే రెండు నిర్వ చనాలా సమంగా ఒక్కలా ఉంటాయి. (తత్త్వాల విషయంలో కొద్దిపాటి సవ రింపులు చేసుకోవచ్చని సూచించటానికే ఒకపుట మాత్రవ్యవధానంలో ఒకే నిర్వచనం కించిద్భేదంతో మరోసారీ ప్రవచించింది ఉపనిషత్.) ఏమైనా ఆ పంచవర్గాత్మకమైన వ్యవస్థని లింగశరీరం అంటారని స్పష్టం.

ఆ లింగశరీరంలోని అంతస్తత్త్వాలకుండే సహజ ధర్మాలను అను సరించి నడుచుకొంటూ జ్ఞానం (గురుప్రసాదం) ఆదరణచేత ఆత్మసన్నిధీ నందినప్పుడు నశిస్తుంది. (శీర్యత ఇతి శరీరమ్। శౄహింసాయామ్। నశించు నది. అని శరీర శబ్దవ్యుత్పత్తి గురుబాల ప్రబోధిక.) దానిఉనికి (నిత్యత్వేన అంటే వచ్చేదివస్తూ పోయేదిపోతున్నా ఎప్పుడూ ఉన్నట్లు కనిపించటం) చేత ఆత్మకుస్థానం (ఉపాధి) ఏదైతేఔతుందో ఆలింగ శరీర వ్యవస్థమాత్రం హృద్గ్రంధి అనబడుతుంది. అంటే మామూలు లింగ శరీరం వ్యవస్థ లో కనిపించే పుణ్యాపాప తత్త్వాలు రెండింటిలో పాపం తరిగిపోవటం అన్న మాట. జ్ఞానాదరంవల్ల పాపం తరిగి ఆత్మ నిలవటానికి ఉపాధిగా సమకూ ర్చబడి ఉన్న లింగ శ రీ ర ం గా ఏ వ్యవస్థ కుదిరిందో ఆ వ్యవస్థే హృ ద్గ్రంధి ఔతుందని తాత్పర్యం. అలా అయినప్ప డక్కడ ఏచైతన్యం ప్రకా

శ్నస్తూంటుందో ఆ చైతన్యానికే క్షేత్రజ్ఞుడని పేరు. అనేది పై ఉపనిషత్ తా త్పర్యం కాగా

''వికల్ప కలితాకారం దేశకాల క్రియాస్పదమ్।
చితోరూప మిదం బ్రహ్మన్ క్షేత్రజ్ఞ ఇతి కథ్యతే॥''

అనిన సామవేదీయ మహోపనిషత్ పంచమాధ్యాయంలో ఉన్న నిర్వచన శ్లోకంలోని మొదటి పాదానికి పై సర్వసారోపనిషత్ ప్రకారం హృద్గ్రంధి తత్త్వయుక్తంగా వ్యాఖ్యానించుకోవలసి ఉంటుంది. అప్పుడీ శ్లోకం ద్వితీయ పాదంలోని చిత్‌రూపం క్షేత్రజ్ఞ చైతన్య ప్రకాశరూపమే. మరి తేడా ఉండదు.

ఇవి ఇలా ఉండగా శ్రీమద్భగవద్గీత 13వ అధ్యాయం క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగంలోని రెండో శ్లోకంలో "ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభి ధీయతే" అన్నప్పటి శరీరాన్ని హృద్గ్రంధికాగల లింగ శరీరంగా వ్యాఖ్యా నించకపోతే ఆత్మ అయిన భగవానుడికది ఉపాధి అవలేదు దాన్నిబట్టి మూడవ శ్లోకంలో "క్షేత్రజ్ఞం చాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత" అన్న పుడన్వయమూ కుదరదు ఏమంటే పాంచభౌతిక సామాన్య శరీరమే క్షేత్ర మైతే ఆ క్షేత్రంలో ఉండేవాడుగా తాను క్షేత్రస్థుడే కావలసి ఉండగా శ్రీ కృష్ణుడు క్షేత్రజ్ఞుడనటం ఆక్షేపణీయం ఔతుంది. 6 & 7 శ్లోకాల తత్త్వ వివరాలుకూడా మొత్తం పాంచ భౌతిక సామాన్య శరీర వ్యవస్థనే సూచిం చటంతో బుద్ధిమంతులు క్షేత్రజ్ఞుడంటే జీవుడే అని తేల్చివేశారు. అమరం లో క్షేత్రజ్ఞ ఆత్మపురుషులనేకం చేసి జీవుని పేర్లనటం ముందే చూశాం గదా! ఇపుడు భగవద్గీతలోని 6 & 7 శ్లోకాలు చదవండి, తర్వాత ఉప నిత్తుతో సరిచూద్దాం.

శ్లో॥ మహాభూతాన్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ।
ఇన్ద్రియాణి దశైకంచ పంచేంద్రియ గోచరాః॥ 6
ఇచ్ఛాద్వేషస్సుఖందుఃఖం సంఘాతశ్చేతనాధృతిః
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్॥ 7

ఇందులోని తత్త్వవివరాలు ఉపనిషత్తులోవాట్ని పోల్చే ఈ పట్టికచూడండి.

| | ఉపనిషత్సంబంధి | | శ్రీమద్భగవద్గీతాసంబంధి | |
|---|---|---|---|---|
| 1. మనాది వర్గం | మనోబుద్ధి చిత్తాహంకారాలు | 4 | అహంకారబుద్ధి అవ్యక్త మనసులు | 4 |
| 2. ఇచ్ఛాది వర్గం | ఇచ్ఛాద్వేష సుఖదుఃఖాలు | 4 | ఇచ్ఛాద్వేష సుఖదుఃఖాలు | 4 |
| 3. సత్త్వలేక భూతాది వర్గం | పృథివ్యాపస్తేజో వాయురాకాశాలు | 5 | పృథివ్యాపస్తేజో వాయురాకాశాలు | 5 |
| 4. పుణ్యాది వర్గం | పుణ్యపాపాలు | 2 | చేతనాధృతులు | 2 |
| 5. ప్రాణాది వర్గం | ప్రాణాపానవ్యానోదానసమానములు | 5 | దశేందియ + తన్మాత్రాపంచకం | 15 |
| | | 20 | | 30 |

భగవద్గీత పక్షంలో వివరంగా చెప్పిన తన్మాత్రలైనా శబ్దస్పర్శ రూప రసగంధాలు. అవి ఆకాశాది పంచభూతాల గుణాలు కాగా ఇంద్రియాలు వాటిని గ్రహించే యాంత్రిక ఉపకరణాలు మాత్రమే అవి నశించే లక్షణాలున్న శరీరావయవాలు. (అధిభూతం క్షరోభావః భ.గీ 8-4) నిత్యత్వావకాశం లేనివి కనుక ఆ పదింటినీ తొలగిస్తే మిగిలేవి ఇరవయ్యే. ఉపనిషత్తత్త్వాల సంఖ్యకు సరిపోతాయి. కాగా ఉపనిషత్తులో ప్రాణాలు భగవద్గీతలో తన్మాత్రలవటం ఒకటి. ఉపనిషత్తులో పుణ్యపాపాలు భగవద్గీతలో చేతనాధృతులవటం ఒకటి ముఖ్య భేదాలు తప్ప తక్కినవి దరిదాపు ఉభయత్రా సమానమే.

మరి భగవద్గీత క్షేత్రజ్ఞుడంటూ ఇంద్రియాలనూ తన్మాత్రలనూ ప్రస్తావించి (ఆ శరీరంలో ఉన్నవాడంటూ) క్షేత్రస్థు డనిపింపజెయ్యటం మనని సందేహంలో పడవేస్తుండగా ఉపనిషత్తు వాటిని పరిహరించి ప్రాణాలను ప్రవేశపెట్టి క్షేత్రజ్ఞ శబ్దాన్ని సార్థకం చెయ్యటం మనం గుర్తించాలి. అయితే భగవానుడు తప్పుచెప్పాడా అంటే ఆయన సూక్ష్మవిచారపరులకెలాగూ తెలుస్తుందికనుక సామాన్యుల అవగాహనకి పనికివచ్చేటట్లు స్థూలవిషయంగా మాత్రమే చెప్పాడు. లింగశరీరమూ హృద్గ్రంథి అనే సూక్ష్మ వివరాలకి పోలేదు. కడకాయన 34 వ శ్లోకంలో

"యథా ప్రకాశయత్యేకః కృత్స్నంలోకమిమంరవిః।
క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం ప్రకాశయతి భారత॥

అన్నప్పుడు క్షేత్రజ్ఞ (క్షేత్రం తెలిసినవాడని) క్షేత్రి (క్షేత్రం కలవాడని) మార్చటం గుర్తిస్తే ఆక్షేత్రం-నిర్దిష్ట కార్యక్షేత్రమేగాని శరీరం కాదని తెలిసిపోతుంది. కాబట్టి 'ఇదంశరీరం కౌన్తేయక్షేత్ర మిత్యభిధీయతె' అని చెప్పింది సామాన్యపాఠకులకే అనేది స్పష్టం. ద్వితీయాధ్యాయంలో అర్జు

ముని ఆయన "అశోచ్యానన్వ శోచస్త్వం ప్రజ్ఞా వాదాంశ్చభాషసే" (2-11) నువు పండితుడిలా మాట్లాడుతున్నావోయ్. అని మందలించి ఆ కౌన్తేయుని సామాన్యుని గా పరిగణించి నట్లేఉంది. పైగా భగవద్గీత ఉపన్నిషత్తుల సారాంశం. కనుక భగవద్గీతలో స్థూలంగాతెలియజేసిన వాటి సూక్ష్మవివరాలను గ్రహించాలంటే ఉపనిషత్తులనే ప్రమాణాలుగాగొని వాటినే ఆశ్రయించాలి, ఉపనిత్తుల్లోనే ఒకటైన శారీర కో పనిషత్తులోని స్థూల నిర్వచనాన్ని మనం ప్రకరణార్థంగా అన్వయించుకొనే అన్వయించుకొన్నాం. సామాన్యావగాహన కోసం ఇప్పుడు పైన సూక్ష్మ న్నిర్వచనం గ్రహించి ఉన్నాంగదా! దైవకటాక్షంఉంటే శబరి కిదీ అన్వయిస్తుందనే విశ్వాసం. కల్పవృక్షాన్నాశ్రయించాంగదా చూద్దాం.

ఒకసారి ఉపనిషన్నిర్వచనం తాత్పర్యం చదివి మనసులో ఉంచుకొంటే శబరి-మతంగమహర్షి గురుప్రసాదం అయిన జ్ఞానం వల్ల శబరి లింగశరీరధర్మాను సరణంలో పాపం తరిగిపోయి శ్రీరామ అంతరాత్మదర్శనంతో ఆ శరీరంహృద్గ్రంధిగా మారటం ఆమె అగ్ని ప్రవేశం చేయటంగా చర్యా ప్రతీకలో ప్రతిబింబించగా ఇప్పుడు నూతనంగా శ్రీరామ అంతరాత్మను ఇదివరకు తనగురువును నిలుపుకొన్న హృదయస్థానంలో, నిలుపుకోవటంలో ఆత్మా వధిగా అచ్చమైన హృద్గ్రంధిగా అవగాహనకు వస్తుంది.కల్పవృక్షంలో ఆమె పొందిన విభూతి సార్థకం అని పించే ఆపేరిటి ఛందంలో

"ఆయెడ మునీశ్వరుం డీ యెడన్ రఘూత్తముం
డాయెడన్ రఘూత్తముండీ యెడన్ మునీంద్రుండున్" 374

అన్న పీటముడి ఆహృద్గ్రంధి లక్షణమె. అప్పడంచలి చైతన్యం శబరి ద్యులోక యానవిమానంలో "దివ్యమాల్యాను లేపనాది నవమూర్తియై" (384) దేవతారూపమైన దీధితి (385) గా ప్రకాశించినట్లు శ్రీరామ అంతరాత్మ భావాన్ని శ్రీ విశ్వనాథసత్యనారాయణ గారావిష్కరించే ఉన్నాడు.

అంటే శ్రమణి. శబరి—క్షేత్రజ్ఞులు బింబప్రతి బింబాలై పరస్పర సము ర్థనీయాంశాలుగా మన అవగాహనకు దోహదం అవుతున్నాయి.

కాగా సర్వసారోపనిషత్తులో మరోచోటి నిర్వచనంలో 'ఇచ్ఛాదిశ్చ' కు బదులు 'భూతాదిశ్చ' గా మార్పు ఉందనీ అది సత్త్వాదిశ్చకు బదులు గా ఉండటం సమంజసమనీ అనుకున్నాం. అయితే అక్కడా భూతాది వర్గం ఉందిగదా అంటే అందులో లోపించిన ఇచ్ఛాదిశ్చగా అది మారాలి ఆ నిర్వచనం కూడా క్రింద ఇస్తున్నాను తికమక పడకుండా ఉండేందుకు

"మన ఆదిశ్చ ప్రాణాదిశ్చ సత్త్వాదిశ్చ భూతాదిశ్చ పుణ్యాదిశ్చైవ తేంచదర్గాః' ఇందులో 3 & 4 సత్త్వ-భూతాలు ఏకార్థకాలు కనుక సత్త్వ కు బదులు ఇచ్ఛాచేరిస్తేచాలు రెండు నిర్వచనాల వర్గాలూ సమం ఔతాయి ఏక గ్రంథంలో స్వవచన వ్యాఘాతం ఉండదు గదా!

సరిగ్గా ఇలాంటిదే మరోమార్పు మొదటి నిర్వచనంలో 'జ్ఞానామృతేన వినశ్యత్యాత్మ సన్నిధౌ' వాక్యం రెండవ నిర్వచనంలో జ్ఞానమృతేన వినశ్య త్యాత్మ సన్నిధౌ' అని ఉంది. అది బహుశః జ్ఞానామృతేన" అయి ఉం టుంది, (అచ్చు పొరపాటున దీర్ఘం హ్రస్వమై పడితే) అది "అమృత' శబ్దం ఔతుంది ఆ శబ్దానికి 'అమృతం యజ్ఞశేషేస్యాత్ పీయూషే సవితే ఘృతే' అని విశ్వకోశం సలిలార్థాన్ని కూడా ఇచ్చింది

ఉపనిషత్తు 'జ్ఞాన అమృతేన వినశ్యత్యాత్మ సన్నిధౌ" అని కదా ఉంది! అంటే ఆత్మ సన్నిధానంలో జ్ఞానజలంచేత లింగ శరీరం నశిస్తుం దని భావం. హృద్గ్రంథిగా ఆత్మాధారక్షేత్రం కావాలి. కాబట్టి కల్ప వృక్షంలో శబరి క్షేత్రజ్ఞుడు - శ్రీరామ అంతరాత్మయొక్క సన్నిధానంలో ఆయన "కాళ్ళు కడిగికోవలయును కనులు తుడిచిగోవలయు. స్నానము చేయగాను వలయు' (340) అని నోరు విడిచి అడిగినా 'నీకేమొస్నానా

దుల్పిత్యపవిత్రమూర్తికిని నమర్యాదామహాంబోధికిన్" (341)అని తప్పిం చు కొంటుందేగాని నిళ్ళియ్యదు.

ఉపనిషత్ సమాసం "జ్ఞానామృత" రూపకంలో జ్ఞానం ప్రధాన నిర్దిష్ట కర్త పదమైనా శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు చమత్కారంగా ఆ ప్రాధాన్యం అమృత శబ్దానికి గంతుపెట్టించి జలనిషేధాన్ని సృష్టించాడు. వింతగాలేదూ! ఇక్కడి యీ గడిమార్పులాట పరోక్షం అయితే దీన్ని సూచిం చే ప్రత్యక్షంగా ఆడిన ఆటా ఉంది. వాల్మీకి శమణి వృత్తియందున్న ఆమె పేరు శబరి అంటే ఈయనా గడులు మార్చి శబరి ప్రవృత్తియందున్న ఆమె పేరు శమణి అంటాడు.

"శమణీ శబరీనామ కాకుత్స్థచిరంజీవినీ" (వా. రా. అరణ్య 73 సర్గ 26 శ్లో.) "సన్యాసస్త్రీ శబరియను పేరు గలది మాత్రము ఇప్పటికి నున్నది." అని వావిళ్ళవారు వ్రాయించిన తాత్పర్యం. శబరః అనే పులింగ శబ్దానికి "శబరో వారి చండాలభేదయో శ్శంకరేఽపిచ" అని విశ్వకోశం వారి నీళ్లనే అర్థం తెలిపింది. ఆ గంగార్థంఉన్న శబరశబ్దానికి స్త్రీలింగమే 'శబరీ' గంగా-నీళ్లనే అర్థం అలా స్త్రీకి పేరుండవచ్చు. ఆ శమణీకి అలాగే ఉంది.

కాగా శబరి పేరున గోదావరినదికో ఉపనది ఉందనీ దాన్ని తల పెట్టి "జలధిరాజు భర్త శబరి లజ్జావతి. గోదవెనుక దాగికొనియెపొందు" (364) అని శబరి తనపేరు (ప్రవృత్తి) శ్లేషచేసి అవిడ మాట్లాడినట్లు వ్రా సికూడా శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు శబరిచేత "నా పేరు శమణి" (359) అని చెప్పించాడు. శమణి అంటే సన్యాసిని అనే అర్థం. తురీయా శ్రమస్త్రీసూచకం. అటువంటిదాన్ని ఆమె పేరుచేసి,అసలు పేరైన శబరి-వ్యుత్పత్తిలోని వారి-జల లక్షణంగా ప్రవర్తింపజేసి" యీ దేశంబునఁబెట్టు చెట్టు గృహమే ఈనాకు" (34) అని స్వనిర్దేశంగా తన లక్షణమైన నీళ్లుగా ప్రతి చెట్టు బోదెలోనూ నేను కాపురముంటాను. అవన్నీ నాకు ఇళ్లే. అని

పించాడామెనోట కవి సమ్రాట్. అంతేనా! శ్రీరామ అంతరాత్మనుగూర్చి" 
కేమో స్నానముల్నిత్యపవిత్రమూర్తి కిని మర్యాదా మహాంభోధికిన్" అంతే
నీ పరిధి (పాదాల) లో గొప్పనీరధి (గంగను) పెట్టుకొన్న - అంటే పాద
ద్భవగా గంగను కలవాడవుగా నివు నిత్యపవిత్రుడవై ఉంటావు. నీకు వేరే
స్నానాలేమిటికయ్యా అనిపించాడు. ఆ రెండింటినీ కలిపితే శబరి తన ప్ర
వృత్తిగా గంగ అయి శ్రీ మహావిష్ణు పాదాల పుట్టివచ్చి యీ మతంగ మహ
ర్షి వనంలోని చెట్లబోదెల్లో కాపురముంటూ ఆ చెట్లు పూచీ కాచేటట్లుపాటు
పడుతున్నానంది అన్నమాట. అలా అయితే ఆందులోంచి మరో విశేషం
బయట పడుతుంది, అది ఏమిటంటే తాను గంగలా ఆయన పాదాల్లోంచి
పుడితే "పద్భ్యాగ్ంశూద్రోఽజాయత" అన్న పురుషసూక్త వాక్యానుసారం
శబరీ ప్రతిలోమస్త్రీ తదుక్తం నారదీయే నృపాయాంవైశ్యతోజాతః శబరః
పరికీర్తితః. మధూని వృక్షాదానీయ విక్రీణీతే స్వవృత్తయ ఇతి. జాతె "ర"
స్త్రీ విషయాదితి జీష్ శబరీ- [గోవింద రాజీయ వ్యాఖ్య బాలకాండ, సర్గ
56వ శ్లో) శూద్రురాలను నేను నీవు పవిత్ర ద్వి జన్ముడవు (క్షత్రియుడవు
నేను నీళ్ళియటమా! అంది అన్నమాట, అది తలంపుకు వచ్చేనేమో
నీళ్ళు కావాలని అడిగిన శ్రీ రామ అంతరాత్మ మళ్ళీ "కాదీ పాటుననే
భుజింపు మనినంగా దందునే నేనమర్యాదం జేయుట నీకు నేల!" (341)
అన్నాడు వెంటనే. అంటె సర్దుకుంటున్నట్లు నటిస్తూనె సరేలే నీవు (పెద్ద
దానవు) తినమంటే ఇల్లాగే తినేస్తాను. నీళ్ళిచ్చి నన్ను మలిన పరచన
ఆ మర్యాద మళ్ళీ నీ కెందుకని అర్థం,

ఇన్ని చమత్కారాలకి శబరియొక్క క్షేత్రజ్ఞ తత్త్వ నిర్వచనం
లోని 'జ్ఞానామృతేన వినశ్యత్యాత్మ సన్నిధౌ! అన్న ఉపనిషత్ వాక్యంలోని
అమృత శబ్దం నీళ్ళు అర్థం కలదిగా - (అన్ని చమత్కారాలకి) ఆలవాల
మైంది మరోమాట శ్రీరామ అంతరాత్మ ఒక్క పరిహాసశీలి మాత్రమే కాదు

సూక్ష్మ పరీక్షాశీలి కూడాను. అస్పృశ్యత విషయంలో శబరిక్షేత్రజ్ఞత ఎట్టి దో పరీక్షించటానికే కాళ్ళు కడుక్కోవాలి లాంటి మాటలనడంగానీ తానం తకు ముందే పంపా సరోవర జల పవిత్రుడై వచ్చినవాడు కాదా! అది అవి డకు తెలియదా! అవిడేమీ తెలివి తక్కువదిగాదు. తిసడానికేమో ఇచ్చి త్రాగడానికియ్యకపోతే గొంతు డెక్కుపట్టదా! అంటే పట్టదు. ఆఫల మాహా త్మ్యం అనిడ కనుభవమే.

దీనితో శబరి నీళ్ళు తేకపోవడంలోని ఆంతర్యం అవగాహన అయిందనే అనుకుంటాను. ఇంకా సందేహం ఉంటే ఒక అనుబంధంలో ప్రస్తావిస్తానన్నాను గదా! ఏమైనప్పటికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ఆ వాల్మీకి నూటికి కోటికొక చోట చెప్పిన ఆ గుణాలని బయటకు తీసి వ్యాఖ్యానించటానికి ఇన్ని జాగ్రత్తలూ ప్రణాళికలూ సరితూకంలో ప్రయోగాలూ చూపించాడా? ఆశ్చర్యమే ఏమైనా ఆయన ఆంధ్రజాతి తలెత్తి చెప్పుకోగల కవిసమ్రాట్ కదా!



# కల్పవృక్షంలో శబరి - శ్రీరాముడు

## అనుబంధం-1

భారతదేశంలో ప్రభుత్వం ఎప్పుడూ ప్రజాక్షేమ మూలసూత్రంగానే సాగేది. అలా నిర్వహింపబడినట్లు పురాణాల్లో ఉన్నా చరిత్రలో రాజులూ రాజవంశాలూ నిరంకుశంగా పాలించినట్లే ఉంటుంది, ఆ రాజులూ, రాజ వంశాలూ పరిపాలనలో పాటించిన ప్రజాక్షేమ ప్రాధాన్యం గల ఔదార్య తత్త్వం (Benevolence) విషయాన్ని ప్రత్యేకించి స్పష్టంగా వివరింపక యుద్ధాలూ విజయాలూ అంటూ పట్టికలే చరిత్ర ప్రకటించటాన్ని బట్టి "నరజాతిచరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం, నరజాతిచరిత్రసమస్తం పరస్పరాహరణోద్యోగం' అనే నింద భరించ వలసివచ్చింది, (అదృష్టం ఏ మిటంటే శ్రీశ్రీగారు చెంగిజ్‌ఖానుతో మొదలైన నరహంతకులపట్టికలో శ్రీరా ముణ్ణీ, శ్రీ కృష్ణుణ్ణి చేర్చపోవటం) అది అలా ఉంచితే మనదేశానికి భారత నామ కారకుల్లో ఒకడైన భరత మహారాజు తండ్రి అయిన దుష్యంతుని పరిపాలనా క్రమంలోని అంతర్విషయం కాళిదాసు తన 'అభిజ్ఞాన శాకుం తలమ్" నాటకంలో ఎలా ప్రకటించాడో గమునించండి.

> శ్లో॥ స్వసుఖ నిరభిలాషః ఖిద్యసేలోకహేతోః।
> ప్రతిదిన మథవాతేవృత్తి రేవంవిధైః॥ (అంకం 5 శ్లో 3)

నీ వృత్తి (ప్రజాపాలనం) అలాంటిది. అది అంతేలే అంటే అది ఎలాంటిదన్న మాట. ప్రతి దినమూ – అహరహమూ- అంటే ఎల్లప్పుడూ కూడా లోకం హేతువును గూర్చి అంటే లోకంలో అందరి క్షేమం సమ కూర్చే కారణంగానే బాధపడుతున్నావు. అంటే పాటుపడుతున్నావు అనే. మరి తన స్వవిషయమో? తన సుఖం కోసం పాటుపడాలనే అభిలాష (ఏమాత్రమూ) లేదుట. చూసారా అదీ ముఖ్యం. మనకు దుష్యంతు డెం

తమంది మీద దండెత్తాడూ రాజ్యాన్నెంత విస్తరింపజేశాడూ! to estimate the valour and achievements) అన్నది వ్యధానాంశం కాదు. కానూ డదు. అతడు తన పాలితుల యెడల ఎంత ఉదారుడూ అన్నదే ముఖ్యం.

ఆసలు మన సంస్కృతిలోనే 'ప్రజా' అన్న మాటకు జనులనీ సంతానమనీ ఉభయార్థ కల్పనంచేయటంలోనే పాలకునికి పాలితులు స్వ సంతాన సమానమనే ప్రకాశం ఉంది. వారి వృద్ధికే అతడు పాటుపడాలనే ప్రకృతి నాశనం (Biological order) ఉంది. అది పాలక వృత్తిలోని ప్ర ధాన లక్షణం. దాని చేతనే దుష్యంతుడు ప్రకాశించాడు. (శకుంతలను నిరాదరించి మళ్ళీ ఆదరించటంలోని దుష్యంతుని ధార్మిక దృష్టి నా 'కాళి దాసు శకుంతలి సార్వకాలిక ప్రేమమయి' అనే వ్యాసం-ఫిబ్రవరి 1991 'తెలుగు' అనే తెలుగు అకాడమీవారి వైజ్ఞానిక మాస పత్రికలో ప్రకటితం అయింది చూస్తే తెలుస్తుంది) అలా ప్రకాశించే ధర్మచైతన్యమే బ్రహ్మత త్వం. ఆ తీరుదైన ప్రవృత్తి పాలకుడైన ఏఒక్క రాజుకో రాజవంశానికో మా త్రమే పరిమితంకాదు. మొత్తం పాలక వ్యవస్థలోని ప్రతినిధివర్గం అంద రికీ చెందుతుంది. వారి అందరికీ ప్రభువు ఆదర్శం కావాలి ఆ విషయా న్నే శ్రీ భగవద్గీత

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ తత్త దేవేతరోజనాః।
సయత్ప్రమాణం కురుతే లోకస్తదమవర్తతే॥ (3 అధ్యా 21వశ్లో)

శ్రేష్ఠ స్థానీయు లెలా ప్రవర్తిస్తే వారిననుసరించి తక్కిన జనులంతా అలా ప్రవర్తిస్తారు. ఆ శ్రేష్ఠుడు లోకశాస్త్ర కావ్యాదుల పరిశీలించి గడించిన తన అనుభవంచేత ఏవిధానం అనుసరణీయంగా చేసిచూపి ప్రమాణీకరిస్తే లో కంలోని జనులూ ఆ విధానాన్నే అనుసరించి నడుచుకొంటారు అంటే అది సంప్రదాయం రాజ్యాంగం (un-written Constitutional system) పద్ధతి అన్న మాట. ఈ విషయంలో రాజ్యాధికార ముద్రాంకితులైన ఉద్యో

గులే (శ్రేష్ఠ స్థానీయులే) అలా ఉండి తక్కినవారలా ఆ విధానాన్ని అను సరించకూడదని ఎక్కడా లేదు. ప్రజా అంటే పాలిత జనత అనేకాదు సంతానమని కూడా అర్థం. కనుక ప్రతి తండ్రీ తన సంతానం యొక్క అభివృద్ధి స్వీయసుఖంకంటె మిక్కిలిగా తలచి పాటు పడవలసిందే. అంటే ప్రజా క్షేమాభిలాషతో నడుపబడే ప్రభుత్వ వ్యవస్థయొక్క బృహ ద్రూపం రాజ్యం అయితే దాని లఘురూపం కుటుంబం అన్నమాట.సత్యం గ్రహిస్తే భారతీయ భావనలోని ఆ బృహద్రూపం సర్వ ప్రపంచమే.

శ్లో॥ అయంబంధురయం నేతి గణనా లఘుచేతసామ్
ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకమ్।
(మహాపనిషత్ 6వ అధ్యా)

అన్న శ్లోకార్థం అదే. ఆ ఉదార చరితలో ప్రకాశమానమైన చైతన్యమే బ్ర హ్మ భావన, బ్రహ్మతత్త్వంప్రజాక్షేమరాజ్య వ్యవస్థను నడిపించే మూల సూత్రం, శాసన గ్రంథ ప్రత్యక్షావసరం లేని అవ్యక్త Un written con. stitution) రూపం. అస్తి-భాతి-ప్రియం-నామరూపం చేత్యంశపంచకం లో అద్వితీయమైన బ్రహ్మతత్త్వ రూపం అదే (అస్తి- అందరి అంతరం గాల్లోనూ దాగి ఉంది. భాతి-పెద్దల నుండి సంప్రదాయంగా అనుసరింప బడుతూ వర్తమానంలో ప్రకాశిస్తూంది. ప్రియం - వర్తమానంలోని యువజ నతకూ లాభదాయకమూ, అల్ప పరిశ్రమా ప్రాప్తిగా ఇష్టమయీ ఉంది. అది ఒకే బ్రహ్మ తత్త్వం) ఆ ప్రపంచాది కుటుంబ పర్యన్త వ్యాప్తమైన సర్వ జీవ సంపూర్ణక్షేమాభివృద్ధి పరమైన ఆ అవ్యక్తబ్రహ్మతత్త్వావగాహన మూలంగానే ఎవరికైనా శాశ్వతసుఖం (అనుభవైక వేద్యం) అనుభవంలోకి వస్తుంది, మరే ఇతరంవల్లా లభించదని బ్రహ్మోపనిషత్ ఎలా చాటుతుం దో చదవండి,

"ఏకోదేవః సర్వ భూతేషు గూఢః సర్వవ్యాపీ, సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్షః సర్వ భూతాధివాసః సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ ఏకోవశీ సర్వ భూతాంతరాత్మైకగ్ంరూపంబహుధాయః కరోతి। తమాత్మస్థంయేఽనపశ్యం

తి ధీరాః తేషాంగ్ం సుఖం శాశ్వతం నేతరేషామ్"

ఒకే దేవుడు. అదే బ్రహ్మతత్త్వం (ఒకే వ్యవస్థ) జీవ భూతములన్నింటా దాగి ఉన్నాడు, ఒక్కొక్క దానియందూ అంతరాత్మగా (సంప్రదాయ సంస్కృతిగా అందుతూ) అన్నింటా వ్యాపించియున్నాడు, అలా భూతజాతములన్నింటా (దేశకాల క్రియానుసారంగా ప్రజాక్షేమాభివృద్ధి సాధించే స్వేచ్ఛగలిగి) వసించి ఉండి (సాంప్రదాయక Unwritten constitution-al ) వాటివాటి కర్మలకు (ఆదర్శభూతమైన] అధ్యక్షుడైన వాడతడు. తరువాత సాక్షిగా అంటే అనుసరణీయ శాసన గ్రంథరూపమై కీడుమేళ్ళు విడమర్చి తెలుపుతూ (Written Constitution) ఉండేవాడుగా ఉన్నాడు అతడు గుణ (సత్త్వరజః తమోగుణాల) వికారాల్లేని కేవలుడు. అంటే ప్రజారక్షణ శిక్షణల తన-పర అనే అంతరాలు పాటింపని స్వచ్ఛమైన క్షేమాభివృద్ధి కల్పనుడు అని అర్థం. అనుసరించి నడుచుకొన్నారా ప్రజలు ప్రయోజనం పొందుతారు, లేదా ఏమౌతారో తనకు పట్టదు, సాయమడిగారా దారి చూపిస్తాడు. అదీ సాక్షి లక్షణం. అలా సర్వభూతాంతరాత్మ రూపం ఒక్కటే ఎన్నో రకాలు చేస్తుండేది ఏది ఉందో, అలా ఉండే వానిని తన ఆత్మ యందే చూడకుండా ఉండరో [అంటే చూస్తారో) వారికి సుఖం శాశ్వతం ఔతుంది. ఇతరులకౌ్కడు

వివిధ స్థావరజంగమాలైన భూతాలన్నింటి మాటా ఎలా ఉన్నా మనుష్యులందు మనసు ఎక్కువ ఆలోచనా శక్తిగలది. కనుక వారు తమజాతి అందరి సుఖాభ్యుదయ సాధనావిధానం పరిశీలించి నిర్ణయించుకోగలరు. ఆసర్వ జనాభ్యుదయ భావన సహజంగా మనసుల్లో అంతర్లీనంగా కదలాడుతూనే ఉంటుంది. (Biological interest)

కాగా పై నిర్వచనంలో 'చేతా' (మనసు కలవాడు) అని ప్రస్తావన ఉంది. దానికి ఇంద్రియ ప్రవృత్తి ఉంది అందుచేత అది కొంత (సంప్రదాయాన్నీ - శాస్త్రాలనీ లెక్కచేయని అవకాశంగా) స్వాతంత్రం

ఉంది. బ్రహ్మ కర్మ కోసం ఇతరేంద్రియాల వివిధ విషయాలూ సంస్కార దృష్టితో గ్రహించాలంటుంటే అది తాత్కాలిక అధిక సుఖానుభూతికి వశం అయి శాశ్వత సమష్టిలబ్ధసుఖంమాట వష్టి (వ్యక్తి) యై తలంపక పోవచ్చు. అక్కడే ఇతరం నుంచి వ్యక్తిత్వం భేదించటం జరుగుతూ ఉంటుంది. ఆ భేదించటంలో ఆంతరాలు ఎన్నెన్నో ఉండవచ్చు గాని మనం స్థూలంగా రెండింటినే పరికిద్దాం.

"శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత వివినక్తిధీరః శ్రేయోహి
ధీరోఽభిప్రేయసోవృణీతే ప్రేయోమందో యోగక్షేమాద్వృణీతే.,"

అని కఠోపనిషత్ 5వవల్లి 2మంత్రం అంది. 1 ప్రేయ మనబడే తాత్కాలిక బాహ్యేంద్రియ సుఖమును, 2. శ్రేయ మనబడే సత్యమైన చిరకాలిక కళ్యాణమును అనే ఈ ద్వంద్వం మానవుడి కెదురైనప్పుడు యోచనాధీరుడైన వాడు శ్రేయాన్నీ, స్వయం యోగక్షేమాలకే పరిమితుడైన మందబుద్ధి ప్రేయాన్ని వరిస్తారు, అని దాని తాత్పర్యం.

మనం బ్రహ్మ (దైవ) తత్త్వం - అవ్యక్తం (un-written Constitution) అనుకొన్న సంప్రదాయ సంస్కృతిని తెలిసికోలేక (దైవాన్ని) ఆ అవ్యక్త బ్రహ్మ తత్త్వం ఉనికి నాక్షేపించి – అంటె శ్రేయాన్ని వదలి ప్రేయాపేక్షులై కొందరి భావాన్ని **Is God Dead?** (దేవుడు చచ్చిపోయాడా) అనే వ్యాసంలో **Walter J. Bado, S. J.** (వాల్టర్, జె. బాడో, యస్. జె.) గారెలా ప్రకటించాడో చదవండి.

"There are first of all, the consciously Godless representatives of atheism in its various existentialists and - Marxist forms ... ... 'God' according to these thinkers only hinders man's freedom and personal responsibility; God is at best only a man's self projection, a futile passion evincing the believers' dispair or his capacity for self deception. Man if he is to be true to himself must shape his destiny with out

**God' An out spoken atheist like Jean Paul Sartre readily admits the precariousneasof human existance thus conceived'**

ఇందులో ఏ వ్యక్తికావ్యక్తి తన గమ్యానికి (దారి) రూపు దిద్దుకోవాలనటంలో ప్రేయమయే ధ్వనిస్తుంది. సార్వకాలికమైన శ్రేయం కనిపించదు. ప్రేయం వ్యష్టిది కాగా శ్రేయం సమష్టిది. సమష్టి శ్రేయంలో భాగం పంచుకోవాలంటే వ్యష్టిప్రేయాన్ని తాత్కాలికంగా అరికట్టాలి. ఆ అరికట్టాన్ని వ్యక్తి స్వేచ్ఛను ఆటంకపరచటం అంటారు. ఏదో బాధ్యత అని ఓ మంచిమాట జోడించినా అది వ్యక్తిగతమే కాని సమష్టికోసం పాటుపడటం కాదు. అది అలా ఉంచితే మానవ స్వేచ్ఛకవకాశం కావాలంటూనే దేవుడు మానవుని భావనలోని అత్యుత్తమ యుక్తికల్పనగా ఒప్పుకునీ కూడా అది వ్యర్థమోహమని మళ్ళీ మానవుని భావస్వేచ్ఛను ఖండించటం ఏమిటి? స్వవచన వ్యాఘాతం కాదూ. అదీ ప్రేయోవాదం. ఎంతవరకూ తన కాయువూ తనకు భాగ్యమూ తన ఔన్నత్యమే గానీ ఎవరేమైపోయినా దానికి పట్టదు.

మానవుడి యుక్తికల్పనంలో ఏమైనా ఉదాత్త సహకార వివేకం ఉంటే దాన్ని అవగాహనచేసుకొని ఉపయోగానికి తెచ్చుకొని అందరూ దాని ఫలం అందుకొంటూ ఉంటె ఏమీ తప్పులేదు. ఉదాహరణకి Banking వ్యవస్థ మానవుడి యుక్తికల్పనమే. Postal వ్యవస్థా అలాంటిదే. ఇప్పుడు వాటిని మానవ బుద్ధికల్పవలని మూసివేయ మనవచ్చా! మరి రాజ్యాంగ వ్యవస్థా అలాంటిదే. కొంచెం ఆలోచించి చూస్తే రాజ్యాంగం యొక్క ప్రణాళికా క్రమరూపమే ఏ మతంలో అయినా దైవవ్యవస్థ, దేవుడు పాలకపిత, ప్రజలు పాలితసంతానం. అలా మానవ జీవనక్రమంలో అవగాహనకి వస్తే ఒకవంక దైవవ్యవస్థ మరోవంక రాజ్యాంగ వ్యవస్థా నీతి ధర్మ కర్మల సర్వజనాభ్యుదయానికి దోహదం చేయ్యగలవనటం ఆశ్చర్యంగాదు, (ఈ పరమసత్యం గ్రహించిన నవభారత రాజ్యాంగం దేన్నీ అధికారమతంగా ప్రకటించక ఏ మతంవారామతం అనుసరించె అవకాశం గల (Secular) దిగా తలెత్తి ప్రకటించుకొంది,) ఆ సర్వజనాభ్యుదయ పరిధి సమష్టిలో ప్రతియొక్కడూ (వ్యష్టి) భాగస్వామి కావాలి. అందుకు

వ్యక్తి స్వేచ్ఛను కాదు అరికట్టేది. ఆ భాగస్వామ్యం అందుకుంటూనే అది చాలక స్వయం (వ్యక్తి) ప్రయోజనం అయిన శ్రేయం వంక పరుగు పెట్టే మనసు నరికట్టాలి. సర్వజనాభ్యుదయం గెల్చుకొనే సామర్థ్యం పెంపొందించుకొనే అవకాశం ఇయ్యాలి అలా ఇచ్చేది రాజ్యాంగ వ్యవస్థా దాన్ని నీతిధర్మవిధుల నడింపించేది దైవవ్యవస్థాను. మానవులనేకం చేసి మానవతను సమకూర్చి సమష్టిలోకి వికలాంగులనూ అనాథలనూ అమాయకులనూ ఇంకా అలాంటి స్వయంశక్తి జీవనులుకాని వారిని కూడా కలుపుకొని (చంపివేసికాదు) వారి రక్షణా సహాయాలకోసం వ్యష్టిని ఉదాత్తునిగా ప్రోత్సహించే దేవుణ్ని (ఒకవేళ మానవుడే యుక్తి కల్పనచే సృజించి యిచ్చాడనుకొన్నా ఆ మానవునియుక్తికి జోహరు చేయవలసేయుంటుంది.) కాదనటం ఏమిటి? ప్రస్తుతంలో Banks లాగే (వేరువేరైనా) దైవాన్ని వినియోగించుకొని నీతి ధర్మ కర్మాచరణులు కావాలి అంతే.

ఎందరోకొందరు దేవుని నమ్మేవాళ్ళ దిక్కులేనీ తనాన్నీ. ఆత్మవంచనా సామర్థ్యాన్నీ మానవుడు సాధించిన యుక్తి ప్రసారాన్నీ సూచించటం అంటూ అది వ్యర్థమోహం అని తలపోయటం వారి వ్యక్తిగతలాబాపేక్షమైన ప్రేయఃకాంక్షను వెల్లడిస్తుంది. కాగా దేవుని అస్తిత్వాన్ని అంగీకరించటంలో సూక్ష్మాన్ని Dr. Henry Emersion Fosdick అనే Paster గారి Whose God is dead' వ్యాసంలో తెలుసుకోవచ్చు.

'To explain the law and the abiding order of the world, nobility of human character at its best, as mere hapinstance, is like saying that the letters of the alphabet were blown together by chance wind to form the works of Shakesphear. I believe there is mind behind the universe, Purpose running through it ultimate meaniug in it and destiny ahead of it. Affirmation of God is, at the very least, the affirmation of these four factors. And demial of god is is the demial of the leavings the universe mindless, Purposeless, ultimately meaningless and on dead end strut (Condition of man' a book of compiled essays.

ఔను మరి ఈ విశ్వానికి వెనుక ఒక బుద్ధి వివేకం ఉంది. దాని ద్వారా ఒక ప్రయోజనం కొనసాగుతూంది. దాని ఫలితమైన కారణార్థం ఉంది. ఎదుట ఒక గమ్యం ఉంది. దేవుడా బుద్ధి వివేకి. దేవుణ్ణి అంగీ కరించకపోవటం అంటే అనాలుగింటినీ వదులుకోవటమే. అలా వదలితే విజ్ఞానశాస్త్ర పరిశోధన లేవీ క్రమబద్ధంగా జరగవు. కాబట్టి అనాలుగూ అలా గే వాటి వెనుక బుద్ధి వివేకిఅయిన దేవుడూ ఉండి తీరాలి. అని తేలుతుం ది స్పష్టంగా. అది శ్రేయోభావన. ప్రేయఃకాములకది ఒప్పదు.

మనం శ్రేయం అంటూ ఎంత ప్రాకులాడినా పాలితులు ఎవరి మతం వారనుసరించవచ్చు. ఎవరి భాష వాళ్ళు మాట్లాడుకోవచ్చు ఎవరి ప్రాంత సంప్రదాయాలు వాళ్లు పాటించుకోవచ్చు అలాటివే గాక అన్నింటికీ మించి ఎవరి అభిప్రాయం (ఉగ్రవాదం) అయినా స్వేచ్ఛ గా ప్రకటించుకోవచ్చు అనే అవకాశం ఇచ్చినప్పుడు వారివారి ప్రేయాల మిరిమీరితే ఇతరుల కిబ్బందులు సృష్టించే గలాభాలు ఎలాగు తప్పవు. ఆదే రాజ్యంలోగనుక అయినట్లయితే అన్ని వైవిధ్యాల వాళ్ళుండరు. ఉన్నాతమ రాజ్య సర్వతోముఖాభివృద్ధియే ప్రధానాశయంగా ఒకరితో ఒకరు రాజీపడి ఆ అభ్యుదయ సాధనలో ఏకాభిప్రాయానికి సంప్రదింపులద్వారా చేసుకో వటం సులువే ఔతుంది. కానీ ఎన్నోరకాల కూటాలున్న భారతదేశంలో అ టువంటిది సాధించాలంటే కొంచెం కష్టమేమరి. ఇటువంటి వైవిధ్యం నుం చి కూడా ఏకత్వం లభించడం ప్రకృతి విరుద్ధం కాదన్న సత్యం గుర్తింప బడింది. కొంచెం అటూఇటూగా స్వామి వివేకానంద అదే అన్నాడు.

"Unity in variety is the plan of nature" (His complete works Vol, P 15) ఆ ప్రకృతి క్రమాన్ననుసరించే రాజ్యాంగంలో రాష్ట్ర ప్రభుత్వ భాగాల వైవిధ్యంలో కేంద్రప్రభుత్వ ఏకత్వాన్ని ప్రకటించారు. నవభారతరాజ్యాంగ నిపుణులు. అందులో శ్రేయాన్ని కాపాడుకోవలసిన సాంస్కృతిక లక్ష్యం సర్వేపల్లి రాధాకృష్ణ.

'Civilised conduct means that you hold the other man as dear to you as you are to yourself It means propegating the

values which India has stood for generations, One wi'l find this essentially necessary in the present time'. (His address Bharatiya Vidyabhavan on 31-10-1964)

"పౌరధర్మి అయిన నడత అంటే నీకు నీ వెలాంటి ప్రియమైనవాక వో [అయం విజః అన్నమాట) అన్యునీ అలాంటి ప్రియం అయిన వాడిగా నే చూడటం అనేదె. ఇలా అనడంలో అభిప్రాయం ఏమిటంటే తరాలనుం చీ భారతదేశం నిలుపుకుంటూ వచ్చిన సర్వసామాన్య విలువలకు వ్యాప్తి కలిగించడం అనే. ప్రస్తుత కాలంలో అది తప్పనిసరి అయిన అవసరంగా ప్రతివాడూ కనుక్కోవాలి. అని ప్రబోధించాడు. మరి ఆ విలువలెంతటి ఉత్తమమైన వంటె వాటినవగాహన చేసుకొని ఆకర్షితుడై జాన్ వుడ్రాఫ్

"Were I am Indian, I should never surrender my soul to any of what value my gift when to obtain if you must cease to be your self.

"నీకు నీవుగా నిలువలేక పోయినప్పుడు ఏమి విలువైన బహుమానం (ప్రతిఫలం) ఎప్పుడు అందుకొన్నా. నేనే భారతీయుడినైతే నా (మనసు) ఆత్మను దేనికీ దాసోహ మవనియ్యను. అని భారతీయాత్మనన్నింటికన్న విలువైందిగా తన భావం ప్రకటించాడు. అంతే కాదు ఆయన భారతతీయు లనెలా హెచ్చరించాడో గమనించండి.

' The Indian who has iost his Indian soul must regains it if he would retain that 'indepinde in his thought and in the ordering of his life which is the mark of a man', (Shakthi and Shakta Pags 37)

తన జీవితక్రమం దిద్దుకొటంలోనూ. తన మనోభావంలోనూ మనిషి అనిపించే గురుతైన ఆ స్వేచ్ఛను కాపాడుకోవాలంటె బారతీయుడు తను పోగొట్టుకొన్న భారతీయాత్మను సాధించుకోవాలి.

ఈ రెండు మాటలూ శక్తి - శాక్తా అనే పుస్తకంలోని గదా అని మత విషయంగా తీసుకో అక్కర్లేదు, మొదటి దాన్లో Indian అనేగాని

Hindu అని లేక పోవటమూ రెండో దాట్లోనూ Indian soul అనీ the mark of man అనియే ఉండడం గమనించాలి అందువల్ల భారతపౌరుడే మనిషి అన్నంతటి దాయన గౌరవబావం అనిపించడం లేదూ !

మనిషిగా అంటే అందరిలోనూ ఆత్మ అనేది ఉంది. అది రాజ్య పరంగా పరిగణిస్తే జాతీయస్పృహ అన్నమాట. వృద్రాఫ్ అలాంటి భారతీయాత్ముడు గావాలన్నదే ప్రకటించుకొన్నాడు. ప్రభుత్వంలో సర్వాధికారి నుంచి సామాన్య పౌరునివరకు అందరూ ఆ జాతీయతకలవారే ఆ స్పృహ లోనే వాళ్లు మెలగాలన్న జ్ఞానం అన్ని తరగతుల జాతీయుల్లోనూ ఉన్నట్లు గ్రహింపుకోసం ఈ ఆత్మ శబ్దాన్ని కలిపిచెప్తే సులువుగా గుర్తించవచ్చు. సర్వాధికారి పరముడు అయితే ఈ జాతీయస్పృహ కలవాడుగా "పరమాత్మ" అన్నప్పుడు కొట్టవచ్చినట్టు తెలుస్తుంది అలాగే సామాన్య పౌరుడు జీవుడైతే జాతీయస్పృహ కలవాడుగా జీవాత్మ అంటే తెలుస్తుంది. శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో శబరీ శ్రీరామ సమావేశ సన్నివేశ పరిమితంగా చెప్పకోవటానికి ఈ స్థూల పరిగణనం చాలు. మరోసారి గుర్తు ఉంచుకోవటానికి స్మరిస్తే జీవాత్మ పరమాత్మల్లో ఆత్మ అనేది జాతీయాంశం కాగా జీవ-పరమ అనే పూర్వబాగాలు తరగతి భేదాన్ని సూచిస్తాయి అని గ్రహించాలి.

ఇప్పడొక జీవుడనే వర్తి పాంచభౌతిక శరీరం అనే ప్రమిదలో ప్రాలి జన్మించటం అనే జగత్ (రాజ్య) ప్రవేశం చేస్తే తలిదండ్రులనే కారణ జీవాత్మ ద్వంద్వం సంప్రదాయ స్నేహం (నూనె)లో తడిపి రక్షణపోషణల ఆ జీవ వర్తిని వృద్ధి ప్రసాధనిగా అజ్ఞానపు కొడి దులిపి ఎగసనద్రోసి శిక్షణగా కొసనలిపి అవ్యక్త (un-written Constitutional) జాతీయాత్మగా పరిణమింపజేయటానికి వ్యక్త (పెద్దలుగా నమోదై ప్రాథమికంగానూ ఏదో తరగతి ప్రభుత్వ బాగస్వామ్యం వహించి) జాతీయాత్మల వెలుగుతూన్ని తలిదండ్రులు వెలిగిస్తే నవజీవ చైతన్యం జీవాత్మ జాతీయ దీపంగా చిరు వెలుగులు చిమ్మటం మొదలు పెడతాడు.

అక్కడినుంచి ఆపాంచభౌతిక శరీరం ఎలాగూ ఎదుగుతుంది దానికా హారపానీయా లందిస్తేచాలు పుష్టికలుగుతుంది అపుష్టి పరుల సహాయాని కి ఉపయోగించాలనే స్పృహ ఎప్పటి కప్పుడు ప్రోత్సహిస్తూం (జీవ వర్తి దిగజారకుండా ఎగసనదోస్తూం) చే ఎదిగేది ఆత్మ (ప్రకాశం) అంతేకాదు అ సలాజీవవర్తి కే వెలుగు నిలుపుకోవాలనే సహజార్తి ఉంటే ఆత్మే అస్పృహ ను ప్రేరేపిస్తూ ఉండాలి. అలా ప్రేరణతో ఎదిగి నిలుకడ సాధిస్తేనే స్థిత ప్రజ్ఞాత్మ ఔతుంది. ఏతరగతి ఆత్మగా నిలదొక్కుకుంటే ఆతరగతిలో స్థిత ప్రజ్ఞుడౌతుంది.

"ఉద్ధరేదాత్మనాఽఽ త్మానం నాత్మాన మవసాదయేత్" భగ.గీ. 6అధ్యా. 5) అని గీతలో ఆత్మచేత ఆత్మనుద్ధరించు కోవాలన్న భావం ఇదే కొంచెం తికమకగా ఉంది కదూ. విమర్శించుకుంటే స్పష్టంఔతుంది.

అసలీ వాక్యంలోని ఆజ్ఞ ముందు జీవుడిని ఉద్దేశించిందిగా గ్రహిస్తే కొంత గందరగోళంవదుల్తుంది ఆజీవుడు పొందిన శరీరాన్నిచూసుకొని ఆ శరీర పుష్టినీ, తలిదండ్రులవల్ల సంక్రమించిన ఆస్తిపాస్తుల్నీ వాటి వల్ల ఆయే పోషణ రక్షణలకు మురిసి-పరోపకారం అనే అనియతజాతీయతను సంప్రదాయమాత్రంగా అంది వచ్చేదాన్ని- ఆ జీవుడు తనకుతానూ పట్టిం చుకోక అతివాత్సల్యం-గారాబంతో తలిదండ్రులూ అంతగా శిక్షింపకవదలి వేయటం (ఇదే ఫ్రాయిడ్ ప్రస్తావించింది) వల్ల ఆ జీవుడికి ఈ జాతీయ స్పృహ -అందరూ తనకే ఉపకారం చేయాలనే స్వార్థమాత్రంగా మిగు లుతుంది(ప్రస్తుతం మానవతావాదం ఈ వెర్రి తల వెయ్యనే వేసి ఉంది.]

అలాకాక ఆ జీవుడు రక్షణపోషణ బాధ్యతలు చిన్నతనంలో తలిదండ్రులూ ఆ తర్వాత తాను సాధించిన ఆత్మ స్థాయిని బట్టి ఆ తరగ తి ప్రభుత్వ భాగస్వామ్యం పంచి రాజ్యమూ వహించి తమ వంతుల శరీరా నికి పుష్టిని చేకూరుస్తున్నారు గనుక తాను (జీవుడు) ఆత్మ (జాతీయ స్పృ హ లేదా పరోపకార క్రమ ఔదార్యం] వంకతిరిగా డనుకోండి. ఆ ఆత్మే

దానికి ఉపాయాలు వెదికి పెడుతుంది. అప్పుడు శాస్త్రజ్ఞాన (సాక్షి) అధ్యయనం మొదలై క్రమంగా తన శరీరపాటవానికి తగిన కార్యక్షేత్రావగాహనతో జీవాత్మ నుండి క్షేత్రజ్ఞాత్మగా ఉద్ధరింపబడతాడు. అంటే శరీరాన్ని కార్యావసరయంత్రంగా తెలిసికొని అది నిర్వహించే కార్యానికి తగ్గ శక్తినిచ్చే రక్షణ పోషణలు మాత్రం గ్రహిస్తూ జీవుడు ఆత్మగా పరోపకార లేదా జాతీయ తత్త్వవివేకంలో తరగతి తరగతి పైకెక్కుతూ అభ్యుదయం సాధించాలి. అదీ ఆత్మచేత ఆత్మనుద్ధరించుకోవటం అంటే

జీవుడలా ఉద్ధరించుకోవటం మొదలు పెడితే అక్కడి నుండి జీవాత్మ చదువులు గడించి జ్ఞానభాండారంగా (సాక్షి + ఆత్మ) సాక్ష్యాత్మ అనే అంచెకు ఉద్ధరింపబడతాడు. ఆ జ్ఞాన ప్రమాణ స్థాయిగా పొందిన కార్యక్షేత్రం (ఉద్యోగనిర్వహణలో ప్రభుత్వంలో భాగస్వామ్యం) వహించి క్షేత్రజ్ఞ ఆత్మ అంచె కుద్ధరింపబడతాడు. అలాతక్కిన అంచెలూ దాటి (సంసారం నించి) తరిస్తాడు, స్థూలంగా ఆ అంచెల తరగతి భేదాలిలా విభజింపవచ్చు.

1. గ్రంథాలయ విద్యాలయాలూ అందుల్లో సిబ్బందీ, తయారైనచట్టాలూ వాటినమలుచేసే కార్యాలయాలూ అందుల్లో సిబ్బందీ. రాజ్యాంగమూ దాన్ని పరిరక్షించే సుప్రీం కోర్టూ - ఆ సిబ్బందీ వంటి వన్నీ - కడపటి రాష్ట్రపతితో సహా సాక్ష్యాత్మ అంచెలోని తరగతి భేదాలు

2. శాసన, లోక్ సభా సభ్యులూ. రాష్ట్ర. కేంద్ర-మంత్రులూ. ముఖ్యమంత్రులూ వంటి వన్నీ క్షేత్రజ్ఞాత్మ అంచెలోని తరగతిలోని తరగతి భేదాలు ఎప్పుడు జీవాత్మల (అయిదేళ్ళకొకసారి ఈ జీవాత్మలన్నీ కూటస్థాత్మ అంచె కెదగటం ఉంటుంది. అప్పుడీ క్షేత్రజ్ఞాత్మలు అదిని జీవాత్మలు నిల్పిన కూటస్థాత్మతన) ఆశయవ్యాప్తిగా మెలగ మన్న బోధనలోనమ్మకముంచి ప్రవర్తింపకపోతే మళ్ళీ యథాప్రకారం సామాన్య జీవాత్మల కడమెట్టు అంచెకు దిగిపోటం ఉంటూంది. ❋

3. పోతే వివిధ ప్రభుత్వ కార్యాలయాలూ వాటి సిబ్బందీ కూటస్థాత్మ అంచెలోని తరగతి భేదాలు
4. సర్వాధికారి రాష్ట్రపతి సాక్ష్యాత్మ అంచెలో అత్యున్నత తరగతికి చెందటంతోపాటు సాంప్రదాయక (Unwritten Constitutional) రాజ్యాంగ వ్యక్తికిగా అంతరాత్మ అంచెలోపై తరగతివాడు. క్రింది తరగతిలో గవర్నర్లుంటారు. (క్షేత్రజ్ఞాత్మలుకూడాను)
5. కడపటిది రాజ్యాంగ పుటంచె అక్కడ వ్యక్తులు లేరు. గ్రంథరూపమే (Written Constitution) సంపూర్ణ వ్యక్త జాతీయతా ముద్ర బ్రహ్మాత్మ లేదా పరమాత్మ

చూసారా ఆత్మవ్యవస్థనుంచి ఎలా మన రాజ్యాంగ వ్యవస్థ అవతరించిందో కనుకనే మన రాజ్యాంగ వ్యవస్థ ప్రకృతి సిద్ధం అనిపించుకొంటూంది. సర్వత్రా జాతీయ స్పృహ నిండి వెలుగొందుతుంది. ఎంతటి యోగ్యతా ప్రమాణాని కంతటి వృత్తి అంటే కార్యక్షేత్రం అనుగ్రహించి జాతీయ స్పృహతో నిర్వహింపబడినంతవరకూ సర్వమానవ కళ్యాణాత్మకమైన శాంతి సౌఖ్యానుభూతిని తదనుగుణ ప్రమాణాల పంచే వర ప్రసాదం ఆవే శ్రేయోరాజ్యం

అందులో అమాయకులూ, అనాథలూ, వికలాంగులూ, దీర్ఘరోగులూ వృద్ధులూ వంటి వారికి కూడా కుటుంబ వ్యవస్థాపరం అయిన ఆత్మీయతావిశేషంగా సమాదర సానుభూతుల రక్షణపోషణల శాంతి సౌఖ్యాలు పంచుకొనే అవకాశం ఇమిడే ఉంది ఒక్కొక్కప్పుడా బాధ్యత కుటుంబం వహించలేని పరిస్థితి ఏర్పడితే అప్పుడూ పరోపకార - ఔదార్య స్వభావం గల సామాజిక సంస్థలా బాధ్యతను తీసుకుంటాయి. ప్రభుత్వమూ కొంత సహాయం అందించే విధానాలున్నాయి.

మరి ఈ ఉదార సహకారదృష్టితో జీవుడాత్మ వంక మరలకుండా తన శరీరపుష్టినీ. సంక్రమించిన ఆస్తిపాస్తులనే ఆశ్రయిస్తే పాపం ఆరెండూ శాశ్వతంకావు. కాలక్రమంలో శరీరపుష్టి తిరిగి వృద్ధాప్యంలో పడక తప్పదు.

అప్పుడా ఆస్తిపాస్తులు కాపాడలేవు సరిగదా వాటిగురించి తగవులూ ఇంకా ఇలాంటి దృష్టిగల దొంగలపాలవటం ఉంటుంది తనను వదులుకోవటం చేత ఆత్మ శాంతి సౌఖ్యాల నియ్యదు. క్రమంగా నరకయాతన పొందు తాడు అలా కాకూడనే భగవద్గీత "నాత్మాన మవసాదయేత్" అని విధించి హెచ్చరించింది.

ఇలా ప్రవర్తకం అయిన ఆత్మవ్యవస్థ మన పటిష్ఠ ప్రజాస్వామ్య (సర్వసత్తాక ప్రజాస్వామ్య గణతంత్ర) రాజ్యాంగ వ్యవస్థ అంత నిర్మాణా త్మకవివేకం కలిగి ఉంది అంటే దాని సర్వాధికారి అయిన దేవుడూ అంత సాధికారికంగా ఉన్నాడని ఆయన అంశలో క్రియాపక్ష వ్యవహర్త అయిన ప్రధానిలా అంతరాత్మగా ఒకవంకా-అత్యవసర పరిస్థితుల్లో కర్తవ్య బోధ కుడు ఇతరవేళల వట్టి అధికారముద్ర వ్యవహర్త అయిన రాష్ట్రపతిలా సాక్షిగా మరోవంక అవతరిస్తూండటం నమ్మరాని విషయం ఏమీకాదు. శ్రీ మద్రామాయణ కల్పవృక్షంలో శ్రీరామ పాత్ర ఆ అంతరాత్మే అనీ లక్ష్మణ పాత్ర ఆసాక్షే అనీ ఇంకా సీతపాత్ర జీవుడనీ, శబరిపాత్ర క్షేత్రజ్ఞుడనీ, మతంగ మహాముని పరోక్షపాత్ర కూటస్థుడనీ సప్రమాణంగా "కల్పవృంక్ష లో శబరి-శ్రీరాముడు" అనే నామూలవ్యాసంలోనే వాళ్ళ చర్యల గుణశీల నిర్ధారణచేసి ప్రస్ఫుటంగా ఉన్నట్లు నిరూపించే ఉన్నాను. అక్కడ సాగింది ఒకవంక అధ్యాత్మిక జీవన స్రవంతి అయితే మరోవంక సర్వ సత్తాక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యాంగంలోని జాతీయ జీవన స్రవంతి గా ఎలా నిరంతర ప్రవాహమై మన నైతిక, సౌజన్య, ఔదార్య, యధా సామర్ధ్యావకాశక సాంస్కృతిక విలువల ప్రపంచంలోని సర్వప్రజానీ కానికి ఆదర్శప్రాయమై ఉన్నదీ అన్నదని నిరూపించటానికే ఈ అను బంధం ముడుపు. ఇట్టి ఔదార్య ప్రియ విద్యకోసం ఇతరులెలా ఎదురు చూస్తున్నారో పెస్టాలొజ్జీ మాటల్లో చదవండి.

"The essence of training man's nature is to edveaw man-kind to understand love ... ... love is the sole of ever-lasting

foundation on which our nature can be trained to humaneness" (quoted by Ashley Montage in his own essay "Communication - Evolution - and Education" in Human Dialogue a book of essays.)
తర్వాత జీన్ హెర్బర్ట్ గారి మాటలు చదవండి.

"Iam one of those, who definitely believe that the world will never find salvation unless the west learns at the feet of India, how to controle its material power through spiritual values" (Quoted in Vedante Kesary July 1946)

కాగా నేను మతసహనం కలిగి ఉండటమే అసలొక మతం అంటే కొందరికి సరిపడకపోవచ్చు. అయినా అవినీతినీ, అక్రమాన్నీ, అధర్మాన్నీ నియమరాహిత్యమైన విచ్చలవిడితనాన్నీ ఏ మతమూ బోధించటంలేదనే నేను స్పష్టం జేసేది. కాబట్టి ఏ మతం అయినా అసలంటూ అనుసరిస్తే జాతికా పైవిలువలు తప్పక నిలిచి నీతి. క్రమవిధానం, ధర్మం, నియమం గల క్రమశిక్షణా యుతమైన ప్రజాస్వామ్య సంస్కృతి ప్రకాశించ గలుగుతుంది. దేశకాలపరిస్థితుల అవగాహనలో క్రమంగా అంతర్భేదాలు సర్దు బాటుచేసుకోవటం సహజ పరిణామం. అదే జాతీయజీవనంలో ముఖ్యం. క్రింది సురేశ్చంద్రగుప్తా మాటలు గ్రహించండి.

"Religion is not an abstract realisation only but also an active and dynamic force in our own life which pushes us on and on in our higher efforts" (Vedanta Kesari 1929 Page 99)
ఈ సత్యాన్నే నేనీ అనుబంధంలో సహేతుకంగా నిరూపించాను. ఇప్పుడు దీన్ని బట్టి భారతీయుల కర్తవ్యాన్ని డా॥ వి. కె. ఆర్. వి, రావు ఎలా ప్రబోధిస్తున్నాడో అందుకోండి.

"The great task lying before all of us was to develop a sense of National Pride in Indian Culture and civilisation" (Address in Bharatiya Samskrita Bhavan on 26-11-196[illegible])

ఎంతమంది ఎంత సహేతుకంగా వివరించినా ప్రేయోవాదులకు ఈ శ్రేయోవాదం మీద విశ్వాసం కుదరకపోవచ్చు. వాళ్ళకి వాళ్ళగొడవేగాని

ఇతరులేమైనా అంతగా పట్టదు. ఏదోరకంగా వాళ్ళను తట్టుకోవచ్చు. కాని అంతర్యంలో ప్రేయం (స్వార్థం) గూడుకట్టుకొని అందరినీ శ్రేయం కోసమే జీవితం ధారపోస్తున్నామని వంచించే వేషధారులతోనే జాతీయ సమగ్రభావానికి ముప్పు. వాటిని వాళ్ళు పురాణాలమీద కెగబడి విషలిప్తం జేస్తున్నారు. ప్రస్తుతం రాముడిమీద రామాయణంమీద ఎగబడి వేసిన అవిష లిప్త వర్ణాన్ని విరుగుడు పసరుపెట్టి గరుకు కాయితంతో గీరి వదలించి యథాతథంగా చేస్తే అసలు ప్రకృతి అవగాహనకు వస్తుంది. ఆ ఉద్దేశం తోనే శబరి-శ్రీరామ సమావేశ కథామాత్రభాగాన్ని నావంతుగా తీసుకొని పరిశుభ్రం చెయ్యటానికి చేతనయినంతవరకు ప్రయత్నించాను. తక్కింది మీ ఇష్టం.

ఆఖరిమాటగా మీరు జాతీయ సమగ్రతను వైవిధ్యంలో ఏకత్వం ప్రకృతి లక్షణమే అంటూ ఉపనిషత్తులు పట్టుకువచ్చారుగదా! సరే మీ రన్నట్లు భారతదేశం అంతటా భారతీయులున్నారనేది కాదనలేని నిత్య సత్యం-ఒప్పుకొన్నాం. మరి అలాగే ప్రతి భారతీయుడిలో భారతదేశ భావన ఉందని చెప్పగలరా అని అడుగవచ్చు. ఔను అమాటా కచ్చితంగా చెప్ప గలను. ఇదిగో దర్శనోపనిషత్ చతుర్థ ఖండంలో.

"శ్రీ పర్వతం శిరఃస్థానే కేదారంతులలాటకే। వారాణసీ మహాప్రాజ్ఞ। భ్రువోర్ఘ్రాణస్య మధ్యమే। కురుక్షేత్రం కుచస్థానే। ప్రయాగం హృత్సరోరు హే। చిదంబరంతు హృన్మధ్యే ఆధారేకమలాలయమ్॥" (తలయందు శ్రీ శైలమూ, నుదుట కేదారమూ, ముక్కు కనుబొమల నడుమ కాశీ, ఎదురొ ము్మన కురుక్షేత్రం, పద్మంలాంటి హృదయంలో ప్రయాగ అ హృదయం మధ్య (పద్మకర్ణికయందన్నమాట) చిదంబరం ఆధారంలో కొల్హాపురం ఉన్నాయంది)

శ్రీ పర్వతం అనగానే అలవాటుగా మల్లికార్జునుడి శ్రీశైలం అను కుంటాం కానీ అది 'శ్రీర్వేషరచనాశోభా భారతీసరళద్రుషు' అన్నవిశ్వకోశం

లో వేషరచన స్వీకరిస్తే మంచునలంకారంగా ధరించిన పర్వతంగా కైలాసం తో గూడా హిమవంతం అయితే - అలాగే కమలాలయం లక్ష్మి నివాసంగా కొల్హాపురం అనుకుంటాంగానీ "కమలా శ్రీవరస్త్రియోః" అన్నవిశ్వకోశం లోని వరస్త్రి అర్థం గ్రహిస్తే అది కన్యాకుమారి ఆలయం అయితే - మొత్తం ఆసేతుశీతాచలం అయిన భారతదేశమే-భారతీయుడికి స్వదేహం, అనే భావాన్నందించలేదా ఉపనిషత్తు!

కాగా ఆత్మవ్యవస్థను గూర్చిన గుర్తింపుగా ఎవరి ధన-బలాలనుబట్టి వారికందించటమే అందులోని పరమార్థం. కార్యక్షేత్రం విస్తరించి ఉండి తగినంత ఆదాయమూ ఆయురారోగ్యయోగమూ ఉన్నవాడు నిక్షేపంగా యాత్రలన్నీ చుట్టివస్తాడు, మరి కార్యక్షేత్రం సంక్షేపింపబడి అల్పాదాయ మూ అంతంతమాత్రపుటారోగ్యయోగమూ గలవాడు మల్లికార్జున శ్రీశైలము కొల్హాపుర కమలాలయాల సరిపెట్టుకుంటాడు. ఆమాత్రపుటాదాయమూలేక తానంటూ మనిషిగా ఉంటే ఉపనిషత్తు ననుసరించి తనయందే భావించు కొని ఆయాత్రల పరిపూర్ణ ఫలం అందుకొంటాడు. అది భక్తే అయినా జాతీయతే అయినా ఆ విషయంలో భావం ప్రధానం. అవకాశాలన్నీ ఉండి యాత్రకే వెళ్లినా మనిషికి అక్కడి దైవం మీద కన్నా (మధ్యస్థులకి దైవ భావమూ నిలువవచ్చు కొందరికి క్రొత్తగా కలుగనూవచ్చు) అక్కడి వింత లూ విశేషాల మీదికి మనసు ఎక్కువ పరుగులు పెడుతూండటం మా మూలు, ఇంక ఆ అవకాశం లేకగాని ఇతరంగాకాని ఇంటిలోనే ఉన్నా స్వదెహంలొనే ఆ దైవాలను గుర్తించుకొనే బావనే ఉంటె ఇంక మనసెక్క డికి పోతుంది! అతనికున్న భక్తేగాని జాతీయతేగాని అతనిలో పండితీర వలసిందే. అందుకనే ఉపనిషత్తు ఆత్మతీర్థానికి ప్రాధాన్యం ఇచ్చి

ఆత్మతీర్థం సముత్సృజ్య బహిస్తీర్థాని యోవ్రజేత్।
కరస్థం మహారత్నం త్యక్త్వా కాచం విమార్గతే॥

ఆత్మతీర్థం వదలుకొని బాహ్య తీర్థాలకని వెళ్లేవాడు చేతిలో ఉన్న మహా రత్నాన్ని పారవేసుకొని గాజురాళ్ళ కోసం గాలింపుకి వెళ్లినట్లౌతుందని ప్రక

టించింది. దీనివల్ల క్షేత్రాలను తక్కువచూపు చూసిందనుకోకూడదే! అలా అయితే వాటినే దేహంలో ఎందుకు భావించమందీ! అది మనం గుర్తించ వలసిన విషయం.

అదండీ! మన ఆత్మతత్త్వంలో అంతర్లీనమై పెంపొందుతూ వచ్చే జాతీయ తత్త్వమూ అందులోని సామ్యవివేకమూను ఉన్నవాళ్లను కొట్టుకు తినమనేదీ, పెద్దవాళ్లు గడించి పెట్టింది పంచుకుతినమనేదీ కాదు. శక్తి దాచుకోక ఒళ్లువంచి పనిచేసి దక్కిన ఫలం భుజించమంటుంది. జాతీయా దాయాన్ని పెంచుకొని అమృతం ఆరగించమంటుంది. అదీ మన శ్రీయో రాజ్యం భారతం. ఆ తల్లి అమృత పుత్రులం మనం.

"తమేవం విద్వానమృత ఇహభవతి।"

---

※ఈఅంచెల విషయం శ్రీ కృష్ణదేవరాయలు తన 'ఆముక్తమాల్యద'లో ప్రస్తావించాడు గమనించండి. 3వ ఆశ్వాసంలో 79 వచనం చివర్లో

"అందు కర్మాఖ్య శక్తి చేత వేష్టితయై యపరాఖ్య యగు క్షేత్రజ్ఞశక్తి జన్మజరామరణాద్యనేక సంసారతాపంబు లనుభవించుచుఁ దత్తత్కర్మాను గుణ శరీరంబులెత్తి విజ్ఞాన తారతమ్యంబుల నొందుఁ దత్ప్రకారం బాకర్ణిం పుము.

సీ. ఉండు నప్రాణులం - దొక్కించుకాశక్తి
స్థావరశ్రేణిఁ ద - జ్జాతి కంటె;
నెక్కురోఁకటిబండ - జెట్టీ మన్నిందిము
న్నగు సరీసృపములం - దంత కంటె;
ఖగముల మఱి వాని- కంటె; మృగావలి
యందునూహింపంగ - నంతకంటె;
దంతి గోముఖపశు - తతి నంతకంటె; మ
ర్త్యకదంబకములయం - దంతకంటె;

తే. గీ. యక్షగంధర్వనాగాళి – నంతకంటె;
నంతకంటె నిలింపులం; – దంతకంటె
హరిహయుని యంఁదు, దక్షునం – దంతకంటె
నాద్యుఁడు హిరణ్య గర్భునం – దంతకంటె ప. 80

ఆ. వె. ఇట్టి రూప కోటు – లెల్లనవ్విష్ణుని
తనుచయంబుసుమ్ము – ధరణినాథ!
యతఁడచింత్యశక్తి – నఖిల భూతముల నా
కసము వోలె నిండి – యెసఁగుఁగాన ప 81

శ్రీ కృష్ణదేవరాయలు వివిధ జాతి రూపాల చూపించినదే నేను మను ష్యుల్లో పౌంబాధ్యతారూపాల కన్వయించి చూపి సర్గాభివృద్ధి సంస్కారాభి వృద్ధిగా చేకొనటంగా స్పష్టం చేసాను. గుర్తింపగలరు.

జొన్నవిత్తుల రామకృష్ణ శర్మ
తెలకోవెల, బలుసుమూడి
భీమవరం. ప. గో. జిల్లా-534 202



## అనుబంధం-2

బ్రహ్మవృక్షైరక్ష్యమాణో మధుహేమచవర్షతి ।
అరక్ష్యమాణస్సతత మశ్రుపాతంచ వర్షతి॥ భారత. 12. 73-14.

బ్రహ్మ అంటే "అతోబృంహణాత్ బ్రహ్మేతి వ్యుత్పత్యా దేశకాలవస్తుతః పరిచ్ఛే దాభావరూపం నిత్యత్వం ప్రతీయతే" (ఇంక విస్తారంచేత బ్రహ్మ అనే వ్యుత్పత్తి గ్రహిస్తే దేశమనో కాలమనో విభాగంలేని ఓరూపం అదినిత్య త్వం అనిపిస్తుంది.)

"బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభిః" (ఋగ్వేద 1-155-6) దీనికి సాయణభాష్యం "ఏవంకాలాత్మకః విష్ణుః బృహచ్ఛరీరః విరాడాత్మ నా సర్వదేవమనుష్యాది శరీరాణాం స్వశరీరత్వాత్ బృహచ్ఛరీరత్వమేవో పపాదయతి." అని. (కాలాత్మకుడు విష్ణువు పెద్దశరీరంగలవాడు విరాడ్రూ పంలో దేవమనుష్యాదులన్ని శరీరాలూ తనశరీరంగాఅయి (కలసిపోయి నపెద్ద శరీరమే ఉపపాద్యం అయింది.) సామాన్యుల ఊహకలా (భగవద్గీత లోని విశ్వరూపంలా) అందించినా కాస్త ఆలోచించగలవాళ్లు అది పరిమా ణం మాటెలాఉన్నా ఉత్తరోత్త రోన్నతోన్నత మహత్వంలో క్రమవికాసంలో సాధింపబడిన గొప్ప-అనిగ్రహించగలరు. ఈ క్రమవిధానం గమనించండి.

ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్యశ్చపరం మనః
మనసస్తుపరాబుద్ధిః బుద్ధేరాత్మ మహాన్ పరః
మహతఃపర మవ్యక్తం అవ్యక్తా త్పురుషః పరః
పురుషాన్న పరం కించి త్సాకాష్ఠా పరాగతిః (కఠోప. 3.10.)

జీవుల్లో-ఇంద్రియాల (శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణాల) కంటె తన్మాత్ర లు (శబ్ద స్పర్శ రూపరస గంధాలు) గొప్పవి. వాటికంటె మనసుగొప్పది. ఆమనసు కంటె బుద్ధి గొప్పది. (ఇంతవరకూ ఈ 12 తత్త్వాలూ కలది లిం గశరీరం) ఇప్పుడాబుద్ధి కంటె ఆత్మ (ఒకసమష్టివ్యవస్థాభావం) గొప్పది. దానికందుకే మహత్తు అని మరోపేరు. ఆమహత్తు కంటె అవ్యక్తం(జ్ఞానం-

అదే అభ్యుదయ వాదం) గొప్పది. అలాంటి అవ్యక్తం కంటేకూడా పురుషు డు (కార్యశీలయోగ్యుడు) గొప్పవాడు. అంతకు మించి కంట్లో కలికంపె ట్టుకు వెతికినా గొప్పది ఇంకోటి లేదు. కనుక అదే దిక్కు. అదేగమ్యం. మొత్తం తత్త్వాలన్నీ పురుషుడిలో చేరిపోగా (తానో సంచీలో) నిండి పోయా డు కనుకనే ఆయన (పురుష స్సర్వపూరణాత్) పురుషు డయ్యాడు. అం టే అన్నింటినీ లోపలపెట్టుకొన్న (భగవద్గీతలోలాగే) పెద్ద రూపమే అన్న మాట.

ఒకసారి మనం మొదటి అనుబంధంలో వివరించుకొన్నది సరి అ యిందేసుమా అని సరిచూసుకోవటాని క్కూడా ఇది ఉపయోగిస్తుంది ఇం ద్రియాలనుంచి బుద్ధిదాకా ప్రతీపాంచభౌతిక శరీరమూ (పంచభూతాలు పృధివ్యాపస్తేతో వాయురాకాశాలు-వాటి కలయికే యీ శరీరం.) తనలో కలిగి ఉండి అన్నిప్రాణు లనిపించుకుంటాయి ఆ ప్రాణి సహజ వ్యుత్పన్న తకు ఆత్మతోడు అయితే ఒకవంక బ్రహ్మస్పృహ మరోవంక జాతీయ (రాజ్యాంగ) స్పృహ కల జీవుడౌతాడు. అతడు పరిసర సంప్రదాయ (un-written constitutionals) విజ్ఞత ఒక వంక భక్తుడూ మరోవంక స త్పౌరుడూ (క్రింది తరగతి)గా సాక్షి (క్రింది తరగతిగా) ఔతాడు, అలా జ్ఞా న స్పృహ గెల్చు కోవటం వల్లమహత్తు అనబడ తాడు, స్థితప్రజ్ఞుడు (క్రిం దితరగతి)కూడా ఔతాడు. అప్పుడు యోగ్యవిద్యా సామర్ధ్యాల తన కార్యక్షే త్రం తెలుసుకొని ఒక వంక ఔదార్యవంతుడూ రెండో వంక ప్రభుత్వం లో భాగస్వామ్యంగలవాడూగా క్షేత్రజ్ఞుడౌతాడు. (ఇది రెండో తరగతి మొ దటి తరగతి క్షేత్రజ్ఞుడు ప్రాణియే). అపైన జీవుని క్రమంలో బ్రహ్మ(దేవ -వేదాల) పౌరునిక్రమంలో రాజ్యాంగ గ్రంథమూగా ఉభయత్రా ఓ అభ్యు దయ ప్రణాళిక ఇందులో ఉంది.

రాజ్యాంగ వ్యవస్థలో ప్రభుత్వం నిర్వహించే వివిధాంగాలూ వాటి ఉ పాంగాలూ (పదవుల్లో ఉన్నవాళ్లూ పాలితులైన ఇతర పౌరులూ) కూడా మ రి ఏకదులూ మెదులూ లేని కాయితాలబొత్తి అయిన ఓ గ్రంథం (భారత

రాజ్యాంగం) నిర్ణయించిన విధంగా నడుచుకోవాలంటారే! సరిగ్గా అలాగే ఆత్మవ్యవస్థలో జీవులన్నీ బ్రహ్మ (నమ్మకం ఉన్న ఏ మతంవాడైనా అందులోని దేవుడు) నిర్ణయించిన విధంగా నడుచుకోవాలంటే ఆక్షేపణ ఎందుకుండాలి! ఆ రాజ్యాంగ వ్యాఖ్యాతల్లాగే ఈ బ్రహ్మతత్త్వ వ్యాఖ్యాతలూ తమమూలరూపం ఉనికి కాపాడుతూనే ఉంటారే! తెలుసుకోరేం!

కాగా రాజ్యాంగ వ్యవస్థలో ఎప్పుడైనా కాలం కర్మం కూడిరాక అత్యవసర పరిస్థితి ఎదురైతే ఆ రాజ్యాంగాన్ని సవరించుకొనే అవకాశం ఉన్నట్లే ఆత్మ వ్యవస్థలోనూ కాలపరిణామాన్నిబట్టి సంప్రదాయాలూ మార్చుకోవచ్చు. ఆ స్వేచ్ఛ ఎప్పుడూ ఉంది. కడకు ఆత్మవ్యవస్థలో కూడా రాజ్యాంగ వ్యవస్థలోలా గ్రంథ గౌరవం మాత్రం చూపినా చాలనటంకూడా ఉంది. అందుకే వేదాన్నీ దైవాన్నీ సమంగా పరిగణించటం.

"వేదోఽసి యేనత్వం దేవ వేదదేవేభ్యో వేదోఽభావః తేన మహ్యం వేదోభూయాః" (వాజసనేయ సంహిత 2.21 - ఓ దేవా దేనివల్ల దైవీ శక్తివంతులకు నీవు వేదమై ఉన్నావో ఆ దైవీసంపన్నత నాకూ కలిగించి వేదంలా సాక్షాత్కరించు.) అనే మంత్రంలో స్పష్టంగా దేవ-వేద పర్యాయ ప్రయోగం ఉంది. అలా జీవుడి నుంచి దేవుడి వరకూ (బీజారోపణం మొలకెత్తటం చెట్టై ఫలించటంగా ఎదిగే ఈ ఆత్మవ్యవస్థ బ్రహ్మవృక్షం అనిపించుకుంటుంది. ఆ వృక్షాన్ని స్వయం కృషితో కాపాడుకొంటూ వస్తే అమృతాన్నీ హేమాన్నీ (విలువలని) కురుస్తుంది. అలా కాపాడటం అలక్ష్యంచేస్తే ఎప్పుడూ దుఃఖాశ్రువులనే కురుస్తుంది. అని భారతం స్పష్టం చేసింది.

ఇప్పటికీ ఈ మన సంస్కృతి యందు విశ్వాసం కుదరలేదనే వాళ్లెవరైనా ఉంటే వాళ్ళనలా వదిలెయ్యండి. ఒకప్పటి ప్రత్యక్ష అంతరాత్మను తచ్ఛుద్ధ చైతన్య ప్రకాశ వైశిష్ట్యం మీద పరిపూర్ణ విశ్వాసం ఉంచుకొని ప్రస్తుత శ్రీమద్రామాయణ గ్రంథ బ్రహ్మత్మగా నమ్మి ఆదర్శం కోసం

ఆశ్రయించి ఆ సంస్కృతిని నిలుపుకొని ప్రదర్శించే మరోయత్నంగా ఓ ప్రత్యక్ష సాక్ష్యాన్ని మీ ముందుకు తెస్తున్నాను.

"రామాయణ కల్పవృక్షంలో "శబరి-శ్రీరాముడు" అనే మూలవ్యాసంలో తర్వాత చెప్తానంటూ వాయిదావేసిన విషయమే అది శబరిని చూడాలనే కోర్కె భార్యావిరహజడుడైన శ్రీరాముని మనసులో తారాడజేయటానికి కుసుమబాణుడు ఆయన మీద పూతూపు వేసి కొట్టటం అనే అత్యంత వివాదగ్రస్తావకాశంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన మధ్యాక్కరకందాల దురదకు విరుగుడే అది సాక్ష్యం ఆకాశాన్నుంచి నక్షత్రకూటంలో ఓచోటి దృశ్యాన్ని మీ ముందుకు తెచ్చి నిరూపిస్తాను. శబరి నీయ ముట్టక పోవటం ఏమిటో దాని మూలంగానే తేలిపోతుంది. దైవం అనుకూలిస్తే.

మనం బ్రహ్మఆత్మను పురుషుడనటం గ్రహించే ఉన్నాం. ఆ పేరున ఋగ్వేదంలో ఒక సూక్తం ప్రవర్తిస్తోంది. అదే పురుషసూక్తం. అందులో 'నక్షత్రాణి రూపమ్,' నక్షత్రాలో ఆ రూపం ఉంది అని ప్రకటింపబడి ఉంది. అదే ఆధారం మనకి. అయితే నేనాపురుషుని పూర్ణరూపం పట్టి ఇస్తానని భ్రాంతిలో పడకండి. ఏదో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి కల్పిత సన్నివేశానికి మాత్రం ఓదృశ్యం వెదుకుతాను అంతా పెద్దలదయ.

మనం ఆ దృశ్యాన్ని ప్రదర్శనకు తేవాలంటే ముందుగా తగినవేదిక సమకూర్చుకోవాలిగా, ఆ ముడిసరకులకు వినుకోక సావధాన మనస్కులై పరికిస్తూండండి. ఎప్పుడో ఆ దృశ్యం మీకళ్ళముందు తళుక్కుమంటుంది ప్రస్తుతానికి వేదంలో కొన్నిచోట్ల ఒకే ఋక్కుకి వేరే వేరే ఎన్నో అర్థాలు

చెప్పవచ్చుననటానికి నిదర్శనంగా హరిసోదరులు తమ "భారతీ నిరుక్తి" అనే గ్రంథంలో 356 పుటలో ఏమన్నారో చదవండి.

"చత్వారిశృంగా యను నీమంత్రమునకిట్లు యజ్ఞ యజ్ఞేశ్వర పరము గానే గాక ఓంకారపరముగను, వేఱొకచో సూర్యపరముగను మఱియొకచో వైయాకరణులచే శబ్దబ్రహ్మపరముగను, మంత్రశాస్త్రవేత్తలచే పరావాక్ పరముగను బెక్కురీతుల వినియోగమును సమన్వయమును గన్పట్టు చున్నది." అన్నారు. అంతేకాదు హరికథా పితామహ శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణ దాసుగారు సంగీతపరంగానూ అన్వయించి చూపారు. అంటే కుదిరేటట్టయితే మనం మన నవభారత రాజ్యాంగపరంగానూ అన్వయించి చూపవచ్చునన్నమాట. ఆ ప్రయత్నానికి ముందా మంత్రం చదివి గుర్తు పెట్టుకోండి.

చత్వారిశృంగా త్రయో అస్యపాదా। ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య।
త్రిధాబద్ధో వృషభోరోరవీతి। మహాదేవో మర్త్యాగ్ం అవివేశ॥

ఋగ్వేదం 4-58-3

మేషాశ్వి ప్రథమాన వర్క్షచరణాశ్చక్రస్థితారాశయో
రాశిక్షేత్రగృహర్క్షభాని భవనం చైకార్థ సంప్రత్యయాః॥

అని బృహజ్జాతకమ్. సంజ్ఞాప్రకరణ 4వ శ్లోకంలో కాలపురుషుని శరీరాంగ భాగాలు పన్నెండూ పన్నెండు రాశుల్లో నప్పిన దాన్నుంచి (మొదటిది తల కాగా) రెండో అంగభాగం అయిన ఆననం అంటే ముఖం - అలాగే రాశి చక్రంలో వృషభానికి నప్పి ఉంది

మనం మరచిపోకుండా మనసులోగుర్తు నిలుపుకోవటానికి మరోసారి చెప్పుకుంటే మనం వెదకులాడే వృషభం ఖగోళంలోగల రాశి చక్రంలో ద్వితీయం అవటమే కాకుండా కాలపురుషుని ద్వితీయావయవ భాగం పంచజ్ఞానేంద్రియ నిలయ ప్రాముఖ్యం ఉన్న ముఖం అని స్పష్టంచేసాడు వరాహమిహిరుడు తన బృహజ్జాతకం 4వ శ్లోకంలో. ఆ తర్వాతదైన 5వ శ్లోకంలో ఆరాశి స్వరూపం "శేషాః స్వనామ సదృశాః స్వచరాశ్చ సర్వే" గా కొన్ని రాశులకు ప్రత్యేక రూపాలున్నా యని వివరించి చివర మిగిలిన రాశులకు పేర్లకు తగ్గ రూపాలే ఉన్నాయన్నాడు. అంటే మన వృషభరాశి స్వరూపం ఎద్దు అన్నమాటె. కాగా వెనుకటి నాల్గవ శ్లోకంలోనే రాశి చక్రం పన్నెండు ఇళ్ళలోనూ నక్షత్రానికి నాలుగేసి పాదాలుగా చేసుకొని మేషాదిగా తొమ్మిదేసి పాదాల చొప్పున అశ్విన్యాదిగా ఉంటాయని సూచించాడు. మాటవరసకి మేషం ఇంట్లో అశ్విని నాల్గు పాదాలు + భరణి నాల్గు పాదాలూ + కృత్తిక ఒక్క పాదమూ మాత్రం చేరతాయి. అలా వరసలో రాశికి తొమ్మిదేసి నక్షత్ర పాదాల చొప్పున ఉంటాయన్న మాట.

అది అలా ఉంచితే అశ్విన్యాది నక్షత్రాల సంఖ్య ఇరవై ఏడుగా పేరుకోనక్షత్రం అనిపిస్తాయి. కాని చాలా చోట్ల అవి గుంపులు గుంపులుగానే ఒక్కో గుంపు ఒక్కో ఆకారం ఏర్పడే (సమవేగం-అల్పమైనా చలనం లో గల) ముగ్గు చుక్కల్లా ఉంటాయి.

ఉదా : సీ. అశ్విని మూడుండు - నశ్వముఖము వోలె
భరణిపాయ్ గడ్డల - పగిది మూడు
కృత్తికమంగలి - కత్తిగా నాఱుండు
నైదు రోహిణీ రథ - మనంగ నుండు
లేడితల యనంగ - మూడు మృగశిరకుం
డు పగడముగనొకం-డుగలదార్ద్ర

అలా అలా ఉంటాయి. కాగా సూర్యుడూ చంద్రుడూ గురు శుక్రాది గ్ర హలూ ఇలాంటి గుర్తు గుంపుచుక్కల వెంట కొంచెం కుడి ఎడమలుగా గుడుగుడుగుంచం తిరుగుతూంటాయి. ఇవికాక ఆకసాన ఇంకా లెక్కలేనన్ని నక్షత్రాలున్నాయి. కాని మనం ఉపయోగించుకొనే ఇరవైఏడు (అభిజిత్తు తో కలిపి ఇరవై యెనిమిది) మాత్రమే కాలమాన విధాయకాలై రాశిచక్రం లో కుదురుకొని పేరుకెక్కాయి. మరి ఆ కాల పురుషుడియొక్క ముఖ భాగం అయిన వృషభరాశి వివరం "నక్షత్రములు" పుస్తకం 37 ఈ 38 పుటల్లో ఇలా ఉంది.

"కృత్తిక మూడుపాదములు + రోహిణీ + మృగశిర1/2.2. పాదము లు. ఇవన్నియుచేరి వృషభ మగును. ఇట్లు కృత్తికలో ముప్పాతికపాలు వృషభరాశిలో చేరియుండుటచేత ('కృత్తిక అగ్నిదైవత్యము గనుక అగ్ని కృత్తికలోనున్నాడు" అని ఇంతకుముందె వివరంఉంది.) అగ్ని వృషభరాశి స్థితుడని నిర్ధారింపనైనది. కాబట్టి కర్మకాండలో అగ్నినాహ్వానించు నపుడా అగ్ని కాశ్రయమైన వృషభరాశి ప్రశంస మిక్కిలి యవసరమైనది. ఈ హేతువునుబట్టి ఈవృషభరాశి యిట్లు ప్రశంసింపబడినది:

"చత్వారిశృంగాత్రయో అస్యపాదా ద్వేశీర్షేసప్తహస్తాసో అస్య త్రిధాబద్ధో వృషభోరోరవీతి మహాదేవో మర్త్యాऽగ్ం ఆవివేశ" అని

ఆతరువాత ఈమంత్రం అగ్నిస్వరూపవర్ణనగా చక్కని వ్యాఖ్యానం

ఉంది 'నక్షత్రములు' పుస్తకంలో. ఈమంత్రానికి ఉన్నవ్యాఖ్యాల్లో ఇదీఒకటి మరోలా మనమూ వ్యాఖ్యానించుకోవచ్చు. అంతకుముందే ఈరాశిలో ఉండే మూడునక్షత్రాలతోపాటు ఆర్ద్రను కూడా కలుపుకొని వాటి అధిదేవతల విషయం తెలుసుకొంటే మనకథకు ఓప్రణాళిక అందే అవకాశం ఉంది.

కృత్తికాశ్చాగ్నిదైవత్యం రోహిణ్యాబ్రహ్మణస్మృతః।
ఇల్వలో సోమదైవత్యా రౌద్రంచార్ద్రం ముదాహృతః॥

అనిగరుడ పురాణం 58-21. లో ఉంది. దీన్నిబట్టి కృత్తికకు-అగ్ని; రోహిణికి-గురువు (బ్రహ్మణః అంటె బృహస్పతి లేదా ప్రజాపతి) పోగా ఇల్వల అంటే మృగశిర. దానికి-సోముడు. ఆర్ద్రకు-రుద్రుడు అధిదేవతలు. ఈ అధిదేవతాక్రమాన్ననుసరిస్తే (వేరువేరుగా ఉన్న దేవుడొకడే అనీతేలుతుంది) మనం చక్కని కథలూ కల్పనాలూ సాగించవచ్చు.

అది ఆర్ద్రతో మొదలుపెడదాం. అఒంటరి రుద్రుడు ఉమచేవరింపబడి ఆమెను అర్ధాంగిగా చేసుకొన్న కథ (పార్వతీకళ్యాణం) నడిస్తే మృగశిర సోము డౌతాడు. సోమశబ్దార్థం అదే. (ఉమయాసహవర్తత ఇతిసోమ) ఉమతో కలసి ప్రవర్తించేవాడు. అర్ధనారీశ్వరుడని తాత్పర్యం. అది ఉమాశంకరయోగం. అలాంటి "ఉమాశంకరయోర్యోగ స్సయోగో విష్ణురుచ్యతే" అనియాజుషీయ రుద్రహృదయోపనిషత్. ఆసోమయోగాన్ని విష్ణువంటారని తేల్చి చెప్పింది. అది విష్ణ్వవతారపరంగా. మన కల్పవృక్షంలో శబరి -శ్రీరాముడు వ్యాసవిషయంగా సీతారామయోగం అన్నమాట.

అయితే వృషభరాశిలో ఈయోగం ఉన్న నక్షత్రం అయిన మృగశిర సగం (రెండుపాదాలు మాత్రమే) ఉంది. ఆసగం సీతనెడబాసిన శ్రీరాముడన్నమాట. అలా శ్రీరాముడు 'చేగసమస్త మయ్యతివచేసిన ప్రేమబలంబు' (284) పోగొట్టుకొని "క్ష్మాతాసువిరహజడు।"(331) డై ఉన్నాడు,గా శ్రీ విశ్వనాథసత్యనారాయణగారీ ప్రణాళిక ననుసరించిన కల్పనే చేసినట్లుంది

అది అలా ఉండగ వృషభరాశిలో సంపూర్ణంగా ఉన్న నక్షత్రం రోహిణి. ఆ రోహిణి గురుదైవత్యం. "నా దైవంబగున్మౌని" గా 360 వ పద్యంలో ఆ మాటగానే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు శబరి నోట పలికించటమూ ఈ ప్రణాళికలోదే. అంటే శబరిని గగనవీథిలోని రోహిణిగా ప్రతిక్షేపించటమే. ఆమె కాశ్రయం అయిన వృషభరాశి-అదే గురుమతంగ మహర్షి ఆశ్రమం. ప్రస్తుతం శబర్యాశ్రమంగా చెలామణిలో ఉందన్నమాట. ఆ ర్షాంగి సీతను బాసి (రెండు పాదాల మృగశిర వృషభరాశి ప్రవేశంగా) శ్రీరాముని శబర్యాశ్రమ ప్రవేశం ప్రతీకయై ప్రణాళిక సఫలం అయింది.

అయితే ఇంకేం? రోహిణి యందు సోమ (చంద్రుడే) ప్రీతి కలగటమూ కుదిరినట్లే ఔతుంది. "నక్షత్రములు" పుస్తకంలో ఆ మాట "ఖగోళమున రోహిణీ చంద్ర సమాగమము) కార్తిక మార్గశిరమాసముల నడుమ) ఎంతో మనోజ్ఞమై దర్శనీయమై యొప్పుచుండును. అదియునూ గాక మృగశిర ప్రక్కనే రోహిణి యుండుట చేతను మృగశిర చంద్రదైవత్యమై భేదములేక చంద్రుడను భావనతోనే వ్యవహరింపబడుచుండుట చేతనుకూడా పురాణకర్తలు తక్కిన భార్యలకంటె చంద్రునికి రోహిణియందు ప్రేమ యధిక మని వర్ణించి యుందురు." (పుట 53) అని స్పష్టంగా ఉంది. మన కల్పవృక్షంలో "శబరి-శ్రీరాముడు" వృత్తాంతంలో ఆ చంద్రుడే శ్రీ రామ చంద్రుడూ, ఆ రోహిణియే శ్రమణి. (శబరియందు శ్రీరాముని కనురాగమన్న భావకల్పనకు కుసుమబాణుని ప్రవేశపెట్టి కల్పనమీ ప్రణాళికా పరిపాలనకే శ్రీ విశ్వనాథసత్యనారాయణగారు భూలోక శబరి ద్యులోక యానంలో శ్రమణి అంటూ విడమరచి చూపటానికే కథాంతవేళనామెచేత "శ్రమణి" అను పేరుగా ప్రకటింపచెయ్యటం. కడకా పాంచ భౌతిక రూప శబరికి దేవతా రూప శ్రమణికి భేదం తలపోసి శ్రీరాముడే

గీ। ఒక అనిర్వచనీయమౌ - నూహచేత
ఆమె యీమె యనిపించు - టంతెకాని
దేవతారూపమైన యీ - దీధితికని
యోగినీరూపకామెకు-నుద్ధిలేదు. 385

అనటమెంత సమంజసమో చూడండి. ఆదీధితి ద్యులోక రోహిణీద్యుతి గదామరి. పోతే శ్రీరాముని మదిలో శబరిని చూడాలనే కోర్కెతారాడునట్లు చేయకునుమబాణుని ప్రవేశంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు చేసిన కల్పనయొక్క సామంజస్యమెల్లాగన్నది తేల్చాలి. అందుకూ మనం గగన విహారం చెయ్యవలసిందే. గత్యంతరం లేదు. మూల వ్యాసంలో మనం చెప్పుకొన్న శివమనసిజ వ్యవహారానికి కూడా సాక్ష్యం అక్కడే దొరకాలి. దైవ కటాక్షం వల్ల దొరకవచ్చు. ప్రయత్నిద్దాం.

ఆదిగో బాణ ప్రయోగం విషయం వచ్చేటప్పటికి ఎన్నో కథలు పుట్టు కొస్తాయి. ముందుగా ఈ క్రింది చిత్రం చూడండి.




ఈ అవతారం "పాశ్చాత్య జ్యోతిర్విదుల Orian the Hunter "వేట కాడు ఓరియన్ యోధుడు" వాడి తల మృగశిరా నక్షత్రము (మూడు చు క్కలు.) మృగశిర చుక్కలకు దక్షిణముగ మంచపు కోళ్ళవలె నాలుగు చుక్కలు గలవు. అందు ఆర్ద్ర 2. అనునది యొక బాహువు. ఆ నాలుగు వాడి మూతి కెదురుగా ఉన్నది రోహిణీ నక్షత్రం 5 (అయిదు) చుక్కల మధ్యను జాయగా మూడు చక్కలు మెఱయుచుండును. అవి యాపటకా

చుక్కలుBelt of arion, the Hunter అనియు, ఆపటకా చుక్కలనుండి ్రేలు మటి మూడుచుక్కలుఆ యోధుని ఖడ్గము Sword అనియు పడ మటి గాథలు గలవు. వారు పటకా అని చూపెడి చుక్కలనే మనరైతులు "గొల్లకావిడి చుక్కలు" అని చెప్పుదురు.'('నక్షత్రములు' పుటలు 54 & 55)ఆర్ద్ర భుజానికి క్రిందుగా కాలిసమీపమదున్న చుక్క Sirius. కాగా మనవాళ్లు మృగ వ్యాధ రుద్రుడంటారు. ఇప్పుడో కథ-

"గ్రీకు గాథలలో మహాకాయు డనదగిన orion యోధుడు తేలుకుట్టి చచ్చెనని చెప్పబడినది. ఆకాశమున నక్షత్రమండలములో ఓరియన్ (మన మృగశిర) యోధునకు వృశ్చిక రాశి ప్రతి స్పర్థి. సమసప్తకమున (ఈ రాశి వృషభం. అది వృశ్చిక రాశికీ అలాగే వృశ్చికం వృషభానికీ సరిగ్గా ఎదవదవ టం) చుక్క ఎదురుగా నున్నది." శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారిదే మరో పుస్తకం 'చుక్కల సుద్ది' పుట 17 మళ్ళీ 102వ పుటలో, orion యోధునికి వృశ్చిక రాశి చుక్కెదురు. వృశ్చికము తూర్పున నుద యము కాగానే orion అస్తమించును. ఈ జ్యోతిర్విషయమునాధారముగా జేసుకొని గ్రీకు లీ యోధుడు తేలుకుట్టి చచ్చెనని గాథలల్లు కొనిరే! విన్నారా వింత! తేలుకుడితేనే మహాకాయుడైన ఓరియన్ యోధుడు మరణించటం ఎలా నిజమైందో. ఇప్పుడదే ఖగోళదృశ్యానికి మన పురాణగాథ.

వారి ఓరియన్ మనకు మాయా మృగరూపుడైన వృత్రాసురుడు. వాడికి ప్రతిస్పర్థివృశ్చిక రాశిలోని జ్యేష్ఠా నక్షత్రం. అది ఇంద్రదైవత్యం. అంటే ఇంద్రుడే ఇప్పుడూ కథ "ఇంద్రవృత్రులు ప్రబల ప్రతి స్పర్థులు. మృగ శిరస్కుడును మాయామృగరూపుడును నగువృత్రాసురుడు దివిజగంగా ప వాహమున కడ్డుపడి భూమిమీద వర్షపు చినుకు పడకుండ చేయుచు ప్రజలను తపింప చేయుచుండును. అపుడు ఇంద్రుడీ వృత్రాసురుని సంహరించి

వృత్రునియడ్డుమాన్పి సకల ప్రాణులకును ఆహ్లాదకరముగ వర్షప్రదాన ము గావించును. జ్యోతిశ్శాస్త్రము లో ఇంద్రు డధిదేవతగాగల జ్యేష్ఠనక్షత్ర సహితమైన పున్నమ దినములలో సూర్యాస్తమానము కాగానే తూర్పున జ్యేష్ఠఉదయించి నపుడీ మృగశిర వృత్రుడస్తమించును, దీనినే మృగశిరాప్రవేశ మందురు. (మృగశిరనూర్యునిచేరుట)మృగశిరకార్తెచొరబడి నప్పటి నుండి వర్షసమృద్ధియగును. ('నక్షత్రములు' 125పుట.)

చూసారా! మనం ఇంద్రుని దైవంగా ఎందుకు పరిగణిస్తామో. ఈ వృత్రాసురేంద్రయుద్ధంలో మనంగుర్తించుకోవలసిన ఒక విశేషం ఉంది. "ఇంద్రునికి స్త్రీవ్యసనముగలదని వృత్రుడెఱుగును. ద్వంద్వయుద్ధమునకు ఇంద్రునితో తలపడకముందు వృత్రాసురుడు రోహిణి, పరివృత్త **Alpha Taurns Aldebaran (Bellatri) also Knour as Gamma Orin, Orion** మొదలగు నందగత్తెలను, చక్కని చుక్కలను ఎరచూపి ఇంద్రుని కూల ద్రోయనెంచెనని వేదమున కలదు." ('చుక్కలసుద్దిలో పుట 100)

ఇక్కడ మనం శబరి లేక శ్రమణి సూచకం అయిన రోహిణి చక్కనిచుక్క అనీ ఇంద్రునికి ఎరవేయబడిందనీకదా కథనం! రోహిణీ అంటే చంద్రుడికి ప్రీతి ఎక్కువని ఇదివరకే గుర్తించాం. ఈరోహిణి అందం తండ్రినే మోహింపజేసిన కథ ఐతరేయబ్రాహ్మణంలో ఉందిట. "ప్రజాపతి తనకుమార్తె ఆయిన రోహిణిని బలాత్కరింపబోగా మాయామృగరూపు డగు (వెనుకటి వృత్రుడే ఇట ప్రజాపతి)నా ప్రజాపతిని రుద్రుడు బాణప్రయోగముచే పడగూల్చి దేవతల హాహాకారము మాన్పివారిచే పశుపతిత్వమును వరముగ బడసెను. మనరైతులు గొల్లకావిడి చుక్కలనెడి మూడుచుక్కలును మృగ వ్యాధ (రుద్రు) డేసిన బాణమనియు దానికి నాలుగు ప్రక్కలను మంచముకోళ్ల వలెనున్న నాల్గుచుక్కలును మాయామృగ దేహమనియు లోకమాన్య తిలకుగారి యన్వయము. రోహిణి గొల్లకావిడి చుక్కలు మృగవ్యాధుడు-ఈచుక్క లన్నియు నాక్కపంక్తిలో నించు మించుగా

నుండుట మనము ముఖ్యముగా గమనింపవలెను" (నక్షత్రములు. పుట 70) బాగానే ఉంది. కాని ఇందులో బాణము గొల్లకావడి చుక్కలనటం పొరపాటు. అవి ఓరియన్ పటకా మాత్రంగానే గుర్తింప బడ్డాయి. కాగా బాణ మన్నది. ఆపటకానుండి వ్రేలాడే కత్తిగా ఉన్న మూడు చుక్కలన టం సమంజసం అని చిత్రంలో చూస్తే స్పష్ట మౌతుంది. అదలా ఉంచితే ఈకథలో రోహిణిని తప్పిస్తే త్రిపురాసుర సంహారం కథ వెలికివస్తుంది. చూడండి.

"త్రిపురాసుర సంహారసమయమున ఈశ్వరుడు రథికుడు, బ్రహ్మ సారథియునై యా రథమువెక్కి యసురసంహారము గావించి, త్రిపురముల ధ్వంసముచేసినట్లు భాగవతాది పురాణములు వర్ణించుచున్నవి. తెనుగు రైతులు గొల్లకావిడి చుక్కలనియు పడమటి జోస్యులు Belt of Orianఓరి యన్ యోధుని పటకా చుక్కలనియు చూపిచెప్పెడు మూడుచుక్కలే ఈ త్రిపురములు." ('చుక్కలసుద్ది' పుట 92) ఇక్కడ కూడా బాణం అగ్రికు యోధుని కత్తిగా నున్న మూడు చుక్కలే అన్నది స్పష్టం.

ఈ గాథలను బట్టి ఖగోళంలో ఉన్నదృశ్యాన్ని చూపి బాగా అవగాహన చేసికొని శ్రీ విశ్వనాథసత్యనారాయణ గారుకూడా ఓ క్రొత్త కథకు ప్రణాళిక సిద్ధంచేసారు. అదే కుసుమబాణుని తెచ్చిన మధ్యాక్కఱ పద్యం. దాని అ న్వయపరిశీలనకు ముందు మనం కొన్ని ప్రాథమికాభిప్రాయాలని దృఢి చే సుకోవలసి ఉంది. గమనిచండి.

వృత్రాసురుని లేదా ప్రజాపతి యొక్క మాయామృగ దేహం మంచం కోళ్లలా ఉన్న నాలుగు చుక్కలు సూచిస్తాయని పైన తెలుసుకొన్నాం. అ లాగే వాడి ఎడమ (చిత్రంలో మనకుడి ప్రక్క) భుజం ప్రవాళంలా మెరిసే ఒంటి నక్షత్రం ఆర్ద్ర రుద్రుడని గ్రహించాం. సరిగ్గా అదే ప్రక్కన కాలుప్రక్కగా ఉన్నది (మృగవ్యాధ బిరుదం ఆమృగాన్ని వేటాడినలదుకు

చేరింది కాగా) రుద్రుడే ఈ త్రిపురాసురవధలో అయితే ఇద్దరు రుద్రులా! ఇద్దరే ఏమిటి! భూతేశ రుద్రుడని ఇంకోడున్నాడు." స్వాతిని పాశ్చాత్యులు ఆర్క్టచ్యూరస్ Arcturus అందురు. వారి బూటీస్ Bootes అనెడి చుక్కలగుంపులో నీ చుక్క ముఖ్యమైనది. పాశ్చాత్యుల వాడుకలోనున్న యీ Bootes పదము సంస్కృత భూతేశ శబ్దమునకు వికృతి. భూతేశు డనగా శివుడు." (నక్షత్రములు పుట 102). ఈ భూతేశుని మాట మన కిప్పుడక్కరలేదుగాని మృగవ్యాథ రుద్రుని మాట మన కథకిప్పుడవసరం. ఆర్ద్రరుద్రునికీ, వ్యాథరుద్రునికి అనుబంధం మనకు తెలియాలి. అది పెద్దా చిన్నా అనే తేడాలో ఉంది.

"ఊహింపరానంత విశేషమైన దూరమునందుండుటచేత నీ నక్షత్ర ముచిన్నదిగ కనబడుచున్నది. కాని నిజము పరిశీలించినచో ఆర్ద్ర మన సూర్యునికంటె పండ్రెండు వందల రెట్లు అధిక తేజస్సుతో ప్రకాశించు చున్న మహాగోళము. దీని వెలుగు మనకు చేరుసరికి రెండువందల సంవ త్సరములు పట్టుచున్నది." (నక్షత్రములు పుట 55) కాగా మృగవ్యాథ రుద్రుడు-

"తేజోవిషయమున నగ్రగణ్యములని పేర్కొనబడిన ఇరువది first magnitude stars లో మొట్టమొదటివీ మృగవ్యాథ రుద్ర నక్షత్రమే. ఇదియే పడమటి వారి Sirius సిరియస్ చుక్క. ఇయ్యది సూర్యునికంటె $26^1/_3$ రెట్లు తేజోధికమైనది. ఎనిమిది సంవత్సరములన్నర వెలుగు సం వత్సరముల దూరమున నున్నది." (నక్షత్రములు పుట 71)

ఇందులో తేజోగ్రగణ్యతారల లెక్క ఎలా మొదలో ఏమోగాని సూర్యతేజానికంటె రెండువందలరెట్లు తేజంగల ఆర్ద్ర రుద్రునకంటే-అవే సూర్యతేజానికి $26^1/_3$ రెట్లు మాత్రమే అధిక తేజమున్న వ్యాథరుద్రుడు చిన్నవాడనటం అదీ చాలా తేడాలో ఉందనటం స్పష్టం రెండింటా రుద్ర

శబ్దం సామాన్యం. కనుక పెద్దది తండ్రి, చిన్నది కొడుకూగా భావించటం సమంజసమే. కాదంటే తల్లి ఎవరనే సమస్యవస్తుంది. ఆ బాధ తప్పించటానికో మార్గం ఉంది. తండ్రి మహిమోపేతుడై తన సంకల్ప మాత్రంగా పుత్రునికి జన్మ కల్పించటం అది. సంకల్పం మనసుయొక్క పని గాబట్టి ఆ మనసువల్ల పుట్టాడనవచ్చు. అప్పుడా కొడుకు మనసిజుడు ఔతాడు. అంటే ఆర్ద్రరుద్ర మనసిజుడీ వ్యాధరుద్రుడన్న మాట. మనసిజుడి పని ఏమిటి? మనసు (ఇష్టం) కలిగించటం. అలా వ్యాధుడవడం మూలంగా వేటాడటమూను. అలా యువతీయువకులందు పరస్పరం ఇష్టం కలిగించే వేటాడే వాడొకడు మన పురాణాల్లో మన్మథుడని ఉన్నాడుకదా! ఉన్నాడు గానివాడు ధనూరాశి సంబంధీకుడుగా దేహక్షేత్రాన పునఃసృష్టికైనా కామన కలిగించటంతో సరిపెట్టుకుంటాడు. అయితే వ్యాధరుద్రునివేట ఏమి ఇష్టం కలిగించడానికి? అంటే భక్తివాత్సల్యాలను ప్రేరేపించటానికి వాటి పరంగా పరస్పరావగాహనతో సమష్టిసహకార జీవనోన్నతమైన ఔదార్యభావాన్ని (దయాదాక్షిణ్యాదివన్నీ)కార్యక్షేత్రాన ప్రీతి కలిగించటానికి వ్యాధరుద్రుని వేట. ఆ జగచ్ఛ్రేయోరూప ప్రీతిలో వ్యక్తి (వ్యష్టి) ప్రేయోరూప కామన కూడా ఇమిడే ఉంటుంది. కనుక ఈ రుద్ర మనిసిజునిదే ఉన్నత స్థానం. శివశ్రేయోనురాగం విష్ణుప్రేయోఽనురాగ సహితమే అనటానికి రూప కల్పనా విషయమైన ఉపాయమే మెత్తని మేని విభూతి ధారణా, 2 మెడలో తులసి పేరు వేసుకోవటాల నెన్నటంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి కథా కవితార్ధ - లో యుక్తికి నిదర్శనం. ఇపుడా మధ్యాక్కఱ.

మెడలోనఁదులసి పేరొకటి- మెత్తనిమేని విభూతి
వడి దియ్యవిల్లూని కుసుమ - బాణుండు బాణంబు చివర
సడలు రేకుల తుమ్మిపూవు - సంధించిక్కొసుతా విరహ
జడుమీఁద రాముని మీఁద - జ్యావల్లి సారించి విడిచె. 331 ప

జాగ్రత్తగా గమనిస్తే - సంసార చక్ర భ్రమణాన్ని కుటుంబ వ్యవస్థాపర మైన ప్రేయఃకామనగా అనిపించినా మనశ్చాంచల్యాన్ని గార్హస్థ్యధర్మబం ధంగా వంచటానికి సూచనగా మెడలో తులసి పేరునూ- సర్వజన క్షేమా భ్యుదయ పథమైన శ్రేయః కామనగా సహకారపరమైన దయాదాక్షిణ్యాల ధీరోదాత్తకార్యక్షేత్రాన విస్తరించటానికి సూచనగా ఒడలంతా మెత్తని(మేని) విభూతినీ ధరించి వడిగా ఆ ప్రేయమైని (తాత్కాలికముగా ప్రేయమూ కడకు శ్రేయమూ అయిన) అనురాగ మాధుర్యలక్షణయుక్తం అయిన తియ్యవిల్లు తీసుకొని శివమనసిజుడైన వేటకాడు (సున్నిత లక్షణ ప్రమే యంగా అతడూ కుసుమబాణుడే) తన బాణం చివర ఆత్మ నివేదనా ప్రి యమై విచ్చుకొన్న రేకులు గల తుమ్మి పూవు నమరించి ఆ బాణాన్ని విం టికి (నారికి) తగిలించి మృగశిరా సోమయోగ విష్ణ్వవతార సీతారామ యో గం నుండి వృషభరాశి యనబడే రోహిణీ రూప శ్రమణి ఉంటున్న ఆశ్ర మ ప్రవేశ సందర్భంగా-సీతఅర్ధాంగ మెడబాసి సగమై (క్ష్మాసుతా విరహం చేత "అయ్యతివ చేసిన ప్రేమబలం" ఆయిన చేవమాసి) జడుడైయున్న శ్రీరాముని మీద నారిలాగి విడిచిపెట్టాడు - చూసారా! ఒక వంక జాతీయ భావయుక్తంగా, మరో వంక ఖగోళదృశ్య వర్ణన పూర్వకంగానూ కూడా అన్వయించేటట్లు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి మధ్యాక్కర శిల్పం ఎలా చికిలీ చేయబడిందో! ఆఁ -ఎవరికి తెలుస్తుందండీ అని పెదవి విరుస్తా రు కొందరు. ఏదైనా అసలు తెలుసుకొనే ఉన్నత విద్య మనం అందిస్తే గదా! ఈ పెదవి విరిచే వాళ్ళిలా దిగలాగటం వల్లే తెలియకపోవటం అనేది మొదలైందంటే అనుమానించ నక్కర్లేదు. తెలుసుకోనిచ్చే ప్రోత్సాహం లభిస్తుందనే ఆశిద్దాం.

ఆ సంగతలా వదిలితే శ్రీ రాముడా బాణం గుండా వచ్చింది తుమ్మి పూవే అని తాను గ్రహించాడా అన్నట్లు ఆయన లక్ష్మణుడితో చెప్పే కం

వ పద్యంలో ఆ పూపు తెలి తమ్మిపూవు బాణము పతెనయి (ముందే తమ్మి పూవయితే-ఇప్పుడు తమ్మిపూవు బాణముపతె నయిగా చెప్పనక్కఱ లేదు. కనుక తుమ్మి-తమ్మి అయిందనే రూఢి) నాఅత్మలో పడింది. ఇంక శబరిని చూడాలనే కోరిక మనసులో తారాడుతోంది. అన్నాడు. అప్పుడా శబరి ఎలా ఉందంటాడో తెలుసా! "వలిమేని ప్రసన్నగు ముడుతల శబరి" అని,

ఆవలి మేని ప్రసన్నగు ముడుతలది - అంటే ఒక వంక వలి-అంటే కంపిస్తున్న, మేని-అంటే శరీరం యొక్క ప్రసన్నగు-అంటే మనోజ్ఞమైన ముడుతల అంటే ముసలితనం వల్ల చర్మం ముడుతలు పడి ఉన్నట్టిదనీ, కాగా ఆ చివర శబరి అని వాచ్యంగానే ఉంది. ఇప్పుడు మరోవంక వలి అంటే - చల్లని (కార్తిక మార్గశిరాల సంధి వేళ అదే శరద్హేమంత సంధివేళ రోహిణీ చంద్ర సమావేశం గనుక ఆ కాలం చల్లగానే ఉంటుంది. అసలు నాగుల చవితితోనే చలి మొదలంటారు) మేని అంటే-కాంతిచే (మేని శబ్దానికి కాంతి యని శబ్ద రత్నాకరం పుట 642) ప్రసన్నగు అంటే-పైలాగే మనోజ్ఞమైన అనే అర్థం. ఇంక ముడుతల అంటే మడతలు గుర్తులున్నట్లనిపించేది. ఏది? అది రోహిణి." అనగా కొయ్యలకును మేకులకునూ త్రాళ్ళతో బిగించి గట్టిగా కట్టిన డేరా వలె రోహిణి ఖగోళమున నిలచిపోయెనని శ్రీనాథుని అభిప్రాయము." (నక్షత్రములు పుట 43) అంటే రోహిణీ నక్షత్రరూపంగా శబరిని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ముద్దుముద్దుగా రెండు శ్లేష శబ్దాలని మాత్రం వాడి మనకు ప్రత్యక్షీకరింపజేసాడు.

రోహిణి రథాకారంలో ఉండే అయిదు చుక్కల గుంపు అనీ, అది వృషభరాశిలో తలగా ఉందనీ ముందే తెలుసుకొని ఉన్నాం మనం. కాగా ఆ అయిదింటిలో యోగతార-చూసేవాళ్ళ ఎడమవైపు (అరథాకారంలో)

చివర కనిపించేదే. అది యెద్దు తలలో కన్నుగా ఉంది. ఆ చూపు ప్రధానంగా నిరీక్షింప నాదేశించి-ఆ నక్షత్రాధి దేవత బ్రహ్మణః అన్న ప్రజాపతి గురుడు. తనకాశ్రయమైన వృషభరాశి ఆశ్రమాన్ని ఆ రోహిణీ శ్రమణి లేదా శబరి కప్పగించి (ఆ గురుడు మతంగ మహర్షి) దివికి వెళ్ళిపోయాడు ఇప్పుడు అందులో ప్రవేశించేందుకా అన్నట్లు రాముడు మృగశిరా సోమ యోగ సదృశం అయిన సీతాయోగం విడివడిన సూచనగా అర్ధాంగిని బాసి విరహజడుడై వచ్చాడు. అలాఅంతా వృషభరాశి చైతన్యమే "కల్పవృక్షంలో శబరి-శ్రీరామకథావిస్తృతికి ప్రణాళిక అయిందనీ, అది ఓ మధ్యాక్కరలో మరో కందంలోనూ దాచిపెట్టబడిందంటే ఆశ్చర్యంగా లేదూ!

ఖగోళంలోని ఈ వృషభరాశి వృషభమే-మిధునరాశి అనబడే పార్వతీ పరమేశ్వరుల జంటకు వాహనమైన వృషభము. అడ్డమైన గడ్డీ కఱచు పశువుపై శివుడెక్కి విహరించుట బాగున్నదా" అను విమర్శకు 'ముందు కాళ్ళకు బందము వైచినట్లు ఇట్టి యాక్షేపకులకు మొదటనే సమాధాన మిచ్చుట మంచిదని కాబోలు మంత్రద్రష్టలైన వేద ఋషులు ఈ వృషభము "నస్మైతృణం నోదకమ్" గడ్డి తినదు నీరు త్రాగదు అని తెగవేసి ఖండించి వ్రాసినారు (చూ. ఋ $\times$ 102-10)" నక్షత్రములు పుట 64) ఇది లక్ష్యంలో ఉంచుకొనే-నీరు గొనని వృషభరాశ్యంతర్భాగమైన రోహిణీ లక్షణాన్నే శబరిలో శ్రీ విశ్వనాథ గుర్తింపచేయటానికి ఎప్పుడు నీటి ప్రస్తావన వచ్చినా శబరి తప్పించుకోవటంగా ఎబ్బెట్టుగా కనబడేట్టు వ్రాసాడు. ఆ ఎబ్బెట్టుని పట్టుకుంటేనే గదా మనకి పెనుగుట్టు బయటపడింది! దీంతో మనం రాబట్టుకోవాలని చూసిన పన్నీ గిట్టుబాటైనట్లే. కృతార్థులం. అది గురు దైవ కటాక్షఫలం.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు తన 'కల్ప వృక్ష రహస్యాల్లో' ఈ వివరం మాటెత్తినా ఎత్తక పోయినా కూడా ఆయన కవితాత్మ ఈ వివరాల

న్నింటినీ శ్రీ మద్రామాయణ కల్పవృక్షంలో శబరీ శ్రీరామ సమావేశ సన్ని వేశంలో నిక్షిప్తం చేసి ఉండటం నిజం. అటువంటి ఆ కవి సమ్రాట్‌లోని మహాకవి చైతన్యానికి చేతులు మోడ్చి జోహారనవలసిందే. అలాంటి వాడికి జ్ఞాన పీఠమేమిటి- అసలే అవార్డయినా రావడంగానీ అంధ్రప్రదేశ్ ప్రభుత్వం కట్టబెట్టిన ఆస్థానకవి పదవిగానీ తమయోగ్యతను నిలబెట్టుకొన్నాయేగానీ అవి ఆయన కెక్కువైనవేంకాదు.అంధ్రుల పుణ్యం. ఆయిన శ్రీ మద్రామా ణ కల్పవృక్షము వ్రాసాడు. అయనెలాగూ ధన్యుడే. చదివి తెలుసుకుంటే మనమూ ధన్యులమే.

సర్వత్ర సంస్థితం దేవం తం వందే పురుషోత్తమమ్

—మంగళం మహత్

4-6-1991<br>మంగళవారం<br>ప్రజోత్పత్తి నిజ వైశాఖ<br>బహుళ సప్తమీ

జొన్నవిత్తుల రామకృష్ణ శర్మ<br>తెలకోవెల, బలుసుమూడి<br>భీమవరం. ప. గో॥ జిల్లా

జ్ఞానేశ్వరి పవర్ ప్రెస్ భీమవరం వారి సహకారముతో<br>ఇమ్రాన్ ఆర్ట్ ప్రింటర్స్ లాంచీల రేవు, భీమవరం-1

ముద్రణ : 1991 నవంబర్
ప్రతులు : 500 కాపీలు

ముద్రణ :
శ్రీ జ్ఞానేశ్వరీ పవర్ ప్రెస్
రెస్టుహౌస్ రోడ్, భీమవరం-1
వారి సౌజన్యముతో

ఇమ్రాన్ ఆర్ట్ ప్రింటర్స్
లాంచీల రేవు
భీమవరం-1

వెల రూ. **35-00**



# ఇతర రచనలు [ప్రచురణ అయినవి]

1. వసు చరిత్ర ప్రబంధ దర్శనం ( పారదర్శక విమర్శ )

2. సోమేశ్వర మహాత్మ్యము [సోమవార వ్రత కథ]
హరికథాగానము

3. చిత్రకళా రామచంద్రీయము - లీలా ప్రబంధము

4. శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో శబరి -
[శ్రీరాముడు - విగ్రహ విమర్శ]

5. శతక రామచంద్రము (గీతపద్య రామాయణము)

